శ్రీ ర స్తు.

# ఆ నం ద మ ఠ ము



నాలవకూర్పు.



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

# ఉత్సర్గము.

శ్లో. క్వను మాం త్వదధీనజీవితాం
వినికీర్య క్షణభిన్నసౌహృదః,
నలినీం క్షతసేతుబన్ధనే
జలసఙ్ఘాత ఇ వాసి విద్రుతః.

ఇహాపరములు రెంటికిని సంబంధ మున్నది. ఆసంబంధముయొక్క జ్ఞాపకార్థము ఈగ్రంథ మీవిధముగా ఉత్సర్గము చేయఁబడియె.

---

శ్లో. యేతు సర్వాణి కర్మాణి మయి సంనస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే.
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరా త్పార్థ మయ్యావేశితచేతసామ్.
మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.
అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ.

(శ్రీభగవద్గీతా 12 అధ్యాయము.)

# విజ్ఞప్తి

ఈ "ఆనందమఠ" మను గ్రంథమును బంగాళదేశమునందు ప్రసిద్ధోపన్యాసలేఖకు లని ప్రఖ్యాతిగాంచిన శ్రీ బంకించంద్రచట్టోపాధ్యాయులవారు బంగాళీభాషయందు రచియించిరి. శ్రీ బిపినచంద్రపాలుగారు 1907-వ సంవత్సరమున ఈ రాష్ట్రమున స్వదేశిప్రచారము సాగించుచున్నపుడు రాజమహేంద్రవరమున వారిని కలిసికొంటిని. వారు వెంటనే కలకత్తా వెళ్లి బెంగాలీ ఆనందమఠ ప్రతి పుచ్చుకొని తగువారిసహాయముచే నన్ను తెనుగుతర్జుమా చేయమని కోరినందున అట్లే చేసితిని. మరల చెన్నపట్టణము చేరగనే తెనుగుతర్జుమా కాకితముల ఓ. వై. శ్రీ దొరస్వామయ్య కిచ్చి సాఫువ్రాయమని కోరితిని. వారు కర్ణాటకమున శ్రీ బి. వేంకటాచార్యులచే ప్రచురింపఁబడిన ప్రతినికూడ సహాయము పుచ్చుకొని సరిచూచియిచ్చిరి.

## కథాసారాంశము.

1. ఈ గ్రంథమునందు బంగాళాదేశము ఆంగ్లేయు లుద్ధారము చేసినవిషయము లుదాహృతములై యున్నవి.

2. స్త్రీలు, కొన్నిసమయములయందు పురుషులకు సహకారిణులుగ నుందురు. కొన్నిసమయములయందు కారు.

3. సమాజక్షోభము ఆత్మపీడనమాత్రము. రాజవిద్రోహులు ఆత్మఘాతుకులు.

ఇది బంగాళీదేశమునందు 1773-74 సంవత్సరములందు జరిగిన సన్న్యాసివిద్రోహచరిత్రాధారముచే రచయిత మైనది. సన్న్యాసివిద్రోహ (Sannyasi Rebellion) యథార్థచరిత్రము ఇంగ్లీషు గ్రంథములందు ఉద్ధృతమై యున్నది. పరిశిష్టమును (Appendix) జూచిన వేద్య మగును. ఉపన్యాసమందు వర్ణింపఁబడిన యుద్ధములు వీరభూమియందు జరుగలేదు. ఉత్తర బంగాళా ప్రదేశమునందు జరిగినవై యున్నవి. ఈ వ్యత్యాసము గ్రంథమునం దుండుటను దోషముగా గ్రహింపకుఁడు. ఏలన, ఉపన్యాసము చరిత్రము కాదు కదా!

బెంగాలువిభజనమునకు ప్రతికూలముగ 1906-వ సం॥ ప్రాంతమున బెంగాలునందేకాక దేశమంతట తీవ్ర ప్రచారము సాగెను. బెంగాలీలు బారిసాలునందు రాష్ట్రియ కాన్ఫరెన్సు సాగించినపుడు అధికారులు దీనిని చెదరగొట్టి శ్రీసురేంద్రనాథ బనర్జీవంటివారినెత్తిని బ్రద్దలు కొట్టిరి. అల్లరికి 'వందేమాతరము' గీతమును పాడుటయే కారణములలో నొకటి యని తెలిసినది కావున యీగీత మున్నవలను ముద్రించుటలో నేను యెన్నికష్టములకు పాలైతినో చదువరు లూహింపవలెను.

ఇట్లు,

వావిళ్ల వేంకటేశ్వరులు.

శ్రీ ర స్తు

# ఆ నం ద మ ఠ ము

## ఉ ప క్ర మ ణి క

అతివిస్తృతం బైనయొకానొక యరణ్యంబునందు అధి కాంశము సాలవృక్షంబులును, మఱియు ననేకములగు ఇతర జాతి వృక్షంబులు నుండెను. వృక్షశాఖలు పర్ణంబులతో దట్టం బుగా పెరిఁగి యాకాశము నంటఁబోవుచున్నవో యనున ట్లుండెను. వెలుతురు చొరనంత దట్టముగా చెట్లసమూహ ముం డెను. అనంత మైన పల్లవసముద్రము బహుదూరము వ్యాపించి యుండెను. గాలిచే పర్ణంబులు తరంగములవలె పైకి లేచిపోవు చుండెను. గాఢాంధకారము. పట్టపగటియందుఁ గూడ స్ఫుట మైన ప్రకాశము లేదు. భయంకరముగా నుండెను. మనుష్య ప్రవేశము లేదు. ఆకుల మర్మరశబ్దమును, వన్యమృగములయు, పక్షిజాతులయు శబ్దమును తప్ప ఇతరధ్వని లేదు.

ఆ యరణ్యము విస్తారమై అతినిబిడమై అంధతమో మయ మైనది. అందులోను రాత్రికాలము, రాత్రియందును అర్ధరాత్రి, అర్ధరాత్రియందును అతిశయమైన అంధకారము, అరణ్యబాహ్యప్రదేశమునందును అంధకారమే; ఏదియుఁ గన బడదు. అరణ్యములోపల భూగర్భమునందలి అంధకారము వలె తమోరాశి నిండియుండెను.

పశుపక్షులు నిశ్శబ్దముగా నుండెను. కోటానుకోట్లపశు పక్షికీటకాదు లావనమునందు వాసము చేయుచుండెను. అయిన నను, ఒకదాని శబ్దముకూడ వినఁబడలేదు. శబ్దమయప్రపంచమునం దున్నవారికి, ఆ నిశ్శబ్దభావము ననుభవించుట మహాకష్టము.

తుదమొదలులేని యా వనమధ్యమందు, ఆసూచ్యభేదమైనట్టి యంధకారమయమైన యర్ధరాత్రియందు, అననుభవనీయమైన నిశ్శబ్దమధ్యమున "నామనోరథము సిద్ధికాదా, ఏమి?" అనెడి శబ్దము వినఁబడెను.

ఈశబ్దమును విన్నతోడనే ఆయరణ్యము మరల నిశ్శబ్దమున మునిఁగిపోయెను. ఇట్టి భయంకరమైన మహారణ్యంబునందు మనుష్యధ్వని వినఁబడు నని యెవ్వరు చెప్పుదురు? కొంచెము సేపటికి అనిస్తబ్దమును భంగించికొని మనుష్యకంఠస్వరముతో "నామనోరథము సిద్ధికాదా, ఏమి?" అను ధ్వని యే మరల వినఁబడెను.

ఇట్లు ముమ్మారు ఆయంధకారసముద్రమునందు ధ్వని వినఁబడెను. ఆప్రశ్నకు ఉత్తరముగా "దీనికై నీవు సమర్పించు కానుక యేది ?" అనెడి శబ్దము వినఁబడెను.

దానికి ప్రత్యుత్తరము—'నాప్రాణమే దీనికి కానుక.'

మరల ప్రతిశబ్దము—'ప్రాణము కేవలము తుచ్ఛమైనది, అందఱును దానిని త్యజింపఁగలరు'.

'వేఱేమి కావలయును? దేనిని సమర్పింపవలయును?'

దీనికి ఉత్తరము—'భక్తి.'

---

# మొదటి ప్రకరణము

---

## మహేంద్రసింహుని ప్రవాసము.

సుమారు వేయిన్ని నేడువందల డెబ్బది మూఁడవ (1773) సంవత్సరము గ్రీష్మకాలమున పదచిహ్నా మను గ్రామమునం దొక్కనాఁడు ఎండ వేఁడిమి మహాబలముగా నుండెను గ్రామమో పెద్దది. వేలకొలఁది యిండ్లున్నవి. అయినను గ్రామమునం దొకఁడైనను కనఁబడలేదు. చాలు చాలుగా అంగళ్ల వీథులు, పెద్దమార్కెట్, ఒక్కొకవీథిలోను వేలకొలఁదిపూరి యిండ్లు, వానిలో పెద్దవిగను చిన్నవిగనుండు మేడలును కలవు. ఆదిన మెచ్చటను నిశ్శబ్దమే. అంగళ్లు మూసియుండెను. ఆ దినము సంతచేరువారము సంతలోను ఎవరును లేరు. భిక్షమునకు వచ్చువారును ఆదినము గాలేదు. నేఁతగాండ్రు మగ్గములను కట్టివేసి యెచ్చటికో పోయి యేడ్చుచుండిరి. రైతులు గొడ్డుగోవలనువిడిచిపెట్టి బిడ్డలతోఁగూడి యెక్కడికోపోయిరి. పాఠశాలలను మూసివేసి ఉపాధ్యాయులు పరుగిడిపోయిరి. బిడ్డలనుఁగూడ గట్టిగా నేడ్పుటకు ధైర్యము లేదని తోఁచెను. రస్తాలలో నొక్కఁడైనఁ గనఁబడఁడయ్యె. గుంటలును చెఱువులును విజనమై యుండెను. ఇంటిముంగిళ్లలోను మనుష్యులు లేరు. చెట్లలోఁగూడ పక్షులు లేవు. కొట్టములలో నొక పసరమైన లేదు. కేవలము శ్మశానమువలె కుక్కలు నక్కలు తిరుగుచుండినవి.

ఒక పెద్దమేడ; ఆ యింటి సోపానములు దూరముగ నుండిచూచినను గనఁబడుచుండెను. ఆగృహారణ్యమధ్యమునం దాసౌధము పర్వతశిఖరమువలె కనఁబడుచుండెను. పోయి చూడఁగాఁ కవాటబంధనము చేసియుండెను. కేవలనిశ్శబ్దము. గాలిపోనుగూడ దారిలేదు. ఇల్లు మిట్టమధ్యాహ్నమునందును చీఁకటిగా నుండెను. ఆచీఁకటిలో, అర్ధరాత్రిలో, వికసించిన కుసుమయుగళమువలె దంపతులిద్దఱుకూర్చుండి యాలోచించుచుండిరి. మహాక్షామము ప్రాప్తమైనది.

వేయియు నేడువందల డెబ్బదియొకటవ (1771)సంవత్సరమునందు పంట చక్కఁగా పండలేదు. ఆకారణముచే మఱుచటిసంవత్సరమున ధాన్యము ధర హెచ్చైనది. జనులకు మిగుల కష్టము సంభవించెను. దొరతనమువారును దమకుఁ జేరవలసిన పన్నుకై ప్రజలను కష్టపెట్టి గొడ్డుగోదలు నేలలు జప్తిచేసి వసూలు చేసికొనిరి. ఇందువలన బీదలు దినమున కొకపూట భోజనము చేయుచు ప్రాణమును బిగబట్టుకొని యుండిరి. డెబ్బదిమూఁడవ సంవత్సరమునందు మంచి వానలు కురిసెను. ఆసంవత్సరమున జనులు దేవునికి మనయెడ దయ కలిగిన దని చెప్పుచుండిరి. కొందఱు కష్టము తీఱె నను కొనుచుండిరి రైతులు సంతోషముతో వ్యవసాయము చేయఁ దొడంగిరి. రైతులభార్యలు నగలు చేయవలసిన దని భర్తలను పీడించుచుండిరి. అయినను, వెనుకటిపైరు చేయు కాలములో నొక చినుకైనను పడలేదు. పైరంతయు నెండిపోయెను. ఒక్క గింజయైనను చేతికిరాలేదు. ఎక్కడనో యొకచోట కొంచెము ధాన్యము పండెను. సర్కారువారు ఆధాన్యమును తమసైన్య

ముకొఱకై రొక్క మిచ్చి తీసికొనిరి. జనులకు తినుటకు అన్నము లేకపోయెను. మొదట ఒకపూట ఉపవాసము చేయుటకు ప్రారంభించిరి. ఆకాలమున మహమ్మద్ రేజఖాన్ అనువాఁడు పన్ను వసూలుచేయు అధికారిగా నుండెను. వాఁడీసమయమున సర్కారువారికి అధికాదాయము కనఁబఱిచి తాను వారి దయకు పాత్రుఁడు కావలయు నని తలంచి మామూలుపన్నుకంటె నూటికి పదిరూపాయలు ఎక్కువ శిస్తు విధించినాఁడు. ఇందువలన బంగాళా దేశమంతయు అల్లకల్లోలముగ నుండెను.

జనులు బిచ్చమెత్తుటకు ప్రారంభించిరి. దుర్భిక్షకాలమున భిక్షము పెట్టువా రెవరు? అనంతరము ఉపవాసముచేయుచుండిరి. పదంపడి రోగములకు పాలైరి. తర్వాత గొడ్డుగోదలను విక్రయించిరి. ఆవల నాఁగళ్లు మొదలైన వ్యవసాయోపకరణములను అమ్మిరి. అటుపిమ్మట, విత్తనములకై యుంచుకొనియుండిన ధాన్యమును తినిరి తదనంతరము నేలలు ఇండ్లు విక్రయించిరి. ఆమీఁద నగలను, గుడ్డలను విక్రయించిరి. తుదకు భార్యలను బిడ్డలను సైతము విక్రయించిరి ఇంకేమి మిగిలియున్నది? ఏదియు లేదు. అయినను, పెండ్లాము బిడ్డలను విక్రయించినను కొనువారు లేరు వారిని పోషించుటకు మార్గమేది? అందఱును విక్రయించువారేరైరి. తీసుకొనువారు మాత్రము లేరు. అన్నము లేక ఆకు లలములు తినుట కుపక్రమించిరి. పచ్చిగడ్డిని, పశువులను, పక్షులను, కుక్కలను, నక్కలను, పిల్లులను, ఎలుకలను, ఉడుతలను, పందికొక్కులను తినిరి. అన్నియు తినిరైనవి. మిగిలిన దేదియు లేదు. ఇఁక నేమి చేయవచ్చును?

అనేకులు పరదేశములకుఁ బోయిరి. అచ్చోటఁగూడ అన్నము లేనందున అనేకులు చచ్చిరి. కొందఱు తినరాని వస్తువుల నంతయు తిని దానిచేఁ గలిగిన రోగములవలన మహాకష్ట మనుభవించి ప్రాణత్యాగము చేసిరి.

రోగాద్యుపద్రవములకు మంచి సమయము దొరకెను. జ్వరము, విషూచి, క్షయము, స్ఫోటకము మొదలగు రోగములు కలిగెను. ఒక్కస్ఫోటకవ్యాధిచేతనే అనేకులు గతించిరి. ఏయింటఁ జూచినను చావే; ఎచ్చోటఁ జూచినను రోదన ధ్వనియే. అట్టికాలమున నొకరి కొక రెట్లు ఉపచరింతురు? ఊఱడింపఁ జేయుదురు ఒకరి నొకరు చూచుటకే సాధ్యము కాకుండెను. చచ్చినవారిని మోయువారే లేకపోయిరి. అతి రమణీయసౌధములయందు రోగము వచ్చినవారు అచ్చటనే పడి పరితపించి ప్రాణము విడిచిపెట్టిరి. స్ఫోటకము కనుపించిన తోడనే వారి నక్కడనే విడిచిపెట్టి తక్కినవారు భయముచే పరుగిడి పోవుచుండిరి.

పదచిహ్నగ్రామమునందు మహేంద్రసింహుఁడను ధనికుఁ డుండెను ఈక్షామకాలమున ధనికుఁడును నిర్ధనికుఁడేకదా. దుఃఖపూర్ణసమయమునందు వానిస్వజనులును, పరిజనులును వ్యాధిచేఁ బీడింపఁబడినవారై యందఱును వెడలిపోయిరి. కొందఱు మృతిఁజెందిరి. ఆగొప్పమేడయందున్న యనేకజనులలో వాఁడును, వానిభార్యయు, వాని కూఁతురు పసిపిల్లయు, చావునకు తప్పియుండిరి.

మహేంద్రసింహునిభార్య కల్యాణి, ఆలోచన చేయుటనుమాని, తానే పాలుపిండి కాఁచి పిల్లకుపోయుచు, ఆవులకు

మేఁతవేసి నీళ్లు పెట్టుచు నుండెను. ఒకనాఁడు మహేంద్ర సింహుఁడు భార్యను జూచి—ఇట్లెన్నాళ్లు నీవు చేయఁగలవు? అనెను.

కల్యాణి—చాలాదినములు జరుగదు. జరిగినన్నాళ్లు జరుగనిండు. పిమ్మట తాము బిడ్డను పిలిచికొని నగరమునకు పోయి చేరవలసినదే.

మహేంద్ర—నగరమునకుఁ బోయి చేరవలసినపుడు నిన్నేల నే నింత శ్రమపెట్టవలయును. ఇపుడే యెందులకుఁ బోఁగూడదు. బయలుదేఱుము; పోవుదము.

తర్వాత ఈవిషయమై భార్యాభర్త లిరువురకును విశేష చర్చ జరిగెను.

కల్యాణి—నగరమునకుఁ బోయిన మేలే.

మహేంద్ర—పేరేమో రాజనగరము, అది వీరభూమికి రాజధానిగా నున్నది. అచ్చటను ఇదే యవస్థ, జనులు లేరు. ప్రాణరక్షకు ఉపాయము లేనే లేదు.

కల్యాణి—అట్లయినచో మూర్షిదాబాదు, కాశింబజారు, కలకత్తా, ఈప్రాంతములలో నెచ్చటికైనను బోయిన ప్రాణరక్షణ కలుగును. కనుక, మనము పోయియే చేరవలయును. ఇచ్చట బ్రదుకలేము.

మహేంద్ర—ఈయిల్లు మాతాత ముత్తాతలకాలము నుండి యున్నది. పరంపరగా సంపాదించిన సకల సంపదలు నిచ్చటనే యున్నవి. మనము విడిచిపెట్టిపోయినయెడల సర్వ మును దొంగలు దోఁచికొని పోవుదురు.

కల్యాణి—దొంగలు దోఁచుకొని పోవుకాలము వచ్చి నపుడు మన మిద్దఱముండి చేయున దేమి? ప్రాణమే పోయిన మీఁద సంపద ననుభవించువా రెవ్వరు? కూడినంతవఱకు భద్రముచేసి పోదము, బ్రదికియున్నచో వచ్చి యనుభవింప వచ్చును.

మహేంద్ర—నీవు నడువఁగలవా? నీచేత నగునా? బోయీలందఱు చచ్చిపోయిరి. బండియున్నదిగాని యెద్దులు లేవు. ఎద్దు లున్నను బండిలేదు. రెండు నున్నయెడల మనిషి లేఁడు. ఒకటియున్న మఱొకటిలేదు. కావున నడిచిపోవలసినదే.

కల్యాణి—నేను నడిచి వచ్చెదను; తాము చింతింప నక్కఱలేదు

ఇట్లు చెప్పుచు కల్యాణి తనమనస్సున, 'నేను నడువలేక మార్గమధ్యమున గతించినను, వీ రిద్దఱైనను ప్రాణముతోఁ బోయి నగరము చేరనీ' యని తలంచెను.

మఱునాఁ డుదయమున కొద్దిగా ధనమును గైకొని, ఇంటికి బీగము వేసి, పసులను విప్పి విడిచిపెట్టి, బిడ్డను చంకనిడి కొని రాజధానికి ప్రయాణమైరి. కొంచెముదూరము పోయి మహేంద్రసింహుఁడు—మనము పోవునట్టిమార్గము మంచిది కాదు, ఎచ్చటఁజూచినను కొల్లయే, దారిదోపిడికాండ్రవేకులు కలరు. చేత తుపాకియున్న మంచిది యని చెప్పి, యింటికిఁ బోయి తుపాకిని తీసికొనివచ్చెను. దీనినిచూచి కల్యాణి—ఇదిమంచిదే, చేత ఆయుధమున్న సమయమున కుపకరించును. కనుక నేనును పోయి యొక యాయుధముకు తీసికొని వచ్చెద నని చెప్పి, బిడ్డను మగనిచేతి కిచ్చి, యింటిలోపలికి పోవుచుండెను.

అప్పుడు మహేంద్రసింహుఁడు "నీవు ఏయాయుధ మును తీసికొని రాఁగలవు?" అనెను.

ఇంటిలోపలికిఁ బోయి కల్యాణి, ఒకబరిసెను దాఁచికొని వచ్చెను. ఇంతకుమునుపే యేదేని కష్టము సంభవించినప్పుడు ప్రాణత్యాగము చేసికొనవచ్చు నని తలంచి విషమును సంగ్రహించి యుంచెను. ఆబరిసెయే యది.

జ్యేష్ఠమాసము, ఎండవేఁడిమి చెప్పతరముకాదు. భూమి నిప్పువలె నుండెను. వడగాలి వీచుచుండెను. ఆకాశము కాఁగిన తామ్రమువలె నుండెను. నేలపై కాలూనినయెడల బొబ్బలు పొక్కుచుండెను. కల్యాణి యెండతాపమునకు తాళక శరీరమంతయు చెమటచే తడిసినదై, బడలి, నిలువనీడలేక, అక్కడక్కడ నెండియున్న చెట్లనీడల నిలుచుచు, ఒకటిదానికొకటి చాలాదూరములోనున్న గుంటలలోని బురదనీళ్లు త్రాగుచు, మహాకష్టముతో నడిచెను. బిడ్డ, మహేంద్రసింహునియొద్ద నుండెను. వాఁడు బిడ్డకు ఎండవేఁడిమి తాఁకనీక మాటిమాటికి గుడ్డతో విసరుచుండెను. ఆమార్గమున శ్యామలపత్రములతో శోభితమై సుగంధకుసుమయుక్తమైనట్టి లతావేష్టితమైన యొక వృక్షచ్ఛాయయందు వారిద్దరును గూర్చుండి విశ్రమించిరి. మహేంద్రుఁడు కల్యాణిశ్రమసహనమును గాంచి, ఆశ్చర్య మొంది గుడ్డను తడిపితెచ్చి ముఖముమీఁదను కాళ్లమీఁదను పిడిచి తాపోపశమనము చేసెను.

కల్యాణికి కొంచెము బడలిక తగ్గెను. అయినను, దంపతు లిద్దరును ఆఁకలిచే డస్సినవారైరి. వీరు ఓర్చుకొనియుండిరి. గాని, బిడ్డనీరువట్టుచే తపించుచుండెను. బిడ్డనిమిత్తమెచ్చటనైన

సమీపమున నుండు గ్రామముపోయి చేరవలయు నని తలంచి బయలుదేఱి యెండలో నడుగిడుటకుగాక మెల్లమెల్లగా సాయంకాలమున నొకచిన్న గ్రామము పోయిచేరిరి. గ్రామమునకు పోయిచేరినతోడనే మహేంద్రుఁడు నీళ్లుతెచ్చిభార్యకును బిడ్డకు నిచ్చి, ఆహారమును సంపాదింపవలయు నని యాలోచించుచుండెను. ఏమి దొరకును ? ఆగ్రామములో నొకమనిషియైన కనఁబడలేదు. పెద్దపెద్దయిండ్లున్నవి. ఉన్ననేమి? ఎవరును లేరు. మహేంద్రుఁడు తిరిగితిరిగి వేసారినాఁడు. ఏయింటిముందు నిలిచి కేకవేసినను "ఏమి" అను బదులు లేదు. తర్వాత భార్యను జూచి—నీవు బిడ్డనుపెట్టుకొని కొంచెముసేపు ధైర్యము తెచ్చికొని యీయింటి యరుగుమీఁదఁ గూర్చుండియుండుము. నేనుపోయి శ్రీకృష్ణుని దయవలన నెక్కడనైన పశువు లున్నయెడల పాలుపితికి తెచ్చెదను. అనిచెప్పి యచ్చట రాసులు రాసులుగా పడియున్న పాత్రలలో నొకదానిని గైకొని వెడలి పోయెను.

---

## రెండవ ప్రకరణము

### కల్యాణి చోరుల పాలగుట

మహేంద్రుఁడు వెడలిపోయెను. కల్యాణి బిడ్డను పెట్టుకొని యొక్కతెయె దీపములేని జనశూన్యమైన యింటియందుఁ గూర్చుండి నలువైపులఁ జూచుచుండెను. మిగుల భయము య్యెను. ఎక్కడ నెవ్వరును లేరు. మనుష్యశబ్దమే లేదు. కుక్కల నక్కల కూఁతలుతప్ప, వే ఱేదియు వినఁబడదు. తన మనస్సు

నందు 'నేనేల వారిని పొమ్మని చెప్పితిని? ఏమి చేయుదును? అని తలంచుచు, లోపలనైన పోయి 'తలుపుమూసికొని యుండెద' నని తలంచికొని లోపలికిఁబోయి తలుపును చూడఁగా తలుపు లేదు. ఉపాయాంతరములేక దిక్కుతోఁపక అట్లే కూర్చుండి భర్త రాకకై నిరీక్షించుచుండెను. ఉన్నట్లుండి తన కెదురుగ నేదో నీడ కంటి కగపడెను. మనుష్యాకృతివలెఁ దోఁచెను. అయి నను, మనుష్యుఁడే యని నిర్ధరించుటకు కాకుండెను. అతిశుష్క మై, శీర్ణమై, మిగులనల్లనై, నిర్వాణమై, వికటాకారమై, యుండు మనుష్యజంతువువలె నేదో వచ్చి ముందు నిలువఁ బడెను. కొంచెమునేపటికి ఆచ్ఛాయాస్వరూపము అస్థిచర్మావ శిష్టమై యతిదీర్ఘమైన శుష్కహస్తమును పైకెత్తి యెవరినో సన్న చేసి పిలిచెను. దానింజూచి కల్యాణికి ప్రాణమేపోయినటు లయ్యెను. తర్వాత, మఱొకఛాయాస్వరూపము మున్ను చెప్పి నట్లేవచ్చినది. ఇట్లొకదానివెంబడి మఱొకటిగావచ్చి మున్ను నిలువంబడిన వికటాకృతిపార్శ్వమునవచ్చి నిలువంబడెను. అన్ని యు, లోపలఁ బ్రవేశించెను. ఆచీఁకటిల్లు శ్మశానమువలెను, ఆవికృతస్వరూపములు ప్రేతములవలెను కనఁబడెను. అన్నియు కల్యాణి చుట్టువచ్చి నిల్చెను. కల్యాణి మూర్ఛ నొందెను. ఆ వికటస్వరూపులు కల్యాణిని దానిబిడ్డను ఎత్తుకొని పాలము మీఁదఁబడి యరణ్యమును ప్రవేశించిరి.

అనంతరము, మహేంద్రుఁడు దుత్తలో పాలు తీసికొని వచ్చెను. వచ్చిచూడఁగా కల్యాణి లేదు. అచ్చటచ్చట వెదకి చూచెను. ఎచ్చటను కనఁబడలేదు. మొదట బిడ్డపేరు పెట్టి పిలిచెను. తర్వాత భార్యపేరుపెట్టి పిలిచెను. ప్రత్యుత్తరమేఁ

లేదు. వానికి ఏమియు తోఁపలేదు. జీవచ్ఛవమువలె యట్లే నేలపై పరుండినాఁడు.

## మూఁడవ ప్రకరణము

### కల్యాణి తప్పించుకొనుట

దొంగలు కల్యాణిని ఎత్తుకొనిపోయి విడిచినవనము మిగులమనోహరమై యుండెను. వెలుతురు చొర వీలులేని స్థితిలో నుండెను. అరణ్యశృంగారమును వీక్షించుటకు వేయి కన్నులైనచాలవు. దరిద్రుని హృదయాంతర్గతమైన సౌందర్యమువలె, ఆవనసౌందర్యము అదృష్టమైనదిగ నుండెను. చూచినవారే లేరు. గ్రామములలో ధాన్యము లేకపోయినను వనమునందుమాత్రము పుష్పము లుండెను. పుష్పము లాయంధకారమునందు వెన్నెలవలె నుండెను. దొంగలు, కల్యాణిని దానికూఁతును కోమలమైన తృణశయ్యయందు పరుండఁజేసి, యందఱు పరివేష్టించి కూర్చుండి పరస్పరము మాటలాడఁదొడఁగిరి. కొంద 'ఱీమెను దీసికొనిపోయి యేమి చేయవలయును?' అనిరి. అంతలోఁగొందఱు 'ఈమెయొద్దనుండునగలను ముందే తీసికొనియైన' దనిరి. మఱికొందఱు 'దానినంతయు భాగించుకొనవలయు' ననిరి. అట్లే భాగించికొనిరి. ఒకదొంగ 'వెండిబంగార మెందులకు? ఎంతటి మంచినగ లిచ్చినను నొక పిడికెడు కూడు దొరకుట లేదు. ఆఁకలిచే ప్రాణము పోవుచున్నది. ఈదినము ఆకులను తింటిని. నాకు నగలేల?' అనెను.

తర్వాత అందఱును బియ్యమే కావలయునుగాని నగలు వల దనిరి. ఇట్లు మాటలమీఁద మాటలు పెరిగి తిట్లకు మొదలు పెట్టిరి. వారి యజమాని, అందఱను సమాధానము చేయఁ బ్రయత్నించెనుగాని, ఎవరును అంగీకరింపలేదు. తుదకు తిట్లు పోయి కొట్లకు ప్రారంభించిరి. ఒకఁడు తనకు వచ్చిన నగలను మూట గట్టి యజమానిపై విసరివేసెను. యజమాని ఒకరి నిద్దఱను మర్దించెను. తర్వాత, అందఱును జేరి యజమానుని కొట్టి గాయపఱచిరి. అధికారి, అన్నాహారములు లేనివాఁడై కృశించి యున్నవాఁ డగుటచేత దెబ్బలకు తాళలేక నేలకు వ్రాలి ప్రాణము విడిచెను. అప్పుడొకఁడు దొంగలను జూచి, 'మన మిదివఱకు కుక్కలనక్కలమాంసమును తింటిమి కదా. నేఁడు నరమాంసమును దిని బ్రతుకుదము రండు' అనెను. వేఱొకఁడు 'ఈముండాకొడుకును తప్పక తినవలసినదే' యని చెప్పెను. అంత విశీర్ణకృష్ణాకారప్రేతమూర్తులు 'కాళి, కంకాళి, జముకాళి' యని యఱచుచు, కలకలధ్వనిచేయుచు, చేతులు తట్టుచు, పటపటపండ్లుకొఱుకుచు, కాళికి ప్రీతియైన మాంసము లభించినదని చెప్పుచు మహానంద తాండవమాడు చుండిరి. వారిలో నొకఁడు దొంగలరాయని శరీరమును కాల్చుటకై చెత్తనుపేర్చి చెకుముకుఱాతితో నిప్పును కలుగఁజేసి రగులఁ బెట్టెను. రగులుటకు ప్రారంభించిన కొలఁదిని, ఆవనమందలి మామిడి, పనస, ఖర్జూరము మొదలగు చెట్లయొక్క శ్యామల పల్లవరాజి కొంచెము కొంచెముగా గోచర మగుచుండెను. ఒక్కొకచోట ఎండినగడ్డియు ఆకులు నిప్పంటుకొని వెల్తురు నిచ్చెను. ఒక్కొకచోట అంధకారము మఱింత యధికమా

రెను. ఒక్కఁడా నిర్జీవశవమును కాళ్లుపట్టి లాఁగి నిప్పులో వేయుటకు ప్రయత్నించెను. వేఱొకఁడు—'నిలు నిలుము! మనము మహామాంసమును తిని ప్రాణమును సంరక్షించుకొను కాలము సంభవించినను, ఈముదిమానిసి మాంస మేల తినవల యును? నేఁడు మనము పట్టుకొనివచ్చిన స్త్రీమాంసమును తిందము' అనెను. మఱొకఁడు—ఏదైన నేమి,ఆఁకలిపోవుటయే ప్రధాన మనెను. అంత అంచఱును కల్యాణియు దానిబిడ్డయు పరుండి యున్నచోటికిఁబోయిచూడఁగా, తల్లిబిడ్డలు కనఁ బడలేదు.

దొంగలు పరస్పరము జగడము చేయుచున్న సమయ మున కల్యాణి బిడ్డను చంక నిడికొని పాలిచ్చుచు పరుగిడి పోయెను. తర్వాత, ఆప్రేతమూర్తులైన దొంగలు సికారి పఱు గ్గెత్తిపోయెను; పట్టుఁడు, కొట్టుఁడు, పఱుగిడుఁడు, అని కేకలు వేయుచు నలుదిక్కులకుఁ బాఱిరి. అవస్థావిశేషమునందు మనుష్యుఁడు అరణ్యహింస్రజంతువేగాని వేఱుకాఁడుగదా.

---

## నాలవ ప్రకరణము

### వ న ప్ర వే శ ము

అరణ్యము మహాంధకారమయము. కల్యాణికి మార్గము కనఁబడలేదు. వృక్షలతాకంటకములు మిగులదట్టమై యున్నం దున, మార్గములేదు. అందును గాఢాంధకారము. కల్యాణి ఆచీఁకటిలో చెట్లసందులలో దూరి పోవుచు నుండెను. బిడ్డ ట్లయొక్కయు కంటకలతలయొక్కయు ముండ్లు గ్రుచ్చికొని

నడుమ నడుమ ఏడ్చుచుండెను. ఈశబ్దమును విని దొంగలు మఱియు నాగ్యాటము చేయుచుండిరి. కల్యాణి ఉపాయాంతరములేక శరీరమంతయు నెత్తుకొనుచుండఁగా నావనమున పోవుచుండెను. కొంచెము సేపునకు చంద్రోదయ మైనది. ఇంతవఱకు కల్యాణి దొంగలచేతికిఁ జిక్కక దాఁగికొనుటకు అనుకూలముగా నుండెను. ఇప్పుడు చంద్రప్రకాశముచే దొంగలకు తానున్నచోటు తెలియుటకు వీలు కలిగినది గదా యని చింతింపఁ దొడంగెను. ఇంతలో చంద్రప్రకాశము అధికమాయెను. మొదట చెట్లతలమీఁద నున్న వెల్తురు తర్వాత భూమిమీఁదను ప్రసరింప నారంభించినందున, చీకటి దాఁగికొనియె. కల్యాణికి మాత్రము దాఁగుకొనుటకు స్థలము లేకపోయెను. మఱికొంచెము దూరమున నిబిడమైన వృక్షములు కన్పట్టెను. అచ్చటికి పోయి దాఁగికొన వచ్చు నని తలంచెను. అప్పుడు దొంగలు చీత్కారము చేయుచు వచ్చుచుండిరి. బిడ్డ వారికూఁత విని భయపడి యేడ్చుటకుఁ దొడంగెను. కల్యాణి ముందడుగు పెట్టుటకు ధైర్యము చాలక అక్లే నిలిచిపోయెను. ఒకపెద్దచెట్టుక్రిందఁ గూర్చుండి బిడ్డను తొడపై పరుండఁ బెట్టుకొని, 'దేవుఁడా! ఎక్కడున్నావు? నీకు కన్నులులేవా? ఎవనిని ప్రతినిత్యమును పూజించుచున్నానో, ఎవనికి నిత్యమును నమస్కారము చేయుచున్నానో, ఎవని బలమువలన నీవనమధ్యమునం బ్రవేశించి వచ్చుటకు సమర్థురాలనైతినో ఆమహామహుఁ డిప్పుడెక్కడ? మధుసూదనా! నీవెక్కడనున్నావు? హాకృష్ణా! నీవెక్కడికి పోయితివి?, అని ప్రలపించుచుండెను. ఆ సమయమునందు భయముచేతను, భక్తి

ప్రగాఢముచేతను, కడుపునం దన్నరసములేని సంకటముచేతను, కల్యాణిక్రమక్రమముగా బాహ్యజ్ఞానశూన్యురాలై అంతఃకరణశుద్ధివలన చైతన్యమయురాలై అంతరిక్షమునం దేదో యొకదివ్యస్వరముచే పాడుచున్న యొకగీతమును విన్నది. ఆగీత మెట్లన,—

హారే మురారే మధుకైటభారే
గోపాల గోవిన్ద ముకున్ద శౌరే
హారే మురారే మధుకైటభారే.

కల్యాణి బాల్యమునుండి పురాణములయందు, దేవర్షి యగు నారదమునీంద్రుఁడు గగనమార్గమునందు వీణాపాణియై హరినామసంకీర్తనము చేయుచు ప్రపంచమంతయు సంచరించు నని విని యుండెను. ఆభావమే యామె మనస్సునందు జాగరిత మగుచుండెను. ఆనారీరత్నము తనమనస్సులోనే, శుభ్రశరీర శుభ్రకేశ శుభ్రశ్మశ్రు శుభ్రవసన మహాశరీరముఁలుగల నారద మునీంద్రుఁడే వీణాధరుఁడై, చంద్రాలోకమువలన ప్రదీప్తమైన నీలాకాశమార్గమునందు 'హారే మురారే మధుకైటభారే' అని పాఁడుచున్నాఁ డని భావించికొనియెను.

క్రమక్రమముగా ఆగీతము అతిసమీపమున వినవచ్చుచు న్నట్లుగా బోధమయ్యెను. మఱల దగ్గఱగా 'హారే మురారే మధుకైటభారే' అనున ట్లుండెను, తుదకు కల్యాణి తలమీఁదుగా నావనస్థలియే ప్రతిధ్వనితమై సంగీతమైనది.

హారే మురారే మధుకైటభారే.

అంత కల్యాణి కన్నులు మూసికొనియెను. ఆయర్ధస్ఫుటమైన వనాంధకారముచేత మిశ్రమైన చంద్రకిరణమునందు,

శుభ్రశరీర, శుభ్రకేశ, శుభ్రశ్మశ్రు, శుభ్రవసనధారి యైన ఋషిమూర్తిని దర్శించెను. అనన్యమనస్కురాలై తథాభూత చేతనమునందు ప్రణామము చేయుదు నని భావించెను. అయినను, ప్రణామము చేయఁజాలక తల వాంచెను. వెంటనే చేతన శూన్యురాలై భూతలశాయిని యైనది.

---

## అయిదవ ప్రకరణము

### మఠ ప్రవేశము

ఆవనమధ్యమునం దొకప్రకాండమైన భూఖండమందు భగ్నమైన శిలాఖండములచే పరివేష్టితమైన మఠములు కలవు. పురాతత్త్వమును తెలిసినవారు చూచిరేని ఇది పూర్వకాలము నందు బౌద్ధుల విహారమైయుండి, అనంతరము హిందువుల మఠ మైనదని చెప్పుదురు. అది రెండంతస్థులు కలది. లోపల అనేక దేవమందిరము లున్నవి. ముందుగా నాట్యశాల కలదు. ఇవి యన్నియు నొకకోటచే ఆవరింపఁబడి యుండెను. దాని చుట్టును పెద్దవృక్షము లున్నందున పగటివేళయందుఁ గూడ దీనిలోపల కోట యున్నదని తెలిసికొనుట కెవ్వరికిని సాధ్యము కాదు. ఆమేడ లనేకస్థలములలో శిథిలమై యుండెను. ఇప్పుడు కొంతవఱకు జీర్ణోద్ధార మైనట్లు తోఁచెను. ఈమఠ మున నొకగృహము. అందొక పెద్దదీపస్తంభమున దీపము వెలుఁగుచుండెను. కల్యాణి చైతన్యముకలిగి చూచినపుడు,

ఆగృహామునందు తనకెదురుగా ఆశుభ్రశరీర శుభ్రవసనధారి యైన మహాపురుషుఁడే కనఁబడెను.

కల్యాణి ఆశ్చర్యభరితురాలై, మరల దృష్టి నిగుడించి చూచెను. ఆమెకు స్మృతి యింకను సరిగా రాలేదు. అప్పుడా మహాపురుషుఁడు, 'అమ్మా! ఇది దేవత లుండుస్థానము, అనుమానము నుంచికొనవద్దు, కొంచెము పా లున్నవి, వీనిని స్వీకరించుము. తర్వాత నీతో మాట్లాడెదను' అనెను.

కల్యాణికి మొదట నేమియుఁ దోఁపక, కొంచెముసేపు నకుమీఁద క్రమక్రమముగా మనస్సు స్థిరమయ్యెను. తెప్పిఱి లినపడంపడి, పైచెఱగు సవరించుకొని యామహాపురుషునకు నమస్కరించెను. ఆతఁడు మంగళాశీర్వచనము చేసి, వేఱొక గృహామునకుఁ బోయి సుగంధమైన మృత్పాత్రను దెచ్చి,అందు పాలుపోసి కాచి, కల్యాణిచేతి కిచ్చి, అమ్మా కొంచెము పాలు బిడ్డకు పోసి, నీవు కొంచెము పుచ్చుకొనుము, తర్వాత మాట్లాడెద' ననెను.

కల్యాణి, సంతుష్టినొంది బిడ్డకు పాలు త్రాగించుటకు ప్రారంభించెను. ఆమహాపురుషుఁడు—'నేను పోయివచ్చెద, చింతింపవలదు. భయమేమియు లేదు' అని చెప్పి వెడలి పోయెను. ఆతఁడు, కొంచెముసేపు తాళి వచ్చి చూచెను. చూచి కల్యాణి తనబిడ్డకుమాత్రము పాలుపోసి తాను పుచ్చు కొనలేదని తెలిసికొని, 'అమ్మా! నీవేల పాలు త్రాగలేదు, త్రాగుము' అనిచెప్పి బయటపోవుటకుఁ బ్రయత్నించెను.

అంత కల్యాణి, మరల నమస్కారముచేసి, 'నన్ను పాలు త్రాగుమని ఆజ్ఞ చేయఁగూడదు. దీనికొక యాటంకమున్నది' అనెను.

వనవాసి అత్యంతదయతో, 'ఏమి ఆ యాటంకము? నాతోఁ జెప్పుము, నేను వనవాసిని, బ్రహ్మచారిని, వృద్ధుఁడను. నీవు నా కుమార్తెవు, నాకుఁ జెప్పని దేమియు నుండదని తలంచెద. నేను నిన్ను అరణ్యమునందుండి పిలిచికొని వచ్చునప్పుడు నీవు చైతన్యవిహీనవై యుంటివి. మిగుల క్షుత్పిపాసాపీడితురాలవై యున్నావు. కొంచెము పాలు పుచ్చుకొనకపోవుదువేని నీప్రాణ మెట్లు నిలుచును?' అనెను.

కల్యాణి—కన్నీరు కార్చుచు, 'తాము దేవర్షితుల్యులని నాయభిప్రాయము. తమకుఁ జెప్పని దేమున్నది? నాభర్త ఇంకను ఉపవాసము; అతనిం జూడకగాని, లేక అతఁడు భుజించిన సమాచారము తెలియకగాని, నేను దేనిని స్వీకరింపను' అనెను.

బ్రహ్మచారి—'నీస్వామి యెచ్చట నున్నాఁడమ్మా!' యనెను.

కల్యాణి—'నాకుఁ దెలియదు, పాలు తెచ్చెదనని బయలుదేరి పోయిరి. వెంటనే దొంగలు వచ్చి నన్నెత్తుకొనివచ్చిరి;' అనెను.

బ్రహ్మచారి, కల్యాణితో, ఒక్కొక ప్రశ్న వేసి యామె మాటలచేతనే యామెభర్త పోబడి యూహించి తెలిసికొనెను. కల్యాణి మగనిపేరు చెప్పలేదు. చెప్పుట దోషమా? మరల బ్రహ్మచారి కల్యాణిమాటలచేతనే ఆమె మహేంద్రుని భార్య

యని తెలిసికొని, 'నీవు మహేంద్రసింహుని పత్నివా' యనెను. కల్యాణి, నిరుత్తరురాలై తలవంచుకొని, పాలు కాచిననిప్పును సరిపఱచుకొనుచుండెను. అప్పుడు బ్రహ్మచారి తనప్రశ్నకు ఉత్తరమువచ్చినదని నిశ్చయించుకొని, "నేను చెప్పినట్లు చేయుము. పాలుపుచ్చుకొనుము. నీస్వామివృత్తాంతమును తెలిసికొనివచ్చి చెప్పెదను. నీవు పాలు గైకొనకపోయిన నేను పోను" అనెను.

కల్యాణి,ఇక్కడ కొంచెము జలము దొరకునా? యనెను. బ్రహ్మచారి నీళ్లు తెచ్చి యొకసాసిక నిండుగాఁ బోసి 'పుచ్చుకొనుము' అనెను. కల్యాణి, ఈజలమున తమపాదముల 'నను గ్రహింపుడు' అనెను. బ్రహ్మచారి, తన అంగుష్ఠముచేత నాజలమును స్పృశించెను. తర్వాత, కల్యాణి ఆ జలమును పానముచేసి,"నేను అమృతపానము చేసినాను,ఇఁక నన్నేమియు పుచ్చుకొనుమని నిర్బంధము చేయఁగూడదు. నాస్వామి వృత్తాంతమునువినక నేనేమియు స్వీకరింపను" అనెను.

బ్రహ్మచారి, 'నీవు నిశ్చయముగా నీ దేవస్థానమునందుండుము. నేను నీస్వామివృత్తాంతమును దెలిసికొనివచ్చెద' అని చెప్పి వెడలిపోయెను.

---

## ఆఱవ ప్రకరణము

### భవానందుఁడును మహేంద్రుని వెదకుట కేఁగుట

రాత్రి చాల ప్రొద్దయినది. చంద్రుఁడు తలమీఁదికి వచ్చెను. పూర్ణచంద్రుఁడుకాదు. వెన్నెల మిగులప్రకాశము

గా లేదు. పెద్ద బయలు. ఆబయలునందు అస్పష్టమైన వెన్నెల ప్రకాశించుచుండెను. వెలుతురు అంతగా లేనందున ఆమైదానము తుదమొదలు తెలియలేదు. మైదానములో నేమి యున్నదో, ఏదియు తెలియలేదు. చాలవిస్తారమైన బయలు. జనశూన్యమైనది. భయమునకు నెలవు; సహారా అనెడి సైకత సముద్రమునకు సమానమైన యామైదానమునందే మూర్షిదాబాదునకును కలకత్తాకును పోవునట్టిమార్గము. ఆ మార్గము ప్రక్కను నొకచిన్నకొండ గలదు. ఆకొండమీఁదుగా నచ్చటచ్చట చెట్లు దట్టముగా నుండెను. చెట్లయాకులపై చంద్రకిరణములు ప్రసరించుటచే తళతళ మెఱయుచు మర్మరశబ్దముతో కంపితమగుచుండెను ఆ చెట్లనీడ కొండశిలలపైఁబడి చీఁకటి గావించుచుండెను. బ్రహ్మచారి ఆకొండపై నెక్కి దేనినో వినువానివలె చెవియొగ్గి ఆకాశమును చూచుచుండెను. విన్నదేమో, ఆశబ్దమేమో, మనకు తెలియదు. తుద మొదలులేని యాప్రదేశమునందే శబ్దమును లేదు కేవలము వృక్షాదుల మర్మశబ్దము తప్ప వేఱు లేదు. ఒక్కచోట పర్వత సమప్రదేశము. దానిసమీపమున పెద్దయడవి క్రిందుగాబాట నడుమ యడవి. అచ్చటి శబ్దమేమో దానిని చెప్పుటకుఁ గానేరదు. బ్రహ్మచారి ఆప్రక్కను పోయి యరణ్యమునం బ్రవేశించిచూడఁగా, నాయంధకారమునందు కొందఱు గుంపులుగుంపులుగా చెట్లక్రిందఁ గూర్చుండి యుండిరి. వారందఱును దీర్ఘాకృతిగల కృష్ణవర్ణపురుషులు. అందఱును ముఖమును మూసికొని కూర్చుండి యుండిరి. ఆవెన్నెలలో వారియొద్ద ఖరతరమైన ఆయుధము లున్నట్లు తెలిసెను. వీరు ఇచ్ఛానుసారముగా తిరుగు

రుందురు. అందఱును అధరస్పందముచేయక యుండిరి. బ్రహ్మ చారి మెల్లఁగాపోయి ఏదోసంజ్ఞ చేసెను. ఎవరును లేవలేదు. ఎవరును మాటాడలేదు. చప్పుడైనను చేయలేదు. అంధ కారమునం దెవరినో వెదకెడివానివలె ముఖమును చూచుచు పోయెను. ఇట్లు చూచుచు పోయి ఒకనినిచూచి వానిని స్పృ శించి, యేదో సంజ్ఞచేసెను. వాఁడు లేచెను. వానిని పిలిచి కొని చాలదూరము పోయెను. ఆపురుషుఁడు యౌవనవంతుఁ డుగ నుండెను. వాని కృష్ణ కేశజాలము వాని చంద్రవదనము నావరించియుండెను. వాఁడు కావివస్త్రమును ధరించి యుండె ను. సర్వాంగమును చందనముచే శోభితమై యుండెను బ్రహ్మ చారి వానింజూచి, 'భవానందా! మహేంద్రసింహుని వృత్తాం త మేమైనను దెలియునా?' యని యడిగెను.

భవానంద—మహేంద్రసింహుఁ డాదినమున ఉదయ మున గృహమును విడిచిపెట్టి పెండ్లమును బిడ్డను పిలిచికొని మూర్షిదాబాదుమార్గముగా ప్రయాణమైవచ్చి, యొకపల్లెలో అంతలో బ్రహ్మచారి—ఆపల్లెలో జరిగిన సంగతి నాకుఁ దెలి యును, ఎవరట్లుచేసినవారు?

భవానంద—ఎవరో పల్లెటూరిరైతు లని తోఁచుచు న్నది. ఈకాలమున పల్లెలలోని రైతు లందఱును తిన కూడు లేక దారిదోపిళ్లు చేయుచున్నారు. ఈసమయమున ఏరైతు దొంగలింపకున్నాఁడు? మేముకూడ కొల్లగొట్టియే తినవలసి యున్నది. కొత్వాలువారికి రెండుబండ్లు బియ్యము పోవుచుం డెను. దానిని తెచ్చి బ్రాహ్మణులకు పంచిపెట్టినాను.

బ్రహ్మచారి నవ్వి—దొంగలచేతికి చిక్కినవానిభార్యను బిడ్డను జీవముతో పిలుచుకొని వచ్చితిని. వారిద్దఱిని మఠము నందు విడిచి పెట్టి వచ్చియున్నాను. నీవు మహేంద్రుని వెదకి వానిభార్యను బిడ్డను వానివశము చేయుము. ఇచ్చట జీవా నందుఁడున్న చాలును; కార్యము నెఱవేఱు ననెను.

భవానందుఁడు—అట్లే కాని మ్మని చెప్పెను.

బ్రహ్మచారి—వేఱేచోటికి వెడలి పోయెను.

---

## ఏడవ ప్రకరణము

మహేంద్రుఁడు సిపాయిలకు లోఁబడుట

మహేంద్రసింహుఁడు, ఈ నిర్మానుష్యప్రదేశమునఁ గూర్చుండి యాలోచించి ప్రయోజనము లేదని తెలిసికొని, రాజనగరమునకుఁ బోయి పోలీసువారిని సహాయముగాఁ బిలుచుకొని భార్యను బిడ్డను వెదుకవలయు నని తలంచి, ఆమార్గముగాఁ బోవుచుండెను. కొంచెముదూరము పోఁగానే, ఒక యెద్దుబండి సిపాయిల పహరాతో వచ్చుచుండెను. రాజనగరము; లేక నగరము ఎయ్యది యనుదానిని యిపుడు చెప్పెదము.

వేయియు నేడువందల డెబ్బదియాఱవ (1776) సంవత్సరమునందు వీరభూమి (Birbhoom) మొదలగు ప్రదేశములు ఇంగ్లీషువారిపాలనకు లోఁబడి యుండలేదు. ఆకాలమున ఇంగ్లీషువారు బంగాళా దివానులై యుండిరి. ఫౌజుదారియు వారికి

చేరియుండలేదు. వారు కేవలము నేలపన్ను వసూలుచేయు అధికారులై యుండిరేగాని, బంగాళాదేశముయొక్క సివిల్, క్రిమినల్, పోలీసుశిలాఖాఅధికారములను వహించియుండ లేదు. సిస్తు వసూలుచేయు అధికారము ఇంగ్లీషువారిదిగను, జనులయొక్క ఆస్తి, ప్రాణము మొదలగువాని సంరక్షణాపేక్షణ భారము ఆపాపిష్ఠియు, నరాధముడును, విశ్వాసఘాతుకుడును, మనుష్యకులకలంకుడునైన మీరజాఫరుచేతిలో నుండెను. ఈ మీరజాఫరుడు ఆత్మరక్షణమునందే సమర్థత లేనివాడు. వీడు బంగాళాదేశము నెట్లు సంరక్షింపగలడు? మీరజాఫరునకు గంజాయి త్రాగుట, అభిని తినుట, అను నీరెండుపనులకే కాలముచాలక యుండెను. ఇంగ్లీషువారికి ధనము వసూలుచేసి కొనుట, డెస్పాచ్ (Despatch) వ్రాయుట, అను నీరెండు పనులే యుండెను. బంగాళాదేశమునందుండువారికి నిరంతరము ఏడ్చుట, నష్టపడినందులకై చింతించుచుండుట, అను నీరెండు పనులే యుండెను.

బంగాళాదేశమునందు ఇవిసాధారణనియమములై యుండెను. వీరభూమి మొదలగు ప్రదేశములందు స్వతంత్రమైన రాజ్యప్రణాళిక యుండెను అది వీరభూమి రాజుచేతియందుండెను. రాజనగరము, లేక నగరము ఆదేశమునకు రాజధానియై యుండెను. వీరభూమిరాజులు పూర్వమునందు స్వతంత్రులై యుండి ప్రకృతమున మూర్షిదాబాదు ప్రభువునకు లోబడి యుండిరి. పూర్వమున వీరభూమియందు స్వతంత్రులైన హిందూ రాజు లేలుచుండిరి. ఇప్పటి రాజవంశస్థులు ముసల్మానులు. మనము ఏకాలపుకథను ప్రారంభించితిమో దానికి మును పున్న

అల్లీవర్దిఖాన్ బహాదర్ అను తురకరాజు, సిరాజుద్దౌలా సాహాయ్యమువలన దేశమును వృద్ధిచేసి కలకత్తానగరమునుకొల్ల గొట్టుకొని వచ్చియుండెను. ఆతర్వాత క్లైవు వచ్చి యడుగు పెట్టిన వెంటనే తురకలు జన్మసార్థకముకొఱకు బేహాస్తికి (వీరస్వర్గము నకు) ప్రయాణోన్ముఖులైరి. బంగాళాదేశములోని ఇతర ప్రదేశములవలెనే వీరభూమి ఆదాయము కూడ ఇంగ్లీషువారు తీసికొనుట ప్రారంభించిరి. అయినను శాసనభారము రాజుచేతి యందే యుండెను. ఇంగ్లీషువారు ఎచ్చటెచ్చట పన్నువసూలు చేసికొనుచుండిరో ఆయాస్థలములలో నొక్కొక కలెక్టరును నియమించి యుండిరి కాని, అప్పటివఱకు వీరభూమికి కలెక్టరును నియమించలేదు. రాజే వారికొఱకు పన్నువసూల్ చేసి కలకత్తా కుఁ బంపుచుండెను. ఆ కారణముచేత వీరభూమి ఆదాయము కలకత్తాకు ఇరసా లగుచుండెను. జనులు తినుటకు కూడు లేక చచ్చుచున్నను ఇరసాలుమాత్రము నిల్చుటలేదు. అపుడంతగా ఉత్పత్తియును లేదు. ఏలన, భూమి చక్కఁగా పండుటలేదు. అది యెట్లులైన నుండనీ; ఆదాయము కొంచెముగా నున్నను దానిని బండిలోవేసి సిపాయీలపహారాతో కలకత్తాయందలి కంపెనీ ఖజానాకు పంపుచుండిరి. అప్పుడు దొంగలభయము అధికముగా నున్నందున ఏఁబదుగురు సిపాయీలు ఆయుధపాణులై బండికి ముందువెనుకల పహారా యిచ్చుచు పోవుచుందురు. వీరికి అధికారి ఒక యెఱ్ఱమూతివాఁ డుండెను. వాఁడు కంపెనీవారి నౌకరుకాదు. ఆకాలమున దేశీయరాజుల సైన్యములలో అనేకులు ఎఱ్ఱమొగముగలవారు అధికారులుగా

నుండిరి. ఎఱ్ఱమోము గలవాఁడు అందఱకు వెనుక గుఱ్ఱము నెక్కిపోవుచుండెను. ఎండతాపము మిక్కుటముగా నున్నందున సిపాయీలు పగటివేళ ప్రయాణము చేయక రాత్రిపూట ప్రయాణము చేయుచుండిరి ఇట్లు, ఇరసాలుబండితోఁగూడ పోవుచున్న సిపాయీలను మహేంద్రసింహుఁడు చూచి వారికి దారి విడుచుటకై కొంచెము ఒదిగి నిలిచెను. అయినను, సిపాయీలు వానిమీఁద పడుటకు వచ్చిరి. ఇది జగడమునకు సమయము కాదని మహేంద్రసింహుఁడు రస్తాప్రక్కన నున్న అడవియందున నిల్చెను.

ఒక సిపాయి, ఇదిగో దొంగ పరుగెత్తి పోవుచున్నాఁడని యఱచెను. మహేంద్రునిచేత తుపాకి యుండుటను జూచి వానికి వీఁడు దొంగ యనుట దృఢమైనది. ఆసిపాయి వానిని వెంబడించి పరుగిడి పట్టుకొని, దొంగముండాకొడుకా! అని తిట్టుచు ఒకగుద్దు గుద్ది తుపాకిని లాగుకొనెను. మహేంద్రుఁడు వట్టిచేతివాఁడైనందువలన సిపాయిగుద్దుకు బదులు తానొక గుద్దు గుద్దెను. మహేంద్రునికి అధికకోపము కలిగినదని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు కదా. గుద్దుతిన్న సిపాయి తాళలేక యట్లే నేలపైఁ బడిపోయెను. అపుడు నలుగురు సిపాయీలువచ్చి మహేంద్రసింహునిపట్టి యీడ్చుకొని పోయి సేనాపతి సాహేబుముందు నిలిపి, 'వీఁడు ఒకసిపాయిని ఖూని చేసినాఁ' డని రిపోర్టు(Report)చేసిరి. అపుడు సాహేబుపైపు (pipe) అనఁగా (చుట్టపట్టుకోవికి పేరు) పట్టుచుండినదే గాక, సారాయి త్రాగిన మత్తుచేతను కొంచెము విహ్వాలుఁడై యుండినందున, "ఈదొంగముండాకొడుకును పట్టి 'షాది' (అనఁగా

తురకలలో పెండ్లికిపేరు) చేయుఁ" డని చెప్పెను. ప్రకృతము నందు "కైది" అని చెప్పవలసియుండెను. దానికి బదులు కై పెక్కియున్నందున 'షాది' అని సాహేబు నోటనుండి వెడలెను. ఆసిపాయీలు "వీనికి పెండ్లి యెట్లుచేసేది? వీనికిని దెబ్బతిన్న సిపాయికిని పెండ్లిచేసేదా, లేక వీనికి యేడనుండి పిల్లను తెచ్చి పెండ్లిచేసేది? ఇదేమొ వింత తీర్పుగా నున్నదే. అయినా వీనిని కాళ్లు చేతులుకట్టి బండిలో పడవేసికొనిపోదము. సాహేబువారుమత్తుతిరిగినమీఁదహుకుం బదలాయింపఁగలరు" అని తమలోఁ దా మాలోచించుకొని మహేంద్రసింహుని మోకుదారముతో కట్టి బండిమీఁద వేసిరి. మహేంద్రసింహుఁడు ఇందఱతోను జగడమాడిన ప్రయోజన ముండదని తెలిసికొని యూరకుండెను. సాహసముచేసి తప్పించుకొన్నను ఫల మేమి? పెండ్లము బిడ్డ పోయినమీఁద జీవితుఁ డై యుండుటకు వానికి సమ్మతము లేదు. సిపాయీలు మహేంద్ర సింహుని బండిగూటమునకు భద్రముగా కట్టిరి. అనంతరము, యథాప్రకారము ఇరసాలును తీసికొని మృదు గంభీర మైన నడకతో పోవుచుండిరి.

---

## ఎనిమిదవ ప్రకరణము

### సైనికులు పరాభూతు లగుట

బ్రహ్మచారి ఆజ్ఞాప్రకారము భవానందుఁడు భగవన్నామస్మరణము చేయుచు, మహేంద్రుఁడు నిలిచిన గ్రామమువైపు బయలుదేరెను. ఆప్రాంతముననే వానిసమాచారము తెలియ వచ్చు నని యాలోచించి, ఆమార్గముగ్గాఁ బోయెను.

ఇచ్చట పాఠకమహాశయులు కొంచెము దిఙ్నిరూపము చేసికొనవలయును. ఏలన, దిక్కు తెలియక పోయినచో మేము చెప్పెడి వృత్తాంతము నిజమే యైనను దానియందు నమ్మకము కలుగదు. రాజనగరమునుండి కలకత్తాకు పోవలసినచో ముసల్మాన్ రాజులచే నిర్మితమైన బాటమీఁదుగ పోవలయును. మహేంద్రసింహుఁడు పదచిహ్నగ్రామమునుండి రాజనగరమునకుఁ బోవుటకై, దక్షిణదిక్కునుండి ఉత్తరదిక్కునకుఁ బోవుచుండెను. ఇట్లు పోవునపుడే ధనరక్షకులై సిపాయీలను సంధించెను. భవానందుఁడును ఆకొండయొద్దనుండి గ్రామమునకు పోవునపుడు, వాఁడును దక్షిణమునుండి ఉత్తరమునకుఁ బోవలసినవాఁడాయెను. వీఁడును కొంచెము దూరము పోయి కావలయు ననియే ఆసిపాయీలను సంధించెను. సంధించినవాఁడు మహేంద్రసింహునివలెనే వారికి దారివిడుచుటకై యొదిగి నిలిచెను. సిపాయీలు, రాత్రికాలములో నొక్కఁడొక్కఁడుగా వచ్చి నిలువంబడినందున, వీనినికూడ దొంగయని భావించి పట్టుకొనిరి.

భవానందుఁడు—(ముసిముసి నగవుతో) ఎందులకయ్యా?

సిపాయి—నీవు దొంగముండాకొడుకుగా నున్నావు.

భవానంద—కావిబట్ట కట్టుకొనియుండుట నీకుఁ గనఁబడలేదా? నేను బ్రహ్మచారిని; బందిపోటు చేయువా రిట్లుందురా?

సిపాయి—'చాలమంది దొంగ విధవలు బ్రహ్మచారి, సన్న్యాసి వేషములు వేసికొని దొంగలించుచుండుట తెలియదా' అని చెప్పి, తలమీఁద నొక్కదెబ్బ వేసి మెడబట్టి

నెట్టుకొని వచ్చెను. భవానందుని కన్ను లెఱ్ఱనై జ్వలించు చుండెను. అయినను, వినీతభావముతో, 'అయ్యా! ఏమి చేయవలయును, చెప్పండి?' అనెను.

సిపాయి భవానందుని నమ్రతకు మెచ్చి 'ఈమూటను మోచికొనిరా దొంగభడవా' అనెను. వేఱొక సిపాయివచ్చి "వద్దు, ముల్లెపోవును, వీఁడు దొంగ, పరుగెత్తిపోవును, పట్టే వారెవరు? ఇదివఱకొక దొంగకొడుకును బండిలో కట్టివేసి నాము, ఆలాగే వీనినికూడ కట్టి బండిమీఁద వేయండి" యనెను భవానందునకు, బండిమీఁద నున్నవానిని కనుఁగొన వలయు ననెడి కోరిక యుండుటచేత, తటాలున తలపై నున్న మూటను క్రిందపడవైచి, సిపాయిని బలమైన గుద్దు గుద్దెను. అందుచేత సిపాయీలు కోపముతో భవానందుని కట్టి బండి లో పడవేసిరి. భవానందునికి తనకంటె ముందుగా బంధింపఁ బడి బండిలో పడియుండువాఁడు మహేంద్రసింహుఁ డని తెలిసినది.

సిపాయీలు అన్యమనస్కులై కోలాహలములతో ముం దుగాఁ బోవుచుండిరి. ఆయెద్దులబండి కటకట, గడగడ కచ్ కచ్, కింయ్‌కింయ్ అనుశబ్దము చేయుచు పోవుచుండెను అపుడు భవానందుఁడు మెల్లగా—" మహేంద్రసింహా! నిన్ను నాకుఁ దెలియును; నీకొఱకే నేను వచ్చితిని. నే నెవరనునది నీవు తెలిసి కొనవలసిన పనిలేదు. నేను చెప్పునట్లు నీవు చేయుము. నీ చేతిని బండిచక్రముపై నుంచుము, ఆచక్రఘర్షణముచే చేతికి కటియుండు దారము తెగిపోవును" అనెను.

మహేంద్రుఁడు, విస్మితుఁడై బదులేమియుఁజెప్పక భవానందుఁడు చెప్పినట్లు చేసెను. చేతికి కట్టినదారము తెగిపోయెను. ఆమీఁద భవానందుఁడు 'కాలిని యుంచు' మనెను. మహేంద్రసింహుఁ డాలాగే యుంచెను. కాలికట్టును తెగిపోయెను. తర్వాత భవానందుని ఆజ్ఞాప్రకారము మహేంద్రసింహుఁడు నిశ్చేష్టితుఁడై కూర్చుండియుండెను. భవానందుఁడును నిస్తబ్ధుఁడై యుండెను.

బ్రహ్మచారి నిలిచి చూచుచున్న కొండప్రక్కనుండు మార్గముమీఁదుగానే యీసిపాయీలును బోవుచుండిరి. సిపాయీలు ఆకొండను సమీపించిరి. అచ్చట నున్నయొకబండిపై యొకమనిషి నిలువంబడి యుండెను; చంద్రకిరణప్రకాశముచే వాని నల్లనిదేహము కనఁబడెను. వెంటనే సిపాయీల హావల్దారు, 'అదిగో! మఱొకదొంగ యున్నాఁడు, వానిని పట్టుకొని రండు, మూట మోయించవచ్చు' ననెను. సిపాయీలలో నొకఁడు వానిని పట్టితెచ్చుటకుపోయెను. అయినను ఆమనిషి కదలక యట్లే నిలిచియుండెను. సిపాయి పోయి వానిని పట్టుకొనెను. వాఁడేమియు ననలేదు. పట్టితెచ్చి హావల్దారుముందు నిల్పెను. హావల్దారు 'వీనితలపై మూటను పెట్టుఁ' డనెను. అట్లె వాఁడు మూటను తలపైనుంచెను. వాఁడు మూటను మోసికొని ముందు నడిచెను. హావల్దారు ఒకబండివెనుక నడచిపోవుచుండెనుఁ పోవునపుడే హఠాత్తుగా తుపాకిశబ్దము వినఁబడెను. ఆగుండు హావల్దారు తలకు తగిలెను, వాఁడు నేలమీఁద బడి గిజగిజ తన్నుకొని చచ్చెను. తర్వాత ఒక సిపాయి ఈమూట మోసికొనిపోవు దొంగవిధవకొడుకు

హావల్దారును చంపినాఁడని చెప్పుచుపోయి వానిచేతిని పట్టు కొనఁబోయెను. వాస్తవముగా వానిచేత తుపాకి యుండెను. సిపాయి దగ్గఱింపఁగానే, మూటను క్రిందపడవైచి, ఆతుపాకిని త్రిప్పుకొని ఒక్కదెబ్బ వానితలమీఁద వేసెను. వానితల ఆదెబ్బకుపగిలిపోయెను. ఆసమయమున "హారీ,హారీ" యని కూయుచు ఇన్నూఱుగురు శస్త్రధారులువచ్చి సిపాయీలను ముట్టడించిరి సిపాయీలు అధికారియాగమనమును నిరీక్షించుచుండిరి. ఆయధికారివచ్చి లైన్ఫారం (To form the line) చేయుటకు కమా నిచ్చిరి. ఇంగ్లీషువారికి విపత్కాలమున నిషా తలకెక్కియున్నను చింత లేదు. సిపాయీలు నాలుగుదిక్కులలోను చతుష్కోణవ్యూహాకారముగా నిల్చిరి. మరల అధికారి కమాన్ చెప్పినట్లుగా తుపాకులను సరిగా చేతపట్టుకొనిరి. ఇంతలో నెవఁడో యొకఁడు, అధికారి కమ్మర్ బందులోనున్న కత్తిని తీసికొని కండ్లుమూసి తెఱచునంతలో అధికారి మస్తకమును ఛేదించెను. ఈ అధికారితల ఆతఁ డెక్కియున్న గుఱ్ఱముకాళ్ల క్రిందపడియున్నందున, ఫైర్ (Fire)చేయునట్లు ఆజ్ఞ నిచ్చుటకు వేఱేతల లేకపోయెను. అప్పు డొకఁడు బండిమీఁద నిలుచుకొని కత్తిని చేతపట్టికొని త్రిప్పుచు. 'హారీ, హారీ' యని యఱచుచు'సిపాయీలను కొట్టుఁడు, నఱుకుఁడు' అని గడబిడ చేయుచుండెను. వీఁడే భవానందుఁడు.

హఠాత్తుగా అధికారి ఛిన్నశిరస్కుఁ డైనదానిని గాంచి ముందేమి చేయుటకును ఉత్తరు విచ్చువారు లేక, సిపాయీలు ఏమియు తోఁపక నిశ్చేష్టితులై కొంచెముసేపు భయముచేఁ గుంది నిలిచి యుండిరి. అంతలో ధైర్యశాలులైన దొంగలు,

సిపాయీలను కొట్టిచంపి తరిమివేసి, బండ్లమీఁదనున్న ఖరసాలు రూపాయలను స్వాధీనము చేసికొనిరి. చావక మిగిలియున్న సిపాయీలు భగ్నోత్సాహులై పరాభూతులై పలాయనులైరి.

మొదట బండిమీఁద నిలిచి తర్వాత యుద్ధమున యాజమాన్యమునువహించినయతఁడు భవానందునియొద్దకు వచ్చెను. ఇర్వురును పరస్పర మాలింగనము చేసికొనిరి. అపుడు భవానందుఁడు, 'జీవానందా! యత్నించినకార్యము సఫలమైనది' అనెను.

జీవానందుఁడు, 'భవానందా! నీనామము సార్థకమగును గాత,' అని యాశీర్వదించెను. అపహృతధనమును యథాస్థానమునకుఁ గొనిపోవుటకు జీవానందుఁడు నియమింపఁబడఁగా, నతఁడు తనయనుచరులతోఁడ స్థానాంతరమునకు బయలుదేఱి పోయెను. భవానందుఁ డొక్కఁడే యుండెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

### మహేంద్రుఁడు తప్పించుకొనుట

మహేంద్రుఁడు బండినుండిదిగి ఒకసిపాయిచేతిలోనికత్తిని లాఁగికొని యుద్ధములోఁ దానును చేరవలయునని యెంచెను. అయినను, వీరు దొంగలు, ధనాపహరణార్థమై సిపాయీలను కొట్టుచున్నారని తెలిసికొని, యుద్ధస్థానమునకుఁ గొంచెము దూరమున నిలిచెను. ఏలన, దొంగలకు సహాయము చేసినచో వారు చేయుపాపములకు భాగి కావలసివచ్చు నని యెఱింగి

కత్తిని పాఱవేసి యచ్చోటనుండి మెల్లమెల్లగ పోవుచుండెను. అపుడు భవానందుఁడు వచ్చి వానిప్రక్కను నిల్చెను.

మహేంద్ర—మీరెవరండి?

భవానంద—నేనెవరైన మీకేమి?

మహేంద్ర—అందువలన నాకు కొంచెము పనియున్నది; ఈదినము మీవలన మహోపకారమును బొందితిని.

భవానంద—అట్టి ఉపకారము నావలనఁ గలిగినదని మీరు నమ్మినట్లు నాకు తోఁపలేదు. మీచేత ఖడ్గ ముండియు దూరముగ నిలిచియుంటిరి. జమీందారుల కుమారులు పాలు పెరుగు వెన్న నెయ్యి లడ్డు బూంది మొదలైనవానిని గొంతు వఱకు తినుటకును, ఇష్టానుసారముగా ధనమును దుర్వినియోగముచేయుటకును సమర్థతగలవారేకాని సమయమువచ్చినపుడు ఎందులకును పనికిరారు.

మహేంద్ర—భవానందునిమాట ముగియునంతలోపల వేసటనొంది, 'ఈపని మంచిపనికాదు, ఇది దొంగపని' యనెను.

భవానంద—దొంగపని యైనను చింతలేదు. నావలన, మీరు ఉపకృతులైతిరి. ఇంకను ఉపకారమును పొందవలసిన వారై యున్నారు, నే నింకను ఉపకారము చేయవలయునని యున్నాను అనెను.

మహేంద్ర—మీరు నాకుపకార మొనర్చినది నిజము, ఇంక నేమియుపకారము చేయఁబోయెదరు? దొంగలచేతనుండి తప్పించితిరి. నేను తమకు ప్రత్యుపకారము నేమియు చేయుటకును శక్తుఁడను కాను.

భవానంద — మీరు నా ఉపకారమును గ్రహించిననేమి, గ్రహింపకపోయిన నేమి, ప్రత్యుపకారము చేసిననేమి, చేయకపోయిననేమి, మీయిష్టము. మీరు నాతో వచ్చితిరేని మీ భార్యను కొమార్తెను చూపఁగలను.

మహేంద్ర — (భవానందుని ముఖమునుజూచి ఆశ్చర్యముతో) అదెట్లు?

భవానందుఁడు మాటాడక పోవుచుండెను. మహేంద్రుఁడు చేయునదిలేక వానివెంబడి పోవుచుండెను. పోవునపుడు తనలో "ఏ రెట్టి దొంగలబ్బా!" అని తలంచుకొనెను.

---

## పదియవ ప్రకరణము

### మహేంద్రుఁడు భవానందునితో భాషించుట

ఆజ్యోత్స్నామయి యైన రాత్రియం దిరువురును నిశ్శబ్దముగా ప్రాంతరమును దాఁటిపోయిరి. మహేంద్రుఁడు విన్నఁబోయినవాఁడును, శోకాతురుఁడును, గర్వితుఁడును, కొంచెము కౌతూహలావిష్టుఁడునై యుండెను.

భవానందుఁడు, అన్యభావమును ధరించెను. వాఁడు స్థిరమూర్తి యైన ధీరప్రకృతిగల సన్న్యాసిగా నుండలేదు. ఆసైన్యాధ్యక్షుఁ డైన ఘాతుకుఁడుగాఁ గనఁబడలేదు. కొంచెము సేపునకు ముందు మహేంద్రసింహుని తిరస్కారముచేసిన యహంభావమును లేదు, జ్యోత్స్నామయియును శాంతశాలి

నియున్నైన పృథ్వీప్రాంతమును, కానన నగమును, నదియొక్క శోభాకాంతినిఁ జూచి, వానిమనస్సు సముద్రము చంద్రోదయముచే ఆహ్లాదితమై హాసము చేయునట్లు విశేషస్ఫూర్తినిఁ దాల్చెను. భవానందుఁడు హాస్యముఖుఁడై వాఙ్మయప్రియసంభాషి యయ్యెను. ఏవేవో విషయములను జెప్పుట కుత్సుకుఁడయ్యెను. ఎన్నెన్నో ప్రయత్నములు చేసి చూచెను. మహేంద్రసింహుఁడు మాటలాడలేదు. అంత భవానందుఁడు తనంతటతానే పాడుటకుఁ దొడంగెను. ఎట్లన—

పల్లవి

వన్దే మాతరం.

అనుపల్లవి

సుజలాం సుఫలాం మలయజశీతలాం,

సస్యశ్యామలాం మాతరం.

మహేంద్రుఁడు, సంగీతమును విని విస్మితుఁడాయెను. పదియు బోధకాలేదు. కావున, "సుజలా, సుఫలా, మలయజ శీతలా, ఇట్టి గుణవిశిష్టురాలైనమాత యెయ్యది?" యని ప్రశ్న చేసెను.

భవానందుఁడు, ఉత్తర మీయక మరల సంగీతమును మొదటనుండి స్వరయుక్తముగ పాడుటకుఁ బ్రారంభించెను.

దేశీయరాగము

పల్లవి

వన్దే మాతరం.

÷ ∸

స్వరము. సా - - సా - -

వ న్దే

౧ - - -

నీ - (సా రి స) - - ని - ం ధాం

౨

పా - - ధా ం - పా ం మ ం గా ం

మా త

3

రి - - - -

రం

౦

మ - రి - మ - -

మా

౧

పా - - ధా - -

౨ - . - - -

ని - సా - (ని - సా రి) - ం సా ం

తరం

3 - - -
(సా రి సా) - ని - (ధా పా మ) - పా -
వన

సా - - సా - -
ద

సుజలాం సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం.
శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదలశోభినీం
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం వరదాం
మాతరం.

సప్తకోటికణ్ఠకలకలనినాదకరాలే
ద్విసప్తకోటిభుజై ర్ధృతఖరకరవాలే
అబలా కేన మా ఏత బలే
బహుబలధారిణీం నమామి తారిణీం
రిపుదలవారిణీం
మాతరం.

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ
త్వంహి ప్రాణా శ్శరీరే

బాహుతే తుమి మా శక్తి
హృదయే తుమి మా భక్తి
తోమార ఇ ప్రతిమాగడి మన్దిరే
త్వం హి దుర్గా దశప్రహరణ ధారిణీ
కమలా కమలదళవిహారిణీ
వాణీ విద్యాదాయినీ
నమామి త్వాం.
నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం
మాతరం.
వన్దే మాతరం.
శ్యామలాం సరలాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం.

మహేంద్రుడు గీతమును విని, 'ఇది దేశవర్ణనముగా నున్నది, మహాశక్తిమాత యైన దుర్గాదేవివర్ణనము కాదు' అనెను.

భవానందుడు— మేము ఇతరమాతను స్తుతించుట లేదు. "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" మాకు జన్మభూమి యే తల్లి, మాకు వేఱేతల్లి లేదు, తండ్రి లేదు, అన్న లేదు, తమ్ముడు లేదు, పెండ్లము లేదు, బిడ్డ లేదు, ఇల్లు లేదు, కుటుంబము లేదు, మాకుండునది యంతయు కేవలము సుజలా, సుఫలా, మలయజశీతలా, సస్యశ్యామలా, అనెను.

మహేంద్రుఁడు సంగీతార్థమును దెలిసికొనఁగోరి 'మరల నొకతూరి చెప్పు' మనెను.

భవానందుఁడు మరల నొక్కసారి గీతమును మొదట నుండి అర్థమగునట్లుగాఁ జెప్పుచు కన్నీరు కార్చుచు నుండుటను జూచి, మహేంద్రుఁడు మిగుల నాశ్చర్యము నొంది "మీరెవరు?" అని యడిగెను.

భవానంద—మేము సంతానులము.

మహేంద్ర—సంతానులనగాఁ నేమి? ఎవరి సంతానులు?

భవానంద—మహామాతయొక్క సంతానులము.

మహేంద్ర—మంచిది, సంతానులు దొంగతనము చేసి. దారికట్టి దోఁచి మహామాతపూజ చేయవచ్చునా యేమి? ఇదెట్టి మాతృభక్తి?

భవానంద—మేము దొంగతనము చేయలేదు, దారికట్టి దోఁచలేదు.

మహేంద్ర—ఇప్పుడేకదా మీరు ఒకబండిరూపాయలను కొల్లగొట్టితిరి ?

భవానంద—అది కొల్లయగునా యేమి? ఆధన మెవరిది?

మహేంద్ర—అది రాజుధనము కాదా యేమి?

భవానంద—రాజుధనమా? ఈధనమును తీసికొనుటకు వాని కేమి యధికార మున్నది?

మహేంద్ర—రాజుగా నుండుట చేత నే.

భవానంద—రాజు చేయవలసినపని యేమి?

మహేంద్ర—ప్రజలను పాలించుచుండుట.

భవానంద—ఎవఁడు ప్రజలను పాలించలేదో, వాఁడు రాజు కాఁడు కదా?

మహేంద్ర—మీరు రాజును ధిక్కారము చేయుట వలన ఒకప్పుడు కానున్నను మఱియొకప్పుడు సిపాయీల గుండు దెబ్బలకు గురి యగుదురు.

భవానంద—చాల మంది సిపాయీలను జూచినాను. ఈదినమునను.

మహేంద్ర—చక్కఁగా జూచినాను జూచితివి. ఇంకొక చూడఁగలవు.

భవానంద—ఎందులకు కాఁగూడదు. చూడఁగలను. ఒక్కతేపగాక రెండు తేపలు చచ్చుటలేదు కదా?

మహేంద్ర—కావలయు నని చచ్చినప్రయోజన మేమి?

భవానంద—మహేంద్రసింహా! నిన్ను మనుష్యుఁడని తలంచి యుంటిని. ఇపుడు చూడఁగా నీవు పాలు వెన్న చక్కెరకు యమస్వరూపుఁడవై యున్నాఁడవే గాని వేఱేమియు కాదు. సర్పమునకు కాళ్లు లేవు; అది కడుపుతోనే జరుగుచున్నది; అంతకంటె నీచమైనజంతువుగు . నేనిదివఱకు చూడలేదు. ఎవరైనను కాలితో ద్రొక్కినయెడల, పడగనెత్తికొని లేచుచున్నది; నీశాంతము ఇంకను పోలేదు; అదెట్టిశాంతమో దేవునికే తెలియవలయును; ఎంతదేశ మున్నదో యాలోచింపుము; మగధము, కాశి, కాంచి, డిల్లి, కాశ్మీరము మొదలగు దేశము లెన్నియో గలవు. ఏదేశమునను ఇట్టి దుర్దశ లేదు. ఏదేశస్థులు తినుటకు కూడులేక మలమల మాడుచు కసవును గడ్డిని తినెదరు? ఆకులలములు తినెదరు? ఏదేశమున

మనుష్యులు కుక్కలను నక్కలను తిందురు? చచ్చిన పీనుఁగులను తిందురు? ఏదేశమున గుప్తముగా ధనమును దాఁచి యుంచినను రక్షకము లేకున్నది? పెండ్లాము బిడ్డలకుఁ గూడ నెమ్మది లేదు; కడుపులోని శిశువునకుఁగూడ నెమ్మది లేదు. ఇంతకంటె అన్యాయము వేఱేమున్నది? ఏదేశమందు రాజులు ప్రజారక్షణము చేయకున్నారు? అదియే ఉభయులకుఁగల సంబంధము. అది లేనప్పుడు పరస్పర సంబంధ మేమున్నది? మన దేశమునందు రాజు ప్రజలను సంరక్షించుచున్నాఁడా? ధర్మము పోయెను, జాతి పోయెను, మానము పోయెను. కులము పోయెను, ఇఁక ప్రాణముకూడ పోనున్నది. ఈ దుర్మార్గులను తఱిమి వేయకగాని హిందువులు హిందువులుగా నుండుటకు సాధ్యము కాదు.

మహేంద్ర—వారిని దేశమునుండి తఱిమివేయుట యెట్లు? ఆపని చేయువా రెవరు?

భవానంద—నేనే.

మహేంద్ర—నీవు ఒక్కఁడవే తఱిమి వేయుదువా? ఒక్కనిచేత నేమగును?

ఆమాటను విని, భవానందుఁడు మరల గీతములు పాడఁ దొడంగెను.

"సప్తకోటి కణ్ఠకలకలనినాదకరాలే
ద్విసప్తకోటిభుజైర్ధృతఖరకరవాలే"

ఇట్టి మహామాతను ఎవరు అబల యని చెప్పుదురు?

మహేంద్ర—అయినను, నీవు ఒక్కఁడవే కదా ?

భవానంద—ఇపుడు నీవు ఇన్నూఱుగురుజనులను చూడ లేదా?

మహేంద్ర—అందఱును సంతానులా (సన్న్యాసులా?)

భవానంద—ఔను, అందఱును సంతానులే.

మహేంద్ర—ఇం కెంద ఱున్నారు?

భవానంద—ఇట్టివారు వేలకొలఁదిజను లున్నారు, ఇంకను కాఁదగినవారు నున్నారు.

మహేంద్ర—పది ఇరువదివేల జనులు చేరుదురా? అయినంతమాత్రమున తురకలను రాజ్యపదభ్రష్టులనుగాఁ జేయుటకు సాధ్యమా?

భవానంద—పలాశి (Plassy) యుద్ధమునందు ఇంగ్లీషువారి కెంత సైన్య ముండెను?

మహేంద్ర—ఇంగ్లీషువారు బంగాళీలా యేమి?

భవానంద—అయిన నేమి? శరీరబల మధికముగ నున్న చాలదా? గుం డేమి చేయును. అది యెంతమాత్రము?

మహేంద్ర—అయినను ఇంగ్లీషువారికిని తురకలకును ఇంత వ్యత్యాస మేమి?

భవానంద— మొదటిది, ఇంగ్లీషువారిలో నొకఁడు చచ్చిపోయినయెడల అందఱును పరుగెత్తిపోవుటలేదు; ముసల్మానులమీఁద ఒక దెబ్బపడినచో నందఱును పలాయనపరు లగుచున్నారు; పర్వత్తును వెదకుచు పోయెదరు. రెండవది, ఇంగ్లీషువారికి పట్టుదల కలదు; పట్టినపట్టు విడువరు; సాధించె దరు. ముసల్మానులు దీనికి వ్యతిరేకము; వేతనాపేక్ష కల వారు; ధనమునకై ప్రాణమును విడిచిపెట్టువారు; అదియు

సరిగా వచ్చుటలేదు. సిపాయీలకు నెలజీతము సరిగా ముట్టుట లేదు కడపటిమాట, సాహసము పిరంగిగుండు, ఒక్కస్థలమున నేగాని పదిచోట్లలో పడుటలేదు. కాఁబట్టి ఒక గుండును జూచి పదుగురు పరుగిడవలసిన పనిలేదు. అయినను, ఒకగుండును జూచినయెడల తురకలందఱును పరుగిడెదరు. గుంపులో గుండుపడినా ఇంగ్లీషువారు పాఱిపోవుటలేదు.

మహేంద్ర—అట్లయినమీకీగుణములన్నియుఁగలవా?

భవానంద—లేదు. గుణములు పండ్లవలె చెట్లలోనుండి రాలుట లేదు. అభ్యాసము చేసినచో వచ్చును.

మహేంద్ర—మీరు అభ్యాసము చేయుచున్నారా యేమి?

భవానంద—కనఁబడలేదా మేము సన్న్యాసులనునది? మాసన్న్యాస మంతయు నీయభ్యాసముకొఱకే. కార్యసాధనమైన (అభ్యాసము సంపూర్ణమైన) యెడల, మేము మరల గృహస్థుల మగుదుము. నాకును ఆలు బిడ్డలు కలరు.

మహేంద్ర—మీసంతాన మంతయు జనులను వంచించుటకే కదా !

భవానంద—సంతానులు అబద్ధము చెప్పుటలేదు. నీయొద్ద బొంకి మెప్పొందవలసినంత గ్రహచార మేమియులేదు. వంచించువా రెవరు? వంచన యనునది మాయొద్ద దొరకదు. అది మొదటనుండియు లేదు. మేము మాత్రము నెఱవేర్చువారము. నీవును సంతానుఁడ వయ్యెదవా ?

మహేంద్ర—నేను నా పెండ్లామును బిడ్డను చూడకయే యేదియుఁ జెప్పను.

భవానంద—అట్లయిన రమ్ము, నీభార్యను కొమార్తెను జూపెదను. ఇట్లు చెప్పి భవానందుఁడు ముందు నడిచెను. మహేంద్రుఁడు వానిని వెంబడించి చనెను. భవానందుఁడు మరల "వందేమాతరం" అను గీతమును పాడుటకుఁ దొడంగెను. మహేంద్రుని కంఠస్వరమును శ్రావ్యమైనది. వాఁడును పాడుట కారంభించెను. ఇట్లు పాడుచున్న మహేంద్రుఁడును బాష్పపూరిత లోచనుం డయ్యెను. అంత వాఁడు భవానందుని జూచి, 'భార్యను బిడ్డను త్యజింపకుండుటకు సాధ్య మగు నెడల, మీవ్రతమును నాకును దెల్పుఁ డనెను

భవానంద—ఈవ్రతము నవలంబించువారు భార్యను బిడ్డలను త్యజింపవలయును. నీవు ఈవ్రతము నవలంబించితివేని పెండ్లామును బిడ్డను జూడఁగూడదు. వారు సుఖముగా నుండుటకుం దగిన పద్ధతులు చేయఁబడును. ఈవ్రతము సమాప్తియైన మీఁద భార్యను బిడ్డను జూచుటకు ఆటంకము లేదు.

మహేంద్ర—అట్లయిన యెడల నే నీవ్రతము నాచరింపను; నాకుఁ దెల్పవలదు.

---

## పదునొకండవప్రకరణము

### మహేంద్రుఁడు భార్యను బిడ్డను గాంచుట.

రాత్రి గడచెను. ఉదయ మయ్యెను. నిర్జనారణ్యము. ఇదివఱకు అంధకారముగను నిశ్శబ్దముగను ఉండెను. ఇప్పుడు

ఆలోకమయ మైనది. పక్షుల కలకలశబ్దము శ్రోత్రానందమై యుండెను. ఆనందమయమైన కాననమునందలి "ఆనందమఠ" మునందు సత్యానందస్వామి మృగచర్మాసీనుఁడై ప్రాతస్సంధ్యావందనము చేయుచుండెను. వానిపార్శ్వమున జీవానందుఁడు కూర్చుండి యుండెను. ఈసమయమునందు భవానందుఁడు మహేంద్రసింహునితోఁ బోయి నిలువంబడెను. బ్రహ్మచారి మాటలాడక సంధ్య వార్చుచుండెను. ఎవరును మాటలాడుటకు ముందు పడలేదు. సంధ్యాహ్నికకృత్యము ముగిసిన మీఁద, భవానందుఁడును జీవానందుఁడును సాష్టాంగప్రణామం బాచరించి వినీతభావముతోఁ గూర్చుండిరి. అపుడుసత్యానందుఁడు భవానందునికి సంజ్ఞ చేసెను. ఇర్వురును బైటపోయి యేమో మాటలాడుచుండిరి. వారిమాటలు మనకుఁ దెలియవు. తర్వాత ఇర్వురును వచ్చిరి. బ్రహ్మచారి మందహాసవదనుఁడై కరుణభావముతో మహేంద్రునింజూచి, 'అన్నా! నీదుఃఖమునందు నేనును భాగినై యున్నాఁడను. దీనబంధువైన భగవంతునికృపచే నీభార్యయు బిడ్డయు క్షేమముగా నున్నా'రని వారివృత్తాంతము నంతయుఁజెప్పి, 'రమ్ము, వారిని కనఁబఱచెద' నని నడిచెను. మహేంద్రుఁడు వెంబడిపోవుచుండెను.

ఇర్వురును దేవాలయములోనికిం బోయిరి. పోఁగా మహేంద్రుఁడు విస్తారమైనదియును అత్యున్నతమైనదియు నగు గృహమును జూచెను. ఆ నవారుణోదితమైన ప్రాతఃకాలమునందు సమీపమునం దున్న కాననము సూర్యకిరణములచే వజ్రఖచితమైనట్లు జ్వలించుచున్నను, విశాలమైన యాగృహము అంధకారమయముగనే యుండెను. ఆగృహమునం దేమి

యుండెనో యది మహేంద్రునకు మొదట తెలియలేదు. అట్లే చూచుచుండఁగా నొక చతుర్భుజమూర్తి గోచర మయ్యెను. ఆమూర్తి శంఖచక్రగదాపద్మహస్తయును, కౌస్తుభశోభిత హృదయయునునై యుండెను. ఆమూర్తి కెదుట సుదర్శనము ఘూర్ణ్యమానప్రాయముగ స్థాపితమై యుండెను. మధుకైటభదైత్యస్వరూపములు బృహదాకారఛిన్నమస్తకములుగను రక్తస్రావితమైనవిగను చిత్రింపఁబడి యుండెను. వామభాగంబున శ్రీలక్ష్మీదేవివిగ్రహము విశీర్ణకుంతలముతోడను, శతదళమాలాధారిణిగను, భయకంపిత శరీరిగను నిలుచునట్లు నిర్మింపఁబడి యుండెను. దక్షిణభాగమునందు సరస్వతీదేవి వీణాపుస్తకపాణియు మూర్తిమంతములైన రాగరాగిణీపరివృతయునై నిలిచి యుండెను. వీనికంటె, మహోన్నత స్థానంబునందు మంచముమీఁద నవరత్నఖచితాసనమునం దొక యైశ్వర్యాన్విత మోహినీమూర్తి యుండెను. ఆమూర్తికి, దేవ గంధర్వ కిన్నర యక్ష రక్షస్సు లెల్లరు వివిధోపచారములు చేయుచున్నట్లు కన్పట్టెను. బ్రహ్మచారి గద్గద స్వరముతో మహేంద్రునిం జూచి, "అన్నియుఁ జూచినావా?" యనెను.

మహేంద్ర—అన్నిటిని జూచితి.

బ్రహ్మచారి—మీఁద నున్న దేమి, చూచితివా?

మహేంద్ర—చూచితిని, అది యెవరు?

బ్రహ్మచారి—మహామాత.

మహేంద్ర—మహామాత యెవరు?

బ్రహ్మచారి—సంతానులకుమాత. మాకు ఆమెయేతల్లి.

మహేంద్ర—ఆ తల్లి యెవరు?

బ్రహ్మచారి—సమయము వచ్చినప్పుడు తెలిసికొనెదవు. ఇపుడు "వందేమాతరం" అని చెప్పుము; అనెను.

మహేంద్రసింహుఁడు "వందేమాతరం" అనిచెప్పెను.

అటమీఁద, బ్రహ్మచారి మహేంద్రుని వేఱొకగృహముసకుఁ బిలుచుకొనిపోయెను. మహేంద్రుఁడు, అపూర్వమై, సర్వాంగ సౌందర్యయై, సర్వాభరణభూషితయై, జగద్ధాత్రియై వెలయు దేవీమూర్తినిం గాంచి, 'యిదేమి?' యనెను.

బ్రహ్మచారి—మహామాత పూర్వస్థితి.

మహేంద్ర—అదేమి?

బ్రహ్మచారి—ఈదేవి మొదట సింహాగజాదివన్యమృగములన్నియు పదతలమునం ద్రొక్కి వన్యపశువాసభూమియందు తన పద్మాసనమును స్థాపించెను. అక్కాలమున సర్వాభరణభూషితయై, మందహాసవదనయై, మహాదైశ్వర్యసంపన్నయై, మహాసుందరియై, బాలార్కారుణవర్ణాభయై ప్రకాశించుచుండెను. ఈమెకు ప్రణామము చేయుము.

మహేంద్రుఁడు, భక్తిభావముచేత జగద్ధాత్రిరూపిణియైన మాతృభూమికి ప్రణామముచేసినపిదప, బ్రహ్మచారి వాని కొక సొరంగమును జూపి ముందు నడిచెను. మహేంద్రుఁడు భయముతోఁ గూడినవాఁడై వెన్నంటిపోయెను. ఆభూగర్భస్థ అంధకారమయమైన మందిరమునందు ఎచ్చోటనో కొంచెము వెలుతురు మినుకుమినుకు మని తెలియు చుండెను. ఆ రవంత వెల్తురులో నొకకాళికామూర్తి కనఁబడెను.

బ్రహ్మచారి—చూడుము, తల్లియెటులై పోయియున్నదో

మహేంద్ర—భయముతో, కాళి, యిట్లేల యైనదో?

బ్రహ్మచారి—'అంధకారసమాచ్ఛన్నమైన కాలిమాము యైన మహాకాళి, అపహృతసర్వస్వయై నగ్నయై యున్నది. ఇపుడు దేశమంతయు శ్మశానమై పోయినది. కావున, మహామాత కంకాళమాలినియై యున్నది. తనమంగళమును తన పదతలంబున మెట్టుకొని యున్నది' అని చెప్పుచు కన్నీరొలుకుచు 'హా తల్లీ!' యనెను.

మహేంద్రుఁడు—ఈమె చేతియందు ఖేటకర్పరము లేల?

బ్రహ్మచారి—మేము సంతానులము, వీనిని మాతల్లికి ఆయుధములుగా నిచ్చి యున్నారము. చెప్పుము, "వందేమాతరం."

మహేంద్రుఁడు "వందేమాతరం" అని చెప్పి కాళికి నమస్కరించెను. అనంతరము బ్రహ్మచారి, 'ఈమార్గముగా రమ్ము.' అని చెప్పి రెండవసొరంగమునకు పోయెను. మహేంద్రుఁడును పోవుచుండెను. పోవునపుడు వా రిరువురిమీఁదను ప్రాతస్సూర్యకిరణరాశి సోఁకెను. నలుదిశలయందును పక్షులు కలకల మునికూయుచుండెను. అచ్చట మర్మరప్రస్తరనిర్మితమైన ప్రశస్తమందిరమునందు సువర్ణనిర్మితమైన దశభుజవిగ్రహము, ఆనవారుణకిరణమునందు జ్యోతిర్మయమై మందహాసముఖియై ప్రకాశించుచుండెను. బ్రహ్మచారి ప్రణామముచేసి, ఈమె యే తల్లి. ముందెట్లు కావలయునో ఆస్వరూపమును దెలియఁజేయుచున్నది. దశభుజములు దశదిశలయందు ప్రసారితమై యున్నవి. ఆదశభుజములయందు నానావిధశక్తులు ఆయుధస్వరూపములుగా శోభిల్లుచున్నవి. శత్రువిమర్దితపదయుగళంబును

జూడుము. పదాత్రితులైన వీర కేసరులు శత్రునిపీడనమునందు నియుక్తులై యున్నారు. 'హేదిగ్భుజ!' అని చెప్పుచు గద్గద కంఠుడై కన్నీరొలుకుచుండి, కొంతవడికి యాదిగ్భుజ నానా ప్రహారణధారిణియు, శత్రుమర్దనియు, వీరేంద్రపృష్ఠహారిణియు నై యున్నది. ఈమె దక్షిణపార్శ్వమునందు భాగ్యస్వరూపిణి యగు మహాలక్ష్మి యున్నది. వామపార్శ్వమునందు విద్యా విజ్ఞానదాయినిగైన వాణియున్నది. మఱియు, సమీపమునందు బలపరాక్రమసంపన్నుఁడైన కార్తికేయుఁడు, కార్యసిద్ధిదాయకుఁడైన గణనాథుఁడు నున్నారు. రమ్ము. మన మిర్వురమును మహామాతకు ప్రణామముచేయుదము" అనిచెప్పి యిర్వురును చేతులు జోడించుకొని, ఊర్ధ్వముఖులై ఏకకంఠముతో "సర్వమఙ్గళ మాఙ్గల్యే శివే సర్వార్థసాధకే, శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే" అనిస్తుతించి, భక్తిభావము తోడ సాష్టాంగదండప్రణామముచేసి లేచి నిలువంబడిరి.

మహేంద్ర—(గద్గదకంఠస్వరముతో) మహామాతయొక్క యిట్టి దివ్యమంగళ స్వరూపమును మఱల నెప్పుడు చూడ వచ్చును!

బ్రహ్మచారి—ఎప్పుడు మహామాతయొక్క సంతానులందఱును తల్లిని తల్లీ, యని పిలుతురో, అప్పుడు చూడ వచ్చును? అప్పు డామె ప్రసన్నురా లగును.

మహేంద్ర—నా పెండ్లము బిడ్డ లెక్కడ నున్నారు?

బ్రహ్మచారి—నా వెంబడి రా, చూతువు.

మహేంద్ర—వారిని ఒక్కమాఱు చూచి చెప్పి వచ్చెదను.

బ్రహ్మచారి—చెప్పి రావలసిన దేల?

మహేంద్ర—నేనును ఈమహావ్రతమును గ్రహణము చేయుదును.

బ్రహ్మచారి—వారిని ఎచ్చటికి పంపఁగలవు?

మహేంద్రుఁడు కొంచె మాలోచించి, నాయింటియం దెవరును లేరు. నాకు వేఱే చోటేమియు లేదు. ఈ అనాయక సమయమునం దెచ్చట స్థలము దొరకును?

బ్రహ్మచారి—మనము వచ్చినమార్గముననే వెనుకకుఁ దిరిగి పోయింతిమేని యచ్చటనుండు మందిరమున నీభార్యయు బిడ్డయు నుందురు. కల్యాణి, ఇంకను ఉపవాసము. వారుండు చోటనే భక్ష్యసామగ్రులు సిద్ధమై యున్నవి. వారిని భుజింపఁ జేసి నీయిష్టప్రకార మేమేని చేయుము, నేను పోయెదను. నీ మన స్సారీతిగ నుండెనేని ఉపయుక్తసమయమునందు నిన్ను చూడఁగలను. అనిచెప్పి బ్రహ్మచారి యేదో యొకరహస్య మార్గముగా వెడలిపోయెను. మహేంద్రుఁడు తాను పోయిన మార్గముననే వెనుకకు దిరిగివచ్చి చూడఁగా నచ్చటి మందిర ద్వారమునందు కల్యాణి కొమార్తెను తొడపై నిడికొని కూర్చుండి యుండెను.

సత్యానందుఁడు వేఱొకసొరంగమున దిగి భూగర్భస్థమైన మఱొకమందిరమునకుఁ బోయెను. అచ్చట జీవానందుఁడును భవానందుఁడునుగూర్చుండి రూపాయలను లెక్కఁబెట్టి కుప్పలు కుప్పలుగా నుంచుచుండిరి. ఆమందిరమునందు స్తూపాకారముగా బంగారు వెండి తామ్ర నాణెములును, వజ్రవైడూర్య ప్రవాళ ముక్తాది నవరత్నములును రాసులురాసులుగా నుం

డెను. నిన్నటిరాత్రి వీరు కొల్లగొట్టి తెచ్చిన రూపాయల నెంచి సరిగా నుంచుచుండిరి. సత్యానందుఁడు ఆమందిరమునకుఁ బోయి, 'జీవానంద! మహేంద్రుఁడు వచ్చును. వచ్చినయెడల సంతానులైనమునకు మహోపకార మగును. ఏలయన అట్లు వచ్చినయెడల వారిపెద్దలనాఁటినుండి సంపాదించిన ధనరాశి మహామాతసేవకు అర్పితమగును. అయినను వాఁ డెన్ని దినములదాఁక త్రికరణశుద్ధిగా మాతృభక్తుఁడు కాకుండునో అంత వఱకును వానిని గ్రహింపఁగూడదు. మీపనియైనమీఁద మీరు భిన్న భిన్నసమయములలో వాని ననుసరించి, అనుకూలమైనప్పుడంతయు శ్రీవిష్ణుమంటపమునకుఁ బిలిచికొని పోవలయును. మఱియు, ఎట్టిసమయమునం దైనను సరియే, వాని ప్రాణరక్షణమునందు జాగరూకతకలిగియుండవలయును. ఏలయన, సంతానులకు దుష్టశాసన మెట్లు కర్తవ్యమో, అట్లే, శిష్టరక్షణమును కర్తవ్యమైన ధర్మమై యున్న' దని చెప్పెను.

---

## పంద్రెండవప్రకరణము

మహేంద్రుఁడు భార్యతోఁగూడ పయనం బగుట.

మహేంద్రుఁడు మిగుల ప్రయాసముతోఁ గల్యాణి యున్నచోటికి వచ్చెను. కల్యాణి చాలాసేపు ఏడ్చెను. మహేంద్రుఁడును రోదనము చేసెను. ఉభయులును కన్నులు

తుడిచికొనిరి. అయినను, కన్నీరు మున్నీరుగాఁ బ్రవహించుచునే యుండెను. కొంతసేపటికి తమకుఁ దామే శాంతి నొందిరి. కల్యాణి, భోజనప్రస్తావము చేసెను. బ్రహ్మచారి యనుచరుం డొకఁడు భక్ష్యముల నొకతట్టయందిడి తెచ్చెను. దానిం గైకొనుమని కల్యాణి భర్తతోఁ జెప్పెను. దుర్భిక్షకాలము కనుక అన్న వ్యంజనాదులు దొరకుట లేదు. అయినను సంతానులకు మాత్రము దొరకుచుండెను. లేనివస్తువు లెవరికిని దొరకవు. ఆయరణ్యము సాధారణజనులకు అగమ్య మైనది. ఏచెట్టునం దేకాయ కాచినను ఎప్పుడు పండినను అన్నమునకు లేనివారు దానిని గోసి తినివేయుదురు. ఈయడవిచెట్లలోని కాయలును పండ్లును ఇతరులకు లభ్యము కావు. బ్రహ్మచారి కొన్ని దినుసుల పండ్లును కొంచెము పాలును తెచ్చియిచ్చి వెడలిపోయెను. సంతానులకు పాడియావులు చాలాకలవు కల్యాణి పలువిధములుగా వేఁడుకొన్న ందుమీఁద మహేంద్రుఁడు కొన్ని పండ్లను దినెను. భుక్తావశేషమును గల్యాణి వేఱొక ప్రదేశమునందుకూరుచుండి భుజించెను. అనంతర మిరువురును నిద్రించి శ్రమమును పరిహారము చేసికొనిరి. మేల్కాన్న తర్వాత ఇర్వురును ఎచ్చటికిఁ బోవలయునో దానిని గూర్చి యాలోచించిరి. 'కల్యాణి, మనము గృహమునం దున్నయెడల విపత్తు కల్గునని యెంచి గృహత్యాగము సేసివచ్చితిమి, ఇపుడు చూడఁగా ఇంటికంటె బైటనే విపత్తు లధికముగా నున్నవి. మఱల ఇంటికే పోదము' అనెను. మహేంద్రునికిని అదే యభిప్రాయముండెను. వాఁడు కల్యాణిని ఇంటియం దుంచి సంరక్షించుటకుఁ దగిన మనుష్యులను నియమించి, పరమరమణీయ

మును అపార్థివమును పవిత్రమునైన మాతృసేవావ్రతదీక్షను గయికొనవలయునని యాలోచించికొని యుండెను. కావుట్టి, వాఁడు కల్యాణి చెప్పినదానికి సమ్మతించెను. అనంతర మిర్వురును ఆయాసమును పరిహరించుకొని బిడ్డ నెత్తుకొని పదచిహ్న గ్రామాభిముఖులై బయలుదేరిరి.

పదచిహ్న గ్రామమున కేమార్గముగాఁబోవలయునోయది తెలియదు. ఆదుర్భేద్యమైన యరణ్యమధ్యమునందు కొంచెమైనను మార్గమును దిక్కును గోచరించలేదు. వారు అరణ్యమును దాఁటిపోయినమీఁదఁ దెలియఁగలదని తలంచి యుండిరి. ఆయరణ్యమునుండి బైటపోవుటకు దారి కనఁబడలేదు. అటు ఇటుపోయిచూచిరి గాని, తుదకు ఆమఠము చెంతకే రావలసి నట్లేర్పడెను. బైటపోవుటకు దారియే కనఁబడలేదు. అక్కడ, వీరిముందుగా నొక అపరిచితుఁడైన వైష్ణవవేషధారి యైన బ్రహ్మచారి నవ్వుచు నిలిచియుండెను. వానింజూచి మహేంద్రుఁడు కోపముతో 'ఏలనవ్వెద' వనెను.

వైష్ణవసన్యాసి—మీ రీయడవి కెట్లు వచ్చితిరి?

మహేంద్ర—ఎట్లయిన నేమి, వచ్చిచేరితిమి.

వైష్ణవ—వచ్చిచేరితిరికదా! ఏల బైటపోవుటకు తెలియ లేదు? అని చెప్పి మరల నవ్వెను.

మహేంద్ర—కోపముతో, నవ్వుటచే నేమిప్రయోజనము, నీవుమాత్రము పోఁగలవా? యనెను.

వైష్ణవ—నాతోఁగూడ వచ్చినచో మార్గము నగపడును; నీవు ఇచ్చటికి సన్న్యాసి వెంబడి వచ్చియుందువు. లేని

యెడల, ఈమఠమునకు వచ్చుటకును, బైటపోవుటకును ఎవరికిని సాధ్యము కాదు.

మహేంద్ర—నీవు సంతానుఁడవా?

వైష్ణవ—అవును; నేను సంతానుఁడను. నాతోఁగూడ రా; నీకు దారిచూపెద. నీకొఱకే నేనిచటికి వచ్చినాను.

మహేంద్ర—నీపేరేమి?

వైష్ణవ—నాపేరు ధీరానంద గోస్వామి. అని చెప్పి, ముందుగా నడిచెను. మహేంద్రుఁడును గల్యాణియు వాని వెనుకఁ బోవుచుండిరి. ధీరానందుఁడు అతిదుర్గమమైన మార్గముగాఁ బిలిచికొనిపోయి బైటవిడిచిపెట్టి, యతఁడు అడవిలోనికి ప్రవేశించెను.

ఆనందారణ్యమునందుండి వారి బైటికి వచ్చిరి; కొంత దూరమున వృక్షములచే నలంకరింపఁబడినట్టి యొకప్రాంతర మారంభమాయెను. ఆప్రాంతము నంటియే రాజమార్గము. మఱికొంచెము దూరమునందు అరణ్యమునందుండి కలకలమను శబ్దముతో నొకచిన్న యేఱు పాఱుచుండెను. జలము నిర్మలమై నిబిడమేఘమువలె నీలవర్ణముగా నుండెను. నదీతీరములందు శ్యామలశోభామయములైన నానాజాతీయ వృక్షములు నీటికి నీడనిచ్చునట్లు వాలియుండెను ఆవృక్షతతులందు నానావిధ పక్షులు నానావిధధ్వనులుచేయుచుండెను. ఆకలకలధ్వని కర్ణానందముగను, మనోహరముగ నుండెను. ఆధ్వని నదీప్రవాహ శబ్దముతో మిళితమైవినఁబడుచుండెను. అట్లే వృక్షచ్ఛాయయు జలవర్ణముతోఁ జేరిపోవుచుండెను. కల్యాణి మనస్సు ఆఛాయతోఁ జేరినట్లు కనఁబడుచున్నది. కల్యాణి నదీతీరమునం

దొక వృక్షమూలంబునం గూర్చుండి, తన నాథుని సమీప మునం గూర్చుండునట్లు చెప్పెను. మహేంద్రుఁడు కూర్చుం డెను. తర్వాత వానియొద్దనున్న బిడ్డను దీసికొని, మగని చేయిఁబట్టుకొని, 'నేఁడు మీముఖము వాడియున్నది, మనము విపత్తునుండి తప్పించుకొని వచ్చితిమికదా, ఇఁకనేల విషాదము?' అనెను.

మహేంద్ర—నిట్టూర్పుపుచ్చుచు, ఇఁక నేను నీవాఁడను కాను, నే నేమి చేయవలయునో తెలియ లేదు.

కల్యాణి—ఏల?

మహేంద్ర—నిన్ను విడనాడినది మొదలు చాల సంకట ములకు లోనైతిని. దాని నంతయుఁ జెప్పెద వినుమని సర్వ మును జెప్పెను.

కల్యాణి, "నాకును అనేకకష్టములు సంభవించెను. అనేక ములై సఆపదలకు లోనైతిని. ఇప్పుడు దానినంతయు విని నీవు చేయున దేమున్నది ? అతికష్టదశయందుఁగూడ నిద్దురవచ్చె ను. నిద్రావస్థయం దొక కలగంటిని. ఏమిపుణ్యబలముచే నట్టి కలవచ్చెనో తెలియదు. స్వప్నమునం దొక అపూర్వస్థలము నకు నేనుబోయితిని. అచ్చట భూమిలేదు. ఉత్త వెల్తురు. అది అతిరమణీయమైన వెలుతురు. అచ్చట మనుష్యులు లేరు. అందఱును జ్యోతిర్మయ మూర్తులు. ఆచోట శబ్దమే లేదు. ఎచ్చటనో దూరముగా మధుర మైన గీతవాద్యశబ్దము విన వచ్చెను, అక్కడ అపుడు వికసించిన మల్లికామాలతీ సుగంధ రాజాదిపుష్పముల సుగంధము సదా వీచుచుండెను. అచ్చట ఉన్నతాసనమునందు అందఱకును దర్శనీయ మగునట్లు మహా

ప్రకాశమూర్తి సుఖాసీనుఁడై యుండెను. శిరమున అగ్నిమయ మైన కిరీటమునుచతుర్భుజములును గల్గియుండెను. ఇరుప్రక్కల యందును నిద్దఱుస్త్రీమూర్తు లుండిరి. ఆరూపము, ఆకాంతి, ఆసౌరభము చెప్పనలవికాదు. దానిని జూచినమీఁద వచ్చు టకు మనసొప్పదు. ఆచతుర్భుజమూర్తి ముందుభాగమునందు మఱొక స్త్రీమూర్తి కలదు. దానినిఁ జూచుటకు సాధ్యము కాలేదు. జ్యోతిర్మయిగా నుండెను. అయినను, నాలుగుదిశ లందును మేఘాచ్ఛన్నమై యుండెను చక్కఁగాఁ గనఁబడ లేదు. ఆబింబము సుందరముగ నుండినప్పటికిని శీర్ణమై యేడ్చు చున్నట్లు తోఁచెను. నే నాసుగంధమందపవనతరంగములచేఁ గొట్టఁబడినదాననై మెల్లమెల్లగాఁ జతుర్భుజమూర్తిసింహాసన ము చేరువ చేరితిని. అచ్చట నామేఘగుంఠిత శీర్ణమూర్తి నన్నుఁ జూపుచు ఈస్త్రీయే యది దీనికొఱకే మహేంద్రుఁడు నాతోడపై వచ్చి కూర్చుండలేదనెను. అపుడు మధురమైన వేణునాదము వినఁబడెను. ఆచతుర్భుజమూర్తి నన్నుఁజూచి, 'నీపతిని విడిచిపెట్టి నాయొద్దకు రమ్ము ఈమెయే నీతల్లి. నీ స్వామిసమీపమునం దున్నయెడల ఈదేవిసేవ కలుగదు, నీవు వచ్చిచేరు' మనెను. నేను ఏడ్చుచు 'నాస్వామిని విడిచిపెట్టి యెట్లువత్తు' నని యడిగితిని. ఆవేణుస్వరములో నే 'నేనేస్వామి' నేనే తల్లి, నేనే తండ్రి, నేనే బిడ్డ, నాచెంతకు రమ్ము' అని వినఁబడెను. నేనేమి బదులుచెప్పితినో యది నాకు జ్ఞప్తిలేదు కొంతసేపటికి మేల్కాంచితి"నని చెప్పి,కల్యాణియూరకుండెను.

మహేంద్రుఁడు విస్మితుఁడై భీతిల్లినాఁడు; వాని నోట నుండి మాటయే రాలేదు. తలమీఁదుగ కోకిలపక్షి దిక్కుం

డలమునందు ప్రతిధ్వని నిచ్చెను. భృంగముల ఘీంకారముచే కాననము కంపిత మగుచుండెను. పక్షుల సుస్వరములచే నా కాశము ప్లావిత మయ్యెను. ఆనది పదతలమునందు మృదు కల్లోలధ్వని చేయుచు ప్రవహించుచుండెను. మందమారుతము నన్య పుష్పసుగంధమును వీచుచుండెను. నడుమ నడుమ జల మునందు సూర్యప్రకాశము తళతళ లాడుచుండెను. తాళ పత్రములు మందపవనముచే మర్మరశబ్దము చేయుచుండెను. దూరమున నీలమైన పర్వతము చూడ్కి కింపు పుట్టించుచుం డెను. కొంచెముసేపు వీరిర్వురును ముగ్ధభావముతో నిర్విణ్ణులై యుండిరి. కొంతవడికి కల్యాణి, మహేంద్రునిం జూచి 'మీరా లోచన చేయుచున్నట్లున్న' దనెను

మహేంద్ర—చేయవలసినదానిని ఆలోచించుచున్నా ను. స్వప్నము కేవలము బిభీషికమాత్రము, అది మనస్సునందు పుట్టి యచ్చటనే గిట్టుచున్నది, జీవనము జలబుద్బుదము, లెమ్ము, పోదము.

కల్యాణి—దేవత పోమ్మన్న చోటికి మీరుపొండు, అని చెప్పి బిడ్డను మగనిచేతి కిచ్చెను.

మహేంద్ర—నీ వెక్కడికిఁ బోదువు ?

కల్యాణి—చేతులతో కన్నులుమూసికొని దేవుఁ డెచ్చ టికి రావలయు నని చెప్పెనాఁడో అచ్చటికిఁ బోదును.

మహేంద్ర—(విన్న(బోయి), ఎచ్చటికి ?

కల్యాణి—విషపూరిత కరాటమును జూపెను.

మహేంద్ర—ఏమి, విషమును పుచ్చుకొనెదవా ?

కల్యాణి—పుచ్చుకొనవలయుననియే తెచ్చితిని. అయి నను—ఏమో చెప్పుట కాలోచించుచుండెను. మహేంద్రుఁడు ఆమె ముఖమును జూచుచుండెను. ఒక్కమాఱు కన్నుమూసి తెఱచుట యనునది ఒక్కసంవత్సరమువలె బోధ మగుచుం డెను. కల్యాణి మాట ముగించలేదు, కనుక మహేంద్రుఁడు ఆమెను జూచి—ఏమో చెప్పుటకు ప్రయత్నించితివికదా, చెప్పు మనెను.

కల్యాణి—పుచ్చుకొనుటకు నిశ్చయించితిని—అయి నను, తామును సుకుమారియు నుండఁగా, వైకుంఠమునకుఁ బోవుట కిష్టము లేదు. నేను చచ్చుట లేదు.

ఇట్లు చెప్పి కల్యాణి విషకరాటమును క్రిందనుంచి యిర్వురును భూతభవిష్యత్సంబంధమైన మాటల నాడందొడం గిరి. మాటలచే నిర్వురును అన్యమనస్కులై యుండిరి.

ఈయవకాశమధ్యమునం దాడుచున్నబిడ్డ విషకరాట మును తీసికొనియుండును. సుకుమారి తినుబండ మని భావించి డబ్బిని చేతఁబట్టుకొని క్రిందుమీఁదుగా త్రిప్పిత్రిప్పిచూచు చుండఁగా మూఁతతెఱవఁబడి విషగుళికలు నేలపైఁ బడియుం డును. అందొక దానిని బిడ్డ నోటిలో వేసికొనియుండు నని వారిమాటలచే మనకుఁ దెలియుచున్నది. లేక, డబ్బినే నోటి లో వేసికొని కొఱికినదో యేమో, ఏదియు నిశ్చయముగాఁ జెప్పుటకు వీలులేదు కదా ?

కల్యాణి—ఏమి తింటివి! కొంప మునిఁగినదే ఏమి చేయుదును ? అని బిడ్డనోట్లో వ్రేళ్లు వేసెను. బిడ్డ నోరుమూసి కొనెను. అందువలన విషద్రవము కడుపులోనికి పోయెను.

కల్యాణి బలాత్కారముచేత నాగుళికను తీసి విసరి పాఱవేసెను. బిడ్డ ఏడ్పుటకుఁ దొడంగెను.

వెంటనే కల్యాణి నదికిఁబోయి గుడ్డను తడిపి తెచ్చి బిడ్డ నోటిని తుడిచి, మిగుల చింతతో మగనిం జూచి, 'కడుపులోనికిఁ బోయి యుండునేమో' యనెను.

తల్లిదండ్రులకుఁ జెడుపే తోఁచుట స్వాభావికము. ఎచ్చట ప్రీతి విశ్వాసము లధికమో యచ్చోటనే భయముగ నుండును. మహేంద్రుఁడు మొదట గుళికను జూచినవాఁడు కాఁడు కనుక, నేలపైఁ బడియున్న గుళిక నెత్తి చూచి 'కొంతపఱకు పోయి యుండు' ననెను.

కల్యాణికిని ఆప్రకారమే తోఁచెను.

ఇంతలో బిడ్డకు విషావస్థకల్గెను. అటునిటు పొర్లెను. వికారస్వరముతో నేడ్చెను. కనులగ్రుడ్లు పైకి వచ్చెను. చొంగ కారుచుండెను. నాలుక వ్రేలాడుచుండెను. తుదకు నిశ్చేష్టిత యయ్యెను.

అంత కల్యాణి, 'ఇఁక నేమియున్నది, ముగిసెను. ఈశ్వరుఁ డేమార్గముగా రావలసిన దని నియమించి యుండెనో యామార్గముగా సుకుమారి పోయెను. నేనును అదేమార్గము నంటి పోఁదలఁచెదను.'

ఇట్లు చెప్పి కల్యాణి విషగుళికను నోటిలో వేసికొని మ్రింగి వేసెను. మహేంద్రుఁడు ఏడ్చుచు 'ఏమిచేసితివి కల్యాణీ?' యనెను.

ఆనందమఠ—5

కల్యాణి—బదు లేమియుఁ జెప్పక భర్త పాదధూళిని తలపై నిడికొని, స్వామీ! మాటలాడఁదొడంగినచో ముగియదు. నేను పోయెదను.

మహేంద్ర—కల్యాణీ! ఏల యిట్లు చేసితివి? అని చెప్పి హా యని యేడ్చెను.

కల్యాణి—మృదుస్వరముతో, 'నేను మంచిపనినే చేసితిని. నాకొఱకై మీరు దేవకార్యమునకు వెనుక దీయుచున్నారు. నేను దేవతావాక్యము నుల్లంఘనము చేసినందున నాబిడ్డ పోయెను. ఇఁక మీరు అవహేళనము చేసినచో మీరును నామార్గముననే పోవుదురు.

మహేంద్ర—ఏడ్చుచు, 'ని న్నెచ్చటనైనను విడిచిపెట్టి, కార్యసిద్ధి యైనమీఁద, మరల నిన్ను పిలుచుకొనిపోయిసుఖపడ నెంచితిని. కల్యాణీ! నీవే నాసర్వస్వమై యుంటివి. ఏల యిట్లు చేసితివి? ఏచేతితో కత్తినెత్తి వేగముగా విసరుదునో యాచేయి పడిపోయినది. నీవు పోయినమీఁద నేనేల!' అనెను.

కల్యాణి—'ఎచ్చట నుంచెదరు? స్థల మెక్కడ? ఈకష్టకాలమునందు తల్లిదండ్రులును బంధు బలగమును పోయిరి. ఎవరింట చోటున్నది? ఎచ్చటికి పోయియుండ నగును? నన్నెచ్చటికిఁ బిలిచికొని పోఁగలరు?. నేను తమకు గళగ్రహముగా నున్నదానను. నేను గతించుటయే మంచిది; నాకు ఆశీర్వాదము చేయుఁడు. నే నాజ్యోతిర్మయమైన ప్రపంచమునకేఁగెద. మరల నాకచ్చోట తమదర్శనము లభించునట్లు ఆశీర్వదింపుఁడు' అని చెప్పి మరల నాతని పాదరేణువులను తలపె

నిడికొని, మృదువును అతిమధురమును అతిస్నేహమయమునైన కంఠస్వరముతో, పతినిఁజూచి, దేవతావాక్యము నుల్లంఘించుట కెవరికిని సాధ్యముకాదు. దేవుఁడు నన్ను రమ్మని చెప్పియున్నాఁడు. ఉల్లంఘనము చేయరాదు. నేనొక్కతె పోయినందున నష్టమేమి? మీరు గ్రహణము చేసియుండు వ్రతమును త్రికరణశుద్ధిగాఁ జేయుఁడు. పుణ్యము కల్గును. అందు నాకును స్వర్గలాభము కల్గును. మన మిరువురమును స్వర్గమునం దనంతభోగముల ననుభవింపవచ్చును.

ఇట్లుండఁగా బిడ్డ పాలు త్రాగెను. గుణము కనుపించెను. ఆబిడ్డ కడుపులోనికిం బోయి యున్న విషము మిగులఁ గొంచెమే యైనందున బ్రతికెను. అయినను, మహేంద్రుని దృష్టి బిడ్డవైపు పోలేదు. వాఁడు బిడ్డను భార్యను ఆలింగనము చేసికొని యేడ్చుచుండెను. అపు డరణ్యమునందు మృదువైన మేఘనాదమువలె గంభీరస్వరముతో,

హారే మురారే మధుకైటభారే
గోపాల గోవిన్ద ముకున్ద శౌరే.

అని వినంబడెను.

అపుడు కల్యాణికి విషము తల కెక్కుచుండెను. చేతనము కొంచెము కొంచెముగా తగ్గుచుండెను. ఆమె ప్రేమభరితురాలై వైకుంఠమునం దుండి వేణునాదము నాలించుచున్న ట్లుండినది.

కల్యాణియు, అప్సరసలకంఠమును నిందించుకంఠము వలెఁ దానును మోహభరితురాలై,

హారే మురారే మధుకైటభారే
గోపాల గోవిన్ద ముకున్ద శౌరే
హారే మురారే మధుకైటభారే.

అని పాడెను.

మహేంద్రుఁడు కాననమునందు వినఁబడిన స్వరమును, కల్యాణికంఠస్వరమును విని, విముగ్ధుఁడై తత్తఱపాటుతో 'ఈశ్వరుఁడే సహాయమాత్రుఁడు, వేఱే దిక్కులేదు' అనెను.

హారే మురారే మధుకైటభారే
గోపాల గోవిన్ద ముకున్దశౌరే
హారే మురారే మధుకైటభారే.

అని పక్షులు సైతము ధ్వనిచేయ నారంభించెను.

హారే మురారే మధుకైటభారే.

అని నదీజలప్రవాహకలకలధ్వనియందును వినఁబడియెను.

అపుడు మహేంద్రుఁడు శోకతాపములను మఱచిపోయి ఉన్మత్తుఁడై తానును కల్యాణితోఁ గూడ,

హారే మురారే మధుకైటభారే
గోపాల గోవిన్ద ముకున్ద శౌరే.

అని పాడం దొడంగెను.

కాననంబంతయును వీరికంఠస్వరము ప్రతిధ్వని చేయుచుండెను. క్రమక్రమముగా కల్యాణికంఠస్వరము తగ్గనారంభించెను. అయినను 'హారే మురారే మధుకైటభారే' అని హీనస్వరముతోఁ జెప్పుచుండెను.

తుదకు, ఆమెకంఠము నిస్తబ్ధ మాయెను; నోటనుండి మాట రాలేదు; కన్నులు మూతఁబడెను; అంగము శీతలావృత మయ్యెను.

మహేంద్రుఁడు, కల్యాణి 'హా రేమురారే' యని చెప్పుచు వైకుంఠమున కేఁగిన దని తెలిసికొని, పిచ్చిపట్టినట్లు ఉచ్చ స్వరముతో కాననమును వికంపితము చేయుచు పశుపక్షులు భయంపడునట్లుగా హా యని యంగలార్చు చుండెను.

ఆసమయమున నెవరో 'హా రే మురారే మధుకైటభారే' యని చెప్పుచు, మహేంద్రుని గాఢాలింగనము చేసికొని, మరల 'హా రే మురారే మధుకైటభారే' యని ఘోషించిరి.

అప్పు డనంతుని మహిమచే ననంత మైనయరణ్యమధ్య మునందు అనంతపథగామిని యైనకల్యాణిసమ్ముఖమునందు వా రిర్వురును అనంతునినామకీర్తనములం బాడుచుండిరి. పశుపక్షులును నిశ్శబ్ద మొందెను. పృథ్వి, అపూర్వశోభామయియై, చరమసంగీతమున కుపయుక్త మైనమందిరముగా నుండెను. కల్యాణి యందుండు, మహేంద్రునిఁ దొడపై నిడికొని కూర్చుండెను.

---

## పదునాల్గవ ప్రకరణము

### మహేంద్రుఁడు కారాగారబద్ధుఁ డగుట.

ఇట్లుండఁగా రాజధానియందు మిగుల గడబిడయై కలకత్తానగరమునకు వచ్చుచున్నసర్కారుసొమ్ముకలను సన్న్యాసులు కొట్టి దోఁచుకొనిపోయి రని ప్రవాదము కలిగెను. అంత రాజా

జ్ఞానుసారముగా సన్న్యాసులను బట్టుకొనవలసినట్లు బరకందాజ మొదలగువారికి ఉత్తరువు చేసిరి. ఆదుర్భిక్షకాలమునందు నిజమైనసన్న్యాసు లొక్కెడ నిల్చుట లేదు. వలన, ఒక్కచోటనే యున్న పొట్టనిండుటకు వీలులేనందున, దిక్కున కొకరుగాఁ బోయిరి. ఇట్లు నిజమైనసన్న్యాసులు కాశీప్రయాగ మొదలగుస్థలములకుఁ బోయి యుండిరి. కేవలము సంతానులు మాత్రము ఆవశ్యకమైనపుడు సన్న్యాసివస్త్రధారణము చేయుచు అనావశ్యకమైనపుడు యథారీతివస్త్రములు ధరించుచు నుండిరి. ఈగడబిడను విని చాలామంది సన్న్యాసులు కషాయములను గట్టుటను మానివేసిరి. కాఁబట్టి పొట్టకులేని రాజసేవకులు సన్న్యాసు లుండుచోటు తెలియక, గృహస్థుల కుండ చట్లను పగులఁగొట్టి అరకడుపు నింపించుకొని వెనుకకు మరలుచుండిరి. సత్యానందుఁడుమాత్రము ఏకాలమునందును గైరికవస్త్రమును పరిత్యజింప లేదు.

ఆకృష్ణకల్లోలినీతీరమునం దొకచెట్టుక్రింద కల్యాణిపడి యుండెను. సత్యానందుఁడును మహేంద్రుడును పరస్పరము ఆలింగనముచేసికొని సాశ్రులోచనులై భగవంతుని ప్రార్థించుచుండిరి. నజరర్థీక కమేదారు సిపాయీలను పిలిచికొని వచ్చుచుండెను. వాఁడు సత్యానందునిఁ జూచి 'వీఁడు మిగుల దుర్మార్గుఁ' డని తిట్టుచు మెడపై చేయి వైచెను. వేఱొకఁడు మహేంద్రుని పట్టుకొనెను. ఏలన, సన్న్యాసివెంట నుండువాఁడును సన్న్యాసియే కదా. వేఱొకఁడు పచ్చికపైఁబడియున్న శవశరీరమును పట్టెద్దెనుగాని, యామె స్త్రీశవ మని తెలిసి విడిచిపెట్టెను. వీరిద్వురను మాత్రము పట్టుకొని పోవుచుండిరి.

కల్యాణి మృతశరీరమునకును, బిడ్డకును రక్షకు లెవరును లేరు. ఆకొట్టు క్రిందనే పడి యుండిరి.

మహేంద్రుఁడు మొదట శోకాభిభూతుఁడై వెంటనే యీశ్వరప్రేమచే ఉన్మత్తుఁడై చేతనశూన్యుఁ డైనవానివలె నుండెను. ఏమైనది, ఏమి కాఁబోవుచున్నది, అను దానిని తెలియనివాఁడై తనబంధనముపై దృష్టినించలేదు. అయినను, ఒకటిరెండడుగులు నడిచినమీఁద తన్ను పట్టుకొనిపోవుచున్నారని తెలిసికొనెను. కల్యాణిశవము పడియున్నది, సంస్కారము చేయలేదు. బిడ్డ దిక్కులేక యడవిమృగముల పాలగును, అని యతనిమనస్సునకుఁ దోఁచెను. ఈరీతి భావోదయమైన వెంటనే మహేంద్రుఁడు రెండుచేతులను బలముగా లాగెను చేతికట్టు తెగిపోయెను తత్క్షణమే జమేదారుని తన్ని పడఁద్రోసెను వాఁడు భూశయ్యాగతుఁ డాయెను. అప్పు డిద్దఱు సిపాయీలు వచ్చి మహేంద్రుని పట్టుకొనిరి. మహేంద్రుఁడు దుఃఖాకులితచిత్తుఁడై సత్యానంద బ్రహ్మచారిని పిలిచి, 'మీరు కొంచెము సహాయము చేసినచో వీరైదుగురును హతము చేయుదు' ననెను. సత్యానందుఁడు, 'నా యీప్రాచీనశరీరమునందు బలమే మున్నది? నే నెవరినిపిలిచెదనో వాఁడుతప్ప వేఱు బలము లేదు. పోవుటయే మంచిది; మన మీయైదుగురను జయింపలేము, ఎక్కడికి పిలుచుకొనిపోయెదరో పోనీ, మనము పోయి చూతము; జగదీశ్వరుఁడు రక్షింపఁగలఁడు' అని చెప్పెను. ఇద్దరును విడిపించుకొనుటకు ప్రయత్నము చేయక పోవుచుండిరి. కొంచెము దూరము పోయినమీఁద సత్యానందుఁడు సిపాయీలను జూచి, 'అయ్యా! నేను హరికీర్తనముచేయు వాడుక

గలదు. దానికి మీయాక్షేపము కలదా?' యని యడిగెను. సత్యానందుఁడు మంచివాఁడని జమేదారునకు తోఁచి యున్నందున, 'నీవు హరికీర్తనము చేయుము, నీవు వృద్ధబ్రహ్మచారివి. నిన్ను విడిచిపెట్టుటకు హుకుం అగును. ఈ చెడ్డమనిషిని మాత్రము గల్లుకువేయుదు' రనెను. అంత బ్రహ్మచారి మృదుమధురస్వరముతో—

ధీరసమీరే, తటినీతీరే
వసతి వనే వరనారీ
మాకురు ధనుర్ధర, గమనవిళంబన
మతివిధురా వరనారీ.

అని యిట్లు పాడెను.

అందఱును నగరము చేరిరి. జమేదారు వీరిని కొత్వాలునొద్దకు పిలుచుకొని పోయెను. కొత్వాలు రాజసర్కారునకు రిపోర్టు చేసి, బ్రహ్మచారిని మహేంద్రుని తత్కాలమున పహారాలో నుంచెను. ఆకారాగారము అతిభయంకరముగా నుండెను. అచ్చటికిఁ బోయినవాఁడు బైటికి వచ్చుటలేదు. ఏలన విచారించువారే లేరు. ఇంగ్లీషు దౌలతు జైలుగా నుండెను. అపుడు, ఇంగ్లీషువారికి అధికారము లేదు. ఇపుడు చట్టము ప్రబలినకాలము. అప్పు డానియమ మేమియు లేనికాలము. నియమముండు కాలమునకును నియమము లేనికాలమునకును మొకాబిలా చేసి చూడుఁడు.

---

## పదునాలవప్రకరణము

మహేంద్రుఁడు కారాగారవిముక్తుఁ డగుట.

రాత్రి యైనది. కారాగారబద్ధుండైన బ్రహ్మచారి మహేంద్రునిం జూచి, "నేఁడు ఆనంద మైనదినముగా నున్నది. ఏలన, మనము కారాగారమునందు బద్ధులమై యున్నారము; 'హారే మురారే' యని చెప్పు మనెను. మహేంద్రుఁడు దీనస్వరముతో 'హారే మురారే' యని చెప్పెను.

సత్యానంద—దైన్యమేల? నీవు ఈవ్రతమును గ్రహణము చేసితివేని, భార్యను బిడ్డను అవశ్యము త్యజింపవలయును. వారికిని నీకును ఏసంబంధము నుండఁగూడదు.

మహేంద్ర—త్యజించుట యనునది యమదండస్వరూపముగా నున్నది. ఏబలముచే నే నీవ్రతమును గ్రహింపవలయునో, ఆబలము నాభార్యతోను బిడ్డతోను పోయినది.

సత్యా—శక్తి వచ్చును నేను శక్తి నిచ్చెదను. మహామంత్రమునందు దీక్షితుఁడవు కమ్ము. మహావ్రతమును గ్రహింపుము.

మహేంద్రుఁడు విరక్తుఁడై—నేను పెండ్లమును బిడ్డను కుక్కల నక్కలపాలు చేసితిని. నాకు ఏవ్రతమును అక్కఱలేదు.

సత్యా—ఆవిచారమును మానుము. సంతానులు నీభార్యను సత్కారము చేసినారు. నీబిడ్డను పిలిచికొని పోయి కాపాడుచున్నారు.

మహేంద్రుఁడు విస్మితుఁడై—అతని మాటను నమ్మక 'తమ కెట్లు తెలిసినది. తాము నాతోఁగూడ నేకదా యున్నారు' అనెను.

సత్యా—నేనీమహావ్రతదీక్ష చేసియున్నాఁడను. దేవుఁడు దయచేసి పరోక్షజ్ఞానము నా కిప్పించి యున్నాఁడు. ఈరాత్రి లోపల నీకు సమాచారము వచ్చును. ఈరాత్రికే నీవు కారాగారమునుండి విడివడుదువు.

మహేంద్రుఁ డేమియు ననలేదు. సత్యానందుఁడు, తాను జెప్పినమాటలలో మహేంద్రునికి నమ్మకము కలుగలేదనితోఁచి, 'నీవు నమ్మవా ? కావలసినయెడల పరీక్షచేసి చూడుము' అని చెప్పి కారాగారద్వారముదాఁక వచ్చెను. అచ్చట నేమిచేసి నదియు మహేంద్రునికిఁ దెలియదు. అయినను, ఎవరితోడనో మాటలాడుచున్నట్లు బోధ మయ్యెను. సత్యానందుఁడు మరలి వచ్చెను. మహేంద్రుం 'డేమిపరీక్ష చేయవలయు' నని యడిగెను.

సత్యా—నీవు ఇప్పుడు కారాగారమునుండి విముక్తుఁడ వగుదువు.

ఇట్లు చెప్పుచుండునంతలో కారాగారద్వారము తెఱువఁ బడెను. ఒకావొకఁడు లోపలికి వచ్చి, 'మహేంద్రసింహుఁడను వాఁ డెవఁ' డనెను.

మహేంద్ర—నేనే.

ఆగంతకుఁడు—'నిన్ను విడుదలచేయుటకు హుకుం వచ్చియున్నది. నీవు పోవచ్చు' ననెను.

మహేంద్రుఁడు మొదట విస్మితుఁ డయ్యెను. అనంతరము అబద్ధ మని యెంచుకొని పరీక్షార్థము బయట పోయెను. ఎవరును ఆటంకము చేయలేదు. మహేంద్రుడు వీథివఱకును బోయెను.

ఆగంతకుఁడు, సత్యానందుని జూచి—'మహారాజా! తామేల పోవుట లేదు? నేను తమకొఱకేకదా వచ్చినది' యనెను.

సత్యా—నీ వెవరు? ధీరానందగోస్వామివా?

ధీరా—ఔను, మహాస్వామి.

సత్యా—నీవు పహరావాఁ డైన దెట్లు?

ధీరా—భవానందుఁడు నన్ను పంపించెను. నేను నగరమునకు వచ్చి, తాము కారాగృహమునం దున్నట్లు తెలిసికొని, కొన్ని దుత్తూరమిశ్రితమమైన గుళికలతో నిచ్చటికి వచ్చితిని. వాఁడు దానిని తిని మైమఱచి భూశాయియై పడి యున్నాఁడు. నేను ధరించికొనియుండు కోటు, షరాయి, టోపి, బల్లెము ఇవి ఆ సాహేబువే.

సత్యా—నీవు దీనిని ధరించుకొని పొమ్ము. నే నిప్పుడే బయలు వెడలను.

ధీరా—ఏల? కారణ మేమి?

సత్యా—ఈదినము సంతానుల పరీక్ష.

మహేంద్రుఁడు మరలి వచ్చెను. సత్యానందుఁడు చూచి 'ఏల మరలవచ్చితివి' అని యడిగెను.

మహేంద్ర—తాము నిశ్చయముగా సిద్ధపురుషులు. అయినను నేను తమ్ము విడిచి యుండువాఁడను కాను.

సత్యా—అట్లయినచో నుండుము. మనమిర్వురము వేఱు విధముగా విడివడి పోవుదము.

ధీరానందుఁడు వెడలిపోయెను. సత్యానందుఁడును, మహేంద్రసింహుఁడును కారాగృహముననే యుండిరి.

---

## పదునైదవ ప్రకరణము

మహేంద్రుని కొఁతురు సంరక్షింపఁబడుట.

బ్రహ్మచారి చేయు గానమును అనేకులు వినిరి. వారిలో జీవానందుఁడును ఆ గానమును వినెను. మహేంద్రుని అనువర్తియై వానిని జూచికొనవలసినదని జీవానందునికి బ్రహ్మచారి యాజ్ఞయైన విషయము పాఠకమహాశయులకు విదితమే కదా. మార్గమునందు ఒక్క స్త్రీని జూచెను. అది యేడు దినముల నుండి పస్తుగా పడి యుండెను. ఆమెకు జీవదానము చేయుటకు జీవానందునికి రెండు మూఁడు గడియలసేపు విళంబమయ్యెను. ఆస్త్రీని బ్రతికించి తిట్టుచు పిలిచికొని వచ్చెను. (అవకాశము నకు ఆస్త్రీయే కారణము) వచ్చునపుడు తన ప్రభువైన బ్రహ్మచారిని ముసల్మానులు పట్టుకొనిపోవుటను జూచినదేగాకఁ ఆప్రభువు చేయు గానము చెవిని సోఁకెను.

జీవానందునికి మహాప్రభు సంకేతము లన్నియుఁ జక్కఁగాఁ దెలియును.

"ధీరసమీరే తటినీతీరే,
వసతి వనే పరనారీ."

మహాప్రభువుయొక్క యింగితమును విని, నదీతీరమునం దెవరో యొకస్త్రీ అన్నములేక మలమల మాడుచున్నదని తెలిసికొని జీవానందుఁడు నదీతీరముగనే నడిచి వచ్చుచుండెను. జీవానందుఁడు బ్రహ్మచారిని పట్టుకొని పోవుటను తనకన్నులారఁ జూచినాఁడు. కనుక ముందుగా నాతని విడిపింపవలసినది వానికి ముఖ్యకర్తవ్యముగా నుండెను. అయినను, జీవానందుని ఉక్త సంకేతగానమువలన, బ్రహ్మచారిని విడిపించుట ముఖ్యకర్తవ్య మని భావింపక, ఆతనియాజ్ఞను పాలించుటయే ముఖ్యకార్య మని తలంచి, యాపనినే ముందుగా నెరవేర్పవలయు నని సంకల్పము చేసికొనెను.

జీవానందుఁడు నదీతీరము నంటి పోవుచుండెను. కొంత దూరము పోయినమీఁద నొకచోట చెట్టుక్రింద ఒకస్త్రీ మృత కళేబరమును, ఒక బ్రతికియున్న ఆఁడుబిడ్డను గాంచెను. జీవానందుఁడు మహేంద్రుని పెండ్లమును బిడ్డను ఎప్పుడును జూచినవాఁడు కాఁ డనునది పాఠకులకుఁ దెలిసియే యున్నది. అయినను, వీరు మహేంద్రుని పెండ్లము బిడ్డలుగ నుందురేమో యని తలంచెను. ఏలన, మహేంద్రుఁడు తనప్రభువుతోఁగూడ పోయినదియు వానికిఁ దెలియదు. ఎట్టులైననుసరే, తల్లి చచ్చి బిడ్డ బ్రతికి యున్నది, జీవానందుఁడు, మొదట బిడ్డను రక్షించ వలయును; లేనిచో అడవిమృగములపాలై పోవును. భవా

నందఠాకూరు ఇచ్చటనే యెక్కడనైన నుండును. వాఁడు వచ్చి యీస్త్రీని సంస్కారము చేయును, అని యెంచికొని, బిడ్డ నెత్తుకొని పోయెను.

జీవానందగోస్వామి, ఆనిబిడమైన యరణ్యమార్గముగా బిడ్డ నెత్తుకొనిపోయి యొకచిన్నగ్రామమును జేరెను. ఆయూరి పేరు భైరవపురము; అయినను, జనులు భరయీపుర మని చెప్పుచుండిరి. ఆయూరిలో సామాన్యజనులు కొందఱే యుండిరి. సమీపమున వేఱె పెద్దగ్రామ మేదియు లేదు. ఆగ్రామముచుట్టును పెద్దయడవి; మహారణ్యము నడుమ నీచిన్నపల్లె మిగుల రమణీయముగా నుండెను. కోమలమైన పచ్చికగల భూమిగ నుండెను. శ్యామలపల్లవయుక్తమైనమామిడిచెట్లును పనసచెట్లును రమ్యముగ నుండెను తాఁటితోఁపును కలదు. దానికి సమీపమున నీలజలపూర్ణమైన తటాకము అందు బకకారండవాది జలచరపక్షులు చూపునకిం పొనర్చుచుండెను. తీరమునందలి వృక్షములయందు కోకిల చక్రవాకాది పక్షులు కలకలధ్వని చేయుచుండెను. కొంచెము దూరముగనుండి మయూర కేకాస్వరము వినవచ్చెను. ప్రతియింటి ముంగిటిలోను ఆవులు ఎనుములు కట్టియుండెను. లోపల గాదె లుండినవిగాని దుర్భిక్షకాల మగుటచే వానిలో ధాన్యము లేదు. ఒక్కొక యింటివసారాలోను చిలుకలయు గోరువంకలయుపంజరములు వ్రేలాడుచుండెను. కొన్ని యిండ్లకు సున్నము గొట్టి ఎఱ్ఱమన్ను పెట్టి పిండిముగ్గు లుంచి యలంకృతము చేసి యుండెను. కొన్ని యిండ్లముందు ఊరుగాయలు, వరుగులు, వడియము లెండఁబెట్టి యుండిరి. కొన్ని యిండ్లలో మోదుగాకుల తోరణములు

వ్రేలాడఁగట్టి యుండెను. జను లందఱును దుర్భిక్షముచే పీడితులై కృశులై సంతాపితులై యుండిరి. అయినను, ఆయడవి యందు మనుష్యాహారమునకుం దగిన కొన్నిపదార్థము లున్నందున నాగ్రామస్థులు దానిని తెచ్చి తినుచు ప్రాణమును గాపాడుకొనుచుండిరి.

అచ్చట నున్నయొక మామిడితోఁటలో నొక చిన్న యిల్లును, దానినంటి మఱినాలుగు చిన్నయిండ్లు నుండెను. ఆ యింటికి మట్టితో ప్రహరి యుండెను. ఆయింటి యజమానికి పశుసమృద్ధి కలదు. ఇంటిముందు కోఁతి, చిలుక, నెమిలి,జింక ఇవి ఒక్కొక్కటి యొక్కొకపంజరమున నుంపఁబడి యుండెను. తోఁటలో మల్లెచెట్లు నిమ్మచెట్లు నుండెను. ప్రతియింటిలోను నూలువడకు రాట్నము లుండెను. ఈ యింటిలోను నొక రాట్న ముండెను. అయినను, జనులు చాలమంది లేరు. జీవానందుఁడు, బిడ్డ నెత్తికొని యీ యింటికిఁ బోయెను.

ఈయింటి గోసికిఁ బోయి జీవానందుఁ డొక రాట్నము దెచ్చి త్రిప్పి ఝురఝుర శబ్దము చేసెను. ఆ బిడ్డ రాట్నము నెప్పుడును జూచినది కాదు. ఆ శిశువు తల్లిని విడిచినది మొదలు ఏడ్చుచునే యుండెను. తల్లి మృతి నొందిన దని యా శిశువునకుం దెలియునా? నిద్ర పోవుచున్నదని యనుకొని యుండెనేమో! ఆహా! తల్లియందు పిల్ల కెంతప్రేమ యున్నదని చదువరు లెఱుంగుదురుగాత. ఇప్పుడు రాట్నపుశబ్దమును విని భయపడి మఱింతగట్టిగా నేడ్వసాగెను. ఈధ్వని విని లోపల నుండి సుమారు పదునేడు పదునెనిమిదిసంవత్సరముల వయస్సు గల యొకయువతి కుడిచెంపమీఁద కుడిచేతి చూపుడువ్రేలు

నుంచికొని గొంతునొక ప్రక్కవంచికొని వచ్చి నిలిచి, 'అన్నా రాట్నమును త్రిప్పుచున్నావేమి? ఈబిడ్డ యెక్కడిది? నీకు బిడ్డలే లేరుకదా! మరల పెండ్లిచేసికొంటివా యేమి?' అనెను.

జీవానందుఁ డాబిడ్డను ఆయువతిచేతి కిచ్చి మెల్లగా మై చఱచి, "ఏమమ్మా; నాకు ఇంకొక పెండ్లాముకూడ కావల యునా! ఇద్దరాండ్రు గలవారి బ్రతుకుచూచియుండ లేదా? అది పోనీ, ఇంటిలో పాలున్నవా?" యనెను.

యువతి——పాలు లేకేమి, పుచ్చుకొంటావా ?

జీవానంద——కానీ, పుచ్చుకొనెద.

అంత, నాయువతి పాలుకాచుటకై వడిగా వెడలిపోయెను. జీవానందుఁడు పాలు వచ్చునంతవఱకును రాట్నమును త్రిప్పు చుండెను. ఆయువతి, బిడ్డను ఎత్తుకొన్నది మొదలు ఏడువలేదు. బిడ్డ యేమని తలఁచికొనెనో చెప్పుటకు కాదు. అపుడు వికసిం చిన పుష్పసదృశురాలైనయాయువతిని జనని యని భావించి యుండునేమొ. 'ఇది మిథ్య' మని మనము నిర్ణయించి చెప్ప లేము. పాలు కాచుచుండఁగా సెగతగిలి మఱొక తేప యేడ్చెను.

ఆ యేడ్పును విని, జీవానందుఁడు, 'ఓనిమీ! ఇంకా పాలు వెచ్చనఁ గాలేదా?' యనెను నిమి, 'ఆయె' నని చెప్పి పాలును ఱాతిమరిగెలో పోసి తెచ్చెను. జీవానందుఁడు కృత్రి మకోపముతో, ఈవేఁడిపాలను నీమీఁదనే పోయుదునా?' యనెను.

నిమి——ఈ పా లెవరికి?

జీవానంద——ఈబిడ్డ త్రాగునేమో యిచ్చి చూడుము.

నిమి, బిడ్డను ఒడిలో కూర్చుండఁ బెట్టుకొని పాలు త్రాగించుచుండఁగా, దాని కన్నులనుండి కన్నీరొలికెను. దానికొక బిడ్డ యుండెను. అది చచ్చిపోయెను. ఈబిడ్డ తన బిడ్డవలెనే యుండెను, వెంటనే నిమి కన్నీరు తుడిచికొని, నవ్వుచు జీవానందునిం జూచి 'అన్నా! ఈబిడ్డ యెవరిదన్నా?' యని యడిగెను.

జీవానంద—నీకేమి?

నిమి—ఈబిడ్డను నా కిప్పించెదవా?

జీవా—నీవు బిడ్డను తీసికొని యేమి చేయుదువు?

నిమి—నేను బిడ్డకు పాలు పోసి సాఁకుకొనెద. పెద్దదానిని జేసెద. అని చెప్పుచుండఁగా, మరల కన్నుల నీరు స్రవించెను. నిమి చేతితోఁ దుడిచికొని మరల నవ్వెను.

జీవా—నీకేల, నీకింక నెందఱో బిడ్డలు పుట్టనున్నారు.

నిమి—అయిన నేమి? ఈబిడ్డను నాకిమ్ము, లేదా తీసికొనిపో.

జీవా—తీసికొనిపోయిన చచ్చిపోవును. నే నప్పుడప్పుడు వచ్చి చూచుకొనుచుండెద. ఇది కాయింతబాపనపిల్ల, నేను పోయెదను.

నిమి—అదేమన్నా! భోజనము చేయలే దేమి? ఇంత నేపైనది; కొంచెము భోజనముచేసి పో, నాయాన, ఊరక పోరాదు.

జీవా—కొంచెమేమి, నాయిష్టమువచ్చినంత భోజనము చేసెద. నీవు ఒట్టుబెట్టినందున నిలువ వలసి వచ్చినది. ఏదో ఉన్నదానిని ఉంచుము. అనెను.

నిమి, బిడ్డ నెత్తికొని వంటయింటికిఁ బోయెను. తుమ్మరేకులవంటి అన్నమును, కందిపప్పును, అపుడు కాచిన నేయియును, ఇంక నేమేమో పచ్చళ్ళను తీసికొనివచ్చి జీవానందునికి వడ్డించెను. జీవానందుఁడు భోజనము చేయుచు, 'నిమి! నీ వుండుచోటు క్షామ' మని యెవరు చెప్పుదురు ?

నిమి—క్షామము మాకును వచ్చును. అయినను, వర్షము కురిసినది నీకుఁ దెలియదా? నీవు పోయినవెంటనే కదా కురిసినది. మా పొలములన్నియు బాగుగా పండెను. అయినను మే మిద్దరము పస్తులవలె నున్నారము. కనుక మాకు చాల దా యేమి? ఎవరైనను ఎడపతడప వచ్చినచో వారి కింత పెట్టి మే మింత తినుచున్నాము. అదియునుగాక, అందఱును ధనాశచే పండినధాన్యమును నగరమునకుఁ దీసికొనిపోయి అమ్మివేసిరి. మేము అమ్మక యున్నాము.

జీవా—నీవదినె యెక్కడ ?

నిమి, తలవంచుకొని మెల్లఁగా—రెండుమూఁడుపళ్ల బియ్యము తీసికొని పోయెను, బియ్య మెవ రిత్తురు?

జీవానందునికి యిట్టి యన్నము చాల దినములనుండి దొరక లేదు. ఇది వానికి అదృష్టసమయ మని తోఁచెను. వాఁడు వృథామాటలచే కాలము గడుపుట కిష్టము లేక గబగబ భోజనము చేసెను. శ్రీమతి నిమాయిమణి తనకును తనమగనికిని వలసినంత వంటచేసి యుండెను. ఆకులో నేమియు లేనందున నిమాయి యేమియు తోఁపక మగనిభాగమును దెచ్చి వడ్డించెను. నిమాయిమణి, 'అన్నా! ఇంకేమైనను గావలయునా?' యనెను.

జీవా—ఇం కేమున్నది?

నిమాయిమణి, మంచి పనసపం డొకటియున్నది. అని చెప్పి లోపలికిఁ బోయి తెచ్చి ముం దుంచెను. ఏమియు బదులు చెప్పక జీవానందగోస్వామి ఆపండును తినెను. నిమాయి నవ్వి, 'అన్నా! ఇంకేమియు లేదే' యనెను.

జీవా—అయిననేమి, ఇం కొకనాఁటికి వచ్చి భోజనము చేసెదను.

అనిచెప్పి లేచెను. చేతులు కడిగికొనుటకు నిమాయి నీ ళ్లిచ్చెను. జీవానందుఁడు చేతులు కడిగికొనుచుండఁగా, నిమా యిమణి, 'అన్నా! నే నొకమాట చెప్పెదను, విని యాప్రకా రము చేసెదవా?' యనెను.

జీవా—అదేమి మాట?

నిమి—నాపై ఆనపెట్టుము.

జీవా—ఏమి చెప్పుము?

నిమి—ఆలాగు చేసెదవా?

జీవా—ఆమాట మొదట చెప్పుము?

నిమి—నీవు ఆనపెట్టు నీకాలికి మ్రొక్కెదను.

జీవా—ఆన పెట్టితిని; కాళ్లకు మ్రొక్కు మనఁగా, నిమా యిమణి కాళ్లపైఁ బడఁగా ఆశీర్వదించి, లె మ్మనిచెప్పి 'ఆమాట యేమో చెప్పుము' అనెను.

నిమాయిమణి, చేతులు రెంటిని గ్రుచ్చుకొని, తలవంచి కొని, కొంతసేపటికి మొగమెత్తి జీవానందునిఁజూచి నేలపై దృష్టి నిగుడించి, మరల తల యెత్తి నోరు విడిచి, ఒకతేప వది నెను పిలుతునా?' యనెను.

జీవానందుఁడు, నీవు పిచ్చిదానవు. నీకుఁ గొంచె మైనను బుద్ధి లేదు. నీముఖమే చూడకూడదు, నీవుఁ జెప్పఁగూడని దానిని చెప్పితివి. ఇఁక నే నిచ్చట నుండను. పోయెదను' అని చెప్పి లేచిపోవుట కుద్యుక్తుం డాయెను.

నిమి—నేను పిచ్చిదాననా, అయిన నేమి? ఒక్క తేప వదినెను పిలుతునా? యనెను.

జీవా—ఇదిగో పోయెద, అని చెప్పి వీథి కడపవఱకుఁ బోయెను.

నిమాయిమణి, కడపకు అడ్డముగా నిల్చి, 'మొదట నన్ను చంపివేసి తర్వాత నీవు పో. వదినెను చూడక నీవు పోఁగూడదు' అని ముష్కరముగాఁ జెప్పెను.

జీవా—నే నెందఱను చంపినది నీకుఁ దెలియునా ?

నిమాయి, ఆమాటను విని కోపముతో. 'చాల కీర్తియే పెండ్లమును విడిచిపెట్టుట, కన్నవారిని చంపుట, మంచి పని యని యనుకొంటివేమొ? నీ వెవనికి కుమారుఁడవో, నే నాతనికిఁ గుమార్తెను. జనులను చంపు నీకు నన్ను చంపుటయు దొలత్తు కాదా?' యనెను.

జీవానందుఁడు నవ్వి, 'పిలిచికొనిరా, నే నెవతెను కొంత కాలముదాఁకఁ జూడఁగూడ దని తలంచి యుంటినో దానిని పిలిచికొని వచ్చెద ననుచున్నావు, కాల మెట్లు నడపుచున్నదో అట్లు నడువవలయును కదా!' యనెను.

నిమి, తనమనస్సునందు కార్యసాఫల్య మయిన దని సంతోషించుచు నవ్వుచు నవ్వుచు సమీపమునం దున్న గుడి

సెకుపోయి, 'వదినే, వదినే, లే! లే!' యనెను. అప్పు డామె నూలు వడకుచుండెను.

వదినె—ఏమి నిన్ను నీమగఁడు కొట్టినాఁడా యేమి? గాయమునకు నూనె పెట్టవలయునా? యనెను.

నిమి—అవు నవును, నూనె యున్నదా?

వదినె—నూనెదుత్తను జూపి యెత్తుకొ మ్మనెను.

నిమి, అందున్ననూనెను తుడిచి వదినె తలకు చరిమి దువ్వి, 'నీవు కొత్తచీరెను కట్టుకొని రా, యనెను.

వదినె—ఏమే నీకు పిచ్చి పట్టినదా? నే నెట్లున్న నేమి, కొత్తచీర లేదు, పో; వచ్చెద' ననెను.

నిమి, వదినెను లేపి, వీపుపై తట్టి, 'రా వదినె, కొత్తచీర యెత్తికట్టుకో' అనెను.

తమాషాకు ఆ యువతి కొత్తచీరను దీసెను. ఇంతటి కష్టకాలమునను తమాషా చేయువృత్తి యామె హృదయము నందు లుప్తము కాలేదు. నవీనయౌవనము ఫుల్లకమలతుల్య మైన నవవయస్సౌందర్య మాలా గుండెను. నూనె లేదు, గుడ్డ లేదు, అయినను సౌందర్యము ప్రదీప్తముగ నుండెను. అనను మేయసౌందర్యము. ఆశితగ్రంథి యుక్తవసన మధ్యమునందును ప్రకాశమానమై ప్రస్ఫుటితమై యుండెను. వర్ణమునందు శ్యామలము. నయనములందు కటాక్షము. అధరమునందు హాస్యము. హృదయమునందు ధైర్యము. ఆహారముమాత్రము లేదు; అయినను, శరీరలావణ్యము కొఱతపడ లేదు. మంచి వస్త్రములేదు. సౌందర్యము సంపూర్ణముగా అభివ్యక్తమై యుండెను. మఱియు మేఘమధ్యంబున మించువలెను,

మనోమధ్యంబున ప్రతిభవలెను, శబ్దమధ్యమున సంగీతము వలెను, దుఃఖమధ్యమున సుఖమువలెను, ఆరూపరాశియం దేదియో యొక్కొక అనిర్వచనీయమైన తేజ ముండెను. అంతియగాక, అనిర్వచనీయమైన మాధుర్యము, అనిర్వచనీయ మైన ఉన్నతభావము, అనిర్వచనీయమైన ప్రేమ, అనిర్వచనీయమైన భక్తి ఆమెయందు నెలకొని యుండెను. ఆమె నవ్వుచు నవ్వుచు (ఆనవ్వును పరు లెఱుంగరు) క్రొత్త చీర నెత్తి యిదిగో చూడుము! అనెను నిమి 'చీరను కట్టుకొను' మనెను. అది 'నాకేల' యనెను.

అంత నిమాయిమణి, దాని కమనీయమైన కంఠదేశము నందు తన కమనీయమైన బాహువుల నుంచి. 'అన్న వచ్చి యున్నాఁడు, నిన్ను రమ్మని చెప్పినాఁ' డనెను. ఆ యువతి, 'నన్ను రమ్మని చెప్పిరా? దానికై క్రొత్తచీర యేల? ఇట్లే పోఁగూడదా యేమి?' యనెను. నిమాయిమణి, ఆ యువతి భుజములందు చేతుల నుంచికొని ముందు నడచునట్లు త్రోయుచు కుటీరమునుండి బయటికి వచ్చి, 'చాలు గంతగుడ్డ చాలు, రా' అని చెప్పుచు, పిలుచుకొని వచ్చి, యామెను లోపల త్రోసి నిమాయిమణి వీథితలుపు గడియ వేసికొని బైట నిల్చి యుండెను.



## పదునాలవ ప్రకరణము

ఆస్త్రీకి ముప్పదేడు వత్సరముల వయస్సు. అయినను, చూచెడువారికి నిరూపాయికన్న నెక్కుడు వయస్సుగలదని బోధపడ లేదు. మాసిన జీర్ణవస్త్రమును ధరించుకొని యా గృహంబునఁ బ్రవేశించిన వెంటనే యింటియందు మెఱుపు చందంబున ప్రకాశించెను. చెట్లయందు తలిరాకులచేఁ గప్పఁ బడిన పూవులగుత్తు లాకస్మికముగా వికసించిన ట్లయ్యెను. ఎచటనో యత్తరుబుడ్డి మూఁత దెఱచి యుంచినట్లు ఘుమఘుమ వాసన వీచెను. పొగలేక నిగనిగలాడు నిప్పున దశాంగ చూర్ణము చల్లిన ట్లయ్యెను. ఇటులుండ నాసుందరవతి గృహంబునఁ బ్రవేశించి యచ్చటచ్చటఁ దన విభుని వెదకెను. ఎచ్చోటను కనఁబడఁడయ్యెను. ఇఁకను గొన్ని ప్రదేశములయం దరసి చూడఁగా నొకచోట నున్నమావి కొమ్మపై శిరము నుంచికొని జీవానందుఁ డేడ్చుచుండెను. ఆ సుందరీమణి యల్లనల్లన నతని సమీపంబునకుఁ బోయి యాతని కరంబును బట్టుకొని యెను. జగదీశ్వరుఁడే యెఱుఁగుఁగాక. ఆయమ నేత్రంబుల యం దశ్రుధారలు వర్షంబు నతిక్రమించిన ట్లుండెను. ఆ నేత్ర జలంబులు అడ్డగింపఁబడక ప్రవహించి యుండినచో నందు జీవానందుఁడును తేలిపోయి యుండును. ఆమె యించుక ధైర్య శాలిని కాఁబట్టి యాజలంబులను నిరోధించుచుండెను. పిదప, జీవానందుని చేయిఁబట్టుకొని, 'అయ్యో! యిదే మన్యాయము!

నీవు నాకై విలపించుచున్నా వని నాకుఁ దెలియును. విలపింప నక్కఱ లేదు. నీవు న న్నె ట్లుంచి యుంటివో యాస్థితియందే నేను సుఖనై యున్నదాన' ననెను.

జీవానందుఁడు ముఖ మెత్తి కన్నీరును దుడిచికొని భార్యను గాంచి, 'శాంతీ! నీ కీశతచ్ఛిద్రమలినవస్త్ర మొప్పునా? నీకు భోజనమునకు నేమియుఁ గొఱఁత లేదుకదా' యనెను.

శాంతి, నీధనము నీకొఱకయ్యె యున్నది నే నాధనము నేమిచేయుదును? ఏమియుఁ దోఁచలేదు. నీవు వచ్చి నన్ను మరల గ్రహించినచో—

జీవానంద—గ్రహింతును, 'శాంతీ! ని న్నిపుడు పరిత్యజించితినా?'

శాంతి—త్యాగము కాదు—ఎపుడు నీవ్రతము సాంగమగునో? ఎపుడు నన్ను ప్రేమింతువో, ఈమాట ముగింపు కాకమునుపే జీవానందుఁడు శాంతిని గాఢాలింగనముఁ జేసికొని ఆమెభుజముపై శిరంబు నిడి చాలసేపు నిర్విణ్ణుఁడై యుండి, నిట్టూర్పు నిగుడించి 'నే నేల ని న్నిపుడు చూచితిని!' అని పరితపించెను.

శాంతి—'ఏల చూచితివి? నీవ్రతమును భంగపఱుపలేదుకదా?'

జీవానంద—వ్రతభంగమైనఁ గానిమ్ము—దానికి ప్రాయశ్చిత్తము కలదు. దానికై చింతింప వలసినదిలేదు. నిన్నుఁ జూచిన పిమ్మట వెనుకకుఁ బోలేను. కావుననే నేను నిమాయిని 'పిలిచికొని రావద్దు, నిన్నుఁ జూచి మరలి పోఁజాల' నని చెప్పి యుంటిని. ఒక్క ప్రక్కను ధర్మార్థకామ మోక్ష జగత్సంసార

ములు; ఒకప్రక్కను వ్రత యజ్ఞ యాగ హోమములు; వేఱొకప్రక్కను నీవు; నీవొక్కదానవుమాత్రమే—నే ననేకవిధంబులుగాఁ దలపోసినను ఏవైపున బరువగునో, దాని నిర్ధరింపఁ జాలకున్నాను. దేశమేమో శాంతిగ నున్నది. దేశంబును గట్టుకొని నేనేమి చేయఁగలను. దేశమునం దొక్క యెకరా భూమి యుండినచో నిన్నుంచుకొని స్వర్గానుభవభోగంబు లనుభవింపఁగలను నాకు దేశముతోఁ బని యేమి? గుణవతియగు నిన్ను వరించియు త్యజించితిని. ఇంతకంటె దేశంబున నెవఁడు దుఃఖియగును నీమలినమైన ఛిద్రవస్త్రంబును జూచి యూరకుండువానికన్నను, దేశంబున దౌర్భాగ్యుండగు దుర్బలుం డెవ్వఁడు గలఁడు? నా సకలధర్మములకును నీవు సహకారిణివి. దానినే త్యజించినపిమ్మట, నంతకన్న మిన్నయగు సనాతనధర్మం బేమున్నది? నేను ఏధర్మంబుకొఱకై దేశ దేశంబులును వనవనంబులును తుపాకిని భుజముపై నుంచుకొని తిరిగి తిరిగి ప్రాణిహింస చేయుచు పాపకార్యంబును సంగ్రహింప వలయును? పృథ్వి సంతానుల వశమగునో కాదో నేఁజెప్పఁజాల. నీవేమో నాకు వశురాలవై యున్నావు. నీ వీపృథ్వికన్న నెక్కుడు దానవు. నీవే నాకు స్వర్గము. ఇఁక నడువుము. ఇంటికిఁబోవుదము; నే నిఁకఁ బోవుట లేదు.

శాంతి కొంచెముసేపు మాటలాడక యూరకుండి, పిమ్మట 'సరికాదు, నీవు వీరుఁడవు, నేను వీరపత్నినై యుండుట నాకుఁ బరమసుఖమై యున్నది. నీ వీయధమురాలికై ధర్మత్యాగంబు జేయఁదగదు? నీవు నన్నుఁ బ్రేమింపకుము. నేనాసుఖంబు నపేక్షించుట లేదు. ఇపుడు నాకొకమాటఁ జెప్పి పొమ్ము; ఏ

మనఁగా, ఈవ్రతభంగమునకుఁ బ్రాయశ్చిత్త మేమి?' అని యడిగెను.

జీవానంద—ప్రాయశ్చిత్తము—దానము—ఉపవాసము—ఇరువదిరెండు గవ్వలు.

శాంతి కొంచెము నవ్వి, 'ప్రాయశ్చిత్తమనఁగా నేమో నాకుఁదెలియదు. ఒక యపరాధంబున కేమిప్రాయశ్చిత్తమో, శతాపరాధంబులకు నదియే ప్రాయశ్చిత్తమా?' యని యడిగెను.

జీవానందుఁడు, విస్మితుఁడును విషణ్ణుఁడునై 'యీమాట లేల?' యనెను.

శాంతి—నేను నిన్ను వేఁడుకొను టేమనఁగా—'ఇఁక నీవు నన్నుఁజూడక ప్రాయశ్చిత్తము చేసికొనవలదు.' అనెను.

జీవానందుఁడు నవ్వి, 'ఆ విచారంబున నిశ్చింతతో నుండుము; నిన్నుఁ జూడక నేను జచ్చుట లేదు; చచ్చునంతటి యవసరమును లేదు; నే నిఁక నిట నుండుట లేదు; అయినను, ఇప్పుడు నిన్ను కన్నులారఁ జూడఁజాలను. నేను జూడనని తలంపకుము. ఇపుడు గాకున్న నింకొకప్పుడైనఁ గనులారఁజూతును. ఇపుడు పోయెదను. ఇంకొకప్పుడైన నామనోరథము సఫలమగును, పోయెద. నీవు నామాటను నెఱవేర్పవలయును; ఏమన ఈవస్త్రమును పాఱవేసి మనపెద్దల యింటికిఁ బోయి వసించుచుండుము.' అనెను.

శాంతి—ఇపుడు నీ వెక్కడికి పోదువు?

జీవానంద—బ్రహ్మచారిని వెదకుటకై మఠంబునకు పోయెదను. వారు నగరంబునకుఁ బోయి యున్నారు. వారి యవ

ష్ణను జూచి కొంచెము విచారముగా నున్నది. మఠమందిరమున వారు లేకున్నచో నగరంబునకుఁ బోయెదను’ అని చెప్పి వెడలి పోయెను.

---

పదునేడవప్రకరణము 91

### భవానందుఁడు కల్యాణిని బ్రతికించుట.

భవానందుఁడు మఠమునఁ గూర్చుండి, హరిగుణంబులను గానము చేయుచుండెను. అపుడు ధీరానందుఁడు విషణ్ణవదనుండై యతఁ డుండిన చోటికి వచ్చెను. భవానందుఁడు, ‘ఏమోయిగోస్వామి ముఖ మేల వాడి యున్నది’ అని అడిగెను.

ధీరానంద—ఏదో తొందరకలిగిన ట్లున్నది. నిన్న వైష్ణవసంతానులు ఎఱ్ఱనిదుస్తులవారినిఁ జూచిరి. వారు సన్న్యాసులను వెదకి పట్టుకొనుచున్నారు. సంతాను లనేకులు కావి కొటీలను విడిచిరి. సత్యానందప్రభువు లొక్కరుమాత్రము గైరికవస్త్రమును విడువక నగరాభిముఖులై పోవుచుండిరి. తురకల చేతఁ జిక్కిరేమో చెప్పలేను.

భవానంద—వారిని పట్టియుంచెడి వీరు లగు మ్లేచ్ఛులు ధరణిలోఁ బుట్టలేదు. అయినను, నే నొకసారి నగరముదిక్కు పోయి చూచి వచ్చెదను. నీవు మఠమున జాగ్రత్తగా నుండుము.

ఇట్లని చెప్పి భవానందుఁడు లేచి యొక గదిలోపలికిఁ బోయి యందొక పెట్టెను దెఱచి కొన్ని గుడ్డలను తీసికొని రూపాంతరమును ధరించెను. కాషాయవస్త్రమునకు బదులుగ సొగసైన జరిదోవతి; లోపల కవచము పైన నిలువంగి; తలకు లపేటా: కాళ్లకు చడావు; వీనిని ధరించి ప్రకాశమానుఁ డయ్యెను. ముఖమున గోపీచందనముమాత్రము లేదు. భ్రమరసమానమైన కృష్ణవర్ణశ్మశ్రుశోభితసుందరముఖమండలము అపూర్వమైన కాంతినిఁ బొందెను. అతఁడు మొగల్ జాతి యువకునివలెఁ గానంబడుచుండెను.

భవానందుఁ డిట్లుభయమున మొగల్ వేషధారియై శస్త్రమును ధరించి మఠము నుండి బయలు వెడలెను. అటనుండి యొకక్రోశమాత్రము దూరము పోఁగా నచట చిన్న కొండలు రెండు కనుపించెను. అదిమొదలుకొని యడవియే. ఆకొండల నడుమ నొక నిభృతమైన స్థలము అచ్చట ననేకగుఱ్ఱములు కట్టఁబడి యుండెను. ఇదియే మఠవాసుల యశ్వశాల. భవానందుఁ డాయశ్వములయం దొకదానిని విప్పి లగాము వేసి యారోహణము చేసి నగరాభిముఖముగా దౌడాయించుకొని పోయెను.

ఇట్లు పోవుచుండఁగా నాకస్మికముగా గతిరోధమయ్యెను. ఆదారిప్రక్కను నున్న తరంగిణీకూలంబున గగనమార్గము నుండి పడిన నక్షత్రముపలె, కాదంబినీచ్యుతవిద్యుల్లతికవలెను, ప్రకాశించు స్త్రీమూర్తిపరుండుటను జూచెను. చూడఁగా సజీవలక్షణంబులు గానరా వయ్యెను. ఆమె సమీపమున నేమియు లేని కరాట మొకటి పడి యుండెను. భవానందుఁ

డాశ్చర్యపడి ఖిన్నుఁడై భయంపడెను. జీవానందునివలెనే భవానందుఁడును మహేంద్రుని భార్యను శిశువునుగూడ చూచి యుండలేదు. జీవానందుఁ డే కారణముచే మహేంద్రుని భార్యయును బిడ్డనుగానుండవచ్చునని యూహించెనో యాకారణము భవానందునికి గోచరింపలేదు. అతఁడు బ్రహ్మచారిని మహేంద్రుని సహితముగా పట్టుకొని పోయినదియు చూచి యుండలేదు. బిడ్డయు నచ్చట నుండలేదు ఆడబ్బినిచూచి, 'యెవరో రమణీమణి విషముసుగ్రోలి ప్రాణము విడిచిన' దని నిశ్చయించెను. భవానందుఁ డాశవసమీపంబునఁ గూర్చుండి దాని కపోలముపై చేయిడి పెద్దప్రొద్దు చింతించి, పిమ్మట తల, చేతులు, కాళ్లు మొదలగు నవయవములందు చేయిడి చూచెను. మరల ననేక విధములుగా నితరులకుఁ దెలియని పరీక్షలను జేసెను. ఇంకను ప్రాణ మున్నదని తెలిసికొనెనుగాని, బ్రతికించుమార్గ మెయ్యది యను నాలోచనయందు మగ్నుఁడాయెను. మఱికొంతసేపటికి యడవికేఁగి, యొకచెట్టునుండి కొన్ని యాకులను గ్రహించి చేతితో నలిపి రసమును శవముయొక్క నోటిలోఁబోసి వ్రేళ్లచే కంఠపర్యంతము పోవునట్లు చేసినదేగాక, కసులయందును నాసికారంధ్రములందును ఆరసమునే కొంచెము కొంచెముగా విడిచెను. మఱియు శరీరమంతయుఁ బూసెను. ఇట్లు క్షణక్షణంబును జేయుచు, అపుడపుడు నాసికాగ్రంబునఁ జేయిడి యూపిరివచ్చుటను గనిపెట్టుచుండెను. తన ప్రయత్నము విఫలమైన ట్లగుపడెను, ఇట్లు చాలసేపు పరిశీలించుచుండఁగా నాశవముఖము కొంచెము ప్రఫుల్ల మాయెను. శ్వాసము వ్రేలికి కొంచెము సోఁకెను. మరల నాయాకుల రసమునే పిండెను.

శ్వాసము క్రమక్రమముగా అధిక మగుచు వచ్చెను. భవానం దుఁడునాడిని పట్టిచూచెను. నాడి గతి గానవచ్చెను. తుదకు క్రమక్రమముగా ప్రథమపూర్వప్రభాతరాగము వికాస మగు నట్లు ప్రభాతపద్మినీ ప్రథమోన్మేషమువలెను, ప్రథమప్రేమా నుభవమువలెను, కల్యాణి కన్నులుదెఱువ నారంభించెను. అంత భవానందుఁ డాయర్ధజీవితదేహంబును గుఱ్ఱముపై నిడి కొని నగరంబునకుఁ బోయెను.



## పదునెనిమిదవ ప్రకరణము

### మహేంద్రాదులు కారాగృహవిముక్తు లగుట.

సాయంకాల మగునంతలో సంతానసంప్రదాయస్థు లం దఱును, సత్యానందబ్రహ్మచారియును, మహేంద్రుఁడును ఖైదీ లుగా నగరంబునకుఁ గొంపోవంబడి కారాగారంబున నుంచ బడినారని తెలిసికొనిరి. అపుడు ఒక్కొక్కఁడై ఇద్దఱిద్దఱై, పదేసిపదేసిమందిగ్నై, నూర్గురునూర్గురై, దేవాలయముచుట్టును దాఁగియుండిన సంతాన సంప్రదాయస్థు లందఱును వచ్చి యా యరణ్యమును జేరిరి. అందఱును శస్త్రపాణులై యుండిరి. వారి నయనంబులయందు రోషాగ్నియు, ముఖంబున దంభ మును, అధరంబునఁ బ్రతిజ్ఞయు నిండి యుండెను. మొదట నూర్గురు, పిదప వేగురు, ఆమీఁద ఇరువేగురు, ఇట్లు జనసంఖ్య వృద్ధి యగుచుండెను. అప్పుడు భవానందుఁడు మణిద్వారమున

నిల్చి ఖడ్గంబును జళిపించుచు ఉచ్చస్వరమున, మన మనేకదిన ములనుండి సుఖజీవనమునే స్వాభావికముగా ననుభవించుచుంటిమి. ఇపుడు అజగరవ్రతమును విడిచి యీ యవనపురిని ధూళీపటము గావించి అజయనదీజలంబునఁ గలపివేయవలయుననియును, ఈపందుల గుంపును నిప్పుపెట్టి కాల్చివేసి మాతయగు వసుమతిని మరల పవిత్రురాలుగా నొనరింపవలయుననియును, సంకల్పము గలవారమై యున్నారము. మీరు వినుఁడు; నేఁడు ఆదినము ప్రాప్తమైనది. ఎవరు మనగురువులకు గురువులైన పరమగురువులై యున్నారో; ఎవ రనంతజ్ఞానమయులై యున్నారో; ఎవరు సర్వదా శుద్ధాచారము గలవారై యున్నారో; ఎవరు లోకహితైషులై యున్నారో; ఎవరు దేశహితైషులై యున్నారో; ఎవరు మన సనాతనధర్మమును మరల నెలకొల్పుటకై స్వశరీరము నర్పించు ప్రతిజ్ఞ గలవారై యున్నారో; ఎవరిని మనము సాక్షాద్విష్ణుస్వరూపావతార మని యెంచి యున్నారమో; ఎవరిని మన ముక్తికి ఉపాయభూతులని యెన్నినారమో; యట్టివారు నేఁడు మ్లేచ్ఛుల కారాగృహమున ఖైదిగా నున్నారు. మన ఖడ్గంబులయందు వాఁడి లేదా? అని చెప్పి తన బొమ్మ తట్టి మరలఁ జెప్పెను. మన హృదయంబున ధైర్య సాహసములు లేవా? భాతృలారా! చెప్పుఁడు—“హారే మురారే మధుకైటభారే” సోదరులారా! ఎవఁడు మధుకైటభులను నాశ మొందించెనో; ఎవఁడు హిరణ్యకశిపుని, దంతవక్త్రుని, శిశుపాలాది దుర్జయులైన అసురులను నిధనసాధనము జేసెనో, ఎవని చక్రాయుధ ఘుర్ఘురనిర్ఘోషముచే మృత్యుంజయుఁ డగు శంకరుఁడు సహితము భీతిల్లి యుండెనో; ఎవఁ డజయ్యుఁడో;

ఎవఁడు రణంబునందు జయదాత యోాఁ మన మట్టిమహానుభావుని యుపాసకులము. అతని కృపచే మన బాహువులయం దమిత బల మున్నది. అతఁ డిచ్ఛామాత్రుఁడై యున్నాఁడు. అతని సత్సంకల్పముచే మనకు రణంబున జయంబు గలుగును పదండి, ఆ యవనపురంబును పాడుచేసి కాల్చి భస్మరాశిగాఁ జేయుదము. ఆక్రూరుల నివాసంబు నగ్నిసంస్కారంబు చేసి, అజయనదీ జలంబులయందుఁ గలిపి వత్తము చెప్పాఁడు—"హారే మురారే మధుకైటభారే" అని.

ఆసమయంబున కాననమునుండి యతిభీషణం బగుధ్వని చే సహస్ర సహస్రకంఠము లేకమై "హారే మురారే మధుకైటభారే" యని, ధ్వనిత మాయెను. వేలకొలఁది ఖడ్గంబు లొక్కతూరిగా ఝణత్కారశబ్దము లిచ్చెను. వేలకొలఁది బల్లెములు పై కెత్తఁబడెను. వేలకొలఁది జనుల భుజాస్ఫాలనశబ్దము వజ్రనినాదమై చెలంగెను. వేలకొలఁది భిండివాలంబులును ముసల ముద్గరంబులును కర్కశము లగుకుంతములును ఒకదానితో నొకటి యొరసికొనుటవలనఁ గలిగిన శబ్దము భీషణముగా నుండెను. ఈ మహా కోలాహలంబున కోర్వక వన్యమృగం బులు కాననంబును విడిచి పాఱిపోయెను. పక్షులు భయం బున నుచ్చనాదముచేయుచు నెగిరినందున గగనంబు చీఁకటి కమ్మెను. అపుడు నూర్లకొలఁది జయభేరులు మ్రోఁగెను. "హారే మురారే మధుకైటభారే" యనుచు కాననమునుండి శ్రేణీ బద్ధులై సంతానులు తండతండములుగా బయలుదేరిరి. నెమ్మదిగా పోవుచుండిరి. నిదానముగను గంభీరముగను పదవిక్షేపము చేయుచు గట్టిగా హరినామంబుల నుడువుచు నాయంధ

కారబంధురంబగు రాత్రి కాలంబున నగరాభిముఖులై చనిరి, శస్త్రంబుల మర్మరశబ్దంబును, అస్త్రంబుల ఝణఝణాశబ్దంబును, కంఠములయస్ఫుటనినాదంబును, మధ్యమధ్య గోవిందాదినామ స్మరణాధ్వనులును మ్రోగుచుండెను. నిదానముగను గంభీరముగను రోషయుక్తముగను తేజస్సహితంబునను ఆసంతానవాహిని నగరంబును బ్రవేశించెను. ఇట్లాకస్మికంబగు నీకోలాహలంబును గాంచి నగరవాసులు భయపడి యెక్కడికో పలాయనమై పోయిరి. వారి పోకడయే తెలియలేదు. నగరరక్షకులు హతబుద్ధులై నిశ్చేష్టితులై యుండిరి.

ఇచట, సంతానులందఱును మొట్టమొదట కారాగృహంబునకుఁ బోయి తలుపులను విఱుగఁగొట్టి రక్షకులను తన్ని, సత్యానందుని మహేంద్రుని విడిపించి, శిరముసం దిడికొని నృత్యంబుచేయ నారంభించిరి. గోవిందశబ్దము విశేష మాయెను. సత్యానంద మహేంద్రుల విముక్త్యనంతరము కనఁబడిన యవనుల గృహంబు లన్నిటిని తగులఁబెట్టుచుండిరి. అయినను, ఆపనియందు చాలకాలము గడువలేదు ఇంతలో నగరమే లెడురా జగుఅసదుల్ జమానుఁడు నగరంబునం దున్న సైన్యంబును గుమిగూర్చికొని ఫిరంగి,తుపాకి, మొదలగుసాధనంబులతో సంతాన సంప్రదాయస్థుల నెదిరించెను. సంతానుల ఆయుధములు ఖడ్గములును బల్లెములే యగుటవలన, ఫిరంగిగుండ్లను జూచి కొంచెము భీతిల్లిరి. ఫిరంగిగుండ్ల దెబ్బలకు సంతాను లనేకులు చచ్చిరి. అపుడు సత్యానందుఁడు వెనుదిరిగిచూచి 'వృథా వైష్ణవవధచే బ్రయోజనము లే' దనెను. అంత సంతానులం

దళులు పరాజితులై మ్లానముఖులై నగరంబును విడిచి, అచట నుండి పూర్వలి కాననమునకుఁ బోయి చేరిరి.

---

## పందొమ్మిదవ ప్రకరణము

### శాంతి సన్న్యాసి యగుట

జీవానందుఁడు వెడలిపోయిన పిదప, శాంతి, నిమాయి మణి యింటియరుగుపై కూర్చుండెను. నిమాయిమణి శిశువును తొడపై నిడుకొని కూర్చుండెను. శాంతి నేత్రజలంబులం దుడిచికొని యుండినదేగాక ముఖము ప్రఫుల్లముగ నుండెను. కొంచెము కొంచెము నవ్వుచు నుండెను. గంభీరముగను, చింతాయుక్తముగను, అన్యమనస్కురాలుగను నుండెను. నిమాయి 'చూచితివా' యనెను.

శాంతి, ఉత్తర మియ్యక యూరకుండెను. నిమాయి, శాంతి తనమనోభావమును వెల్లడి చేయదని భావించికొని, ప్రయత్నపురస్సరముగా ఏవేవో ముచ్చటలాడి, 'చూడ వేవదినే! ఇది యెంతటిబిడ్డనే!'' అనెను.

శాంతి——ఈబిడ్డ నీకెక్కడ దొరకెను? నీవెపుడు కంటివి?

నిమాయి——నీవుపాడైతివి, ఇది మాయన్నబిడ్డకదా!

నిమాయి, శాంతియొక్కకడుపు మండించుట కీమాటఁ జెప్పలేదు. అన్నబిడ్డయనఁగా అన్నయిచ్చిన బిడ్డ యని చెప్పుట కట్లు చెప్పెను. శాంతి యీయర్థమును గ్రహింపక, నిమాయి

వంచనగా మాటలాడుచున్నదని యెంచి, 'నేను బిడ్డయొక్క తండ్రినిగూర్చి యడుగలేదు. దానితల్లిని గురించి యడిగితి' ననెను.

నిమాయి, ఉచితమైన శాంతిని బొంది, అప్రతిభురాలై యొకరిశిశువో నే నేమెఱుంగుదును. అన్న యెక్కడనో పడి యుండినదానిని ఎత్తుకొని వచ్చెను. ఈశిశువుసమాచారము నడిగి తెలిసికొనుట కవకాశము లేకపోయెను. ఇప్పుడు క్షామ కాలము. ఎందఱో బిడ్డసాపలను దారిలోఁ బాఱవైచి పోయెదరు. మనయొద్దకెందఱో తల్లులు బిడ్డల నమ్ముటకై వచ్చి యుండిరి కదా. ఇతరుల బిడ్డల నెవరు కొనెదరు? (అప్పు డామెనేత్రములు జలపూరితము లాయెను. నిమాయి కన్నీరు తుడిచికొని మరల) శిశు వేమో దివ్యసుందరమైనది. దాని చక్కఁదనమును జూచి, అన్న నడిగి తీసికొంటి' ననియె.

ఆపిమ్మట వారిరువురును పెద్దప్రొద్దు ఏమేమో ఆమాట యీమాట లాడుచుండిరి. కొంతసేపటికి నిమాయిభర్త యింటికి వచ్చినాఁడు. కనుక శాంతిలేచి తనకుటీరమునకుఁబోయి, తలుపువేసికొని, ప్రొయ్యినుండి కొంచెము బూడిదను బైటఁద్రోసి యుంచెను. మిగిలినబూడిదపై తనకై వండియున్న యన్నమును పాఱవైచి, నిలఁచినది నిలచినట్లే కొంతసేపు చింతించి, తనలోఁ దానే "యిన్నిదినంబులుగాఁ జేయవలయు ననుకొన్నదాని నీ దినము చేసి వేయుదును. ఏయాశచే నిదివఱకుఁ జేయకుంటినో యది సఫల మాయెను. సఫలమో; నిష్ఫలమో, నిష్ఫలము! ఈజీవనమే నిష్ఫలము. ఏమి సంకల్పముచేసి యుంటినో, దానిని

నెఱవేర్పెద. ఒక్కసారి కేమిప్రాయశ్చిత్తమో నూరుసారుల కదియే ప్రాయశ్చిత్తము.' అని యోంచుకొనెను.

ఈప్రకారముగా నాలోచించుకొని శాంతి యన్నంబును బ్రొయ్యిలో పడవేసి వనంబున కేఁగి కొన్ని ఫలములను దెచ్చి కొని తినెను. అనంతరము, నిమాయి కోరియుండిన కొత్త పరిగెచీరను దీసి యంచులను చించి పాఱవైచి, యాచీరెను కావి నీటిలోఁ దడిపెను. చీరకు కావిరంగు పట్టెను. దాని నెండించుటకు ఎండ లేదు. సాయంకాలసమయము; దాని నగ్గి యారవేసి కొంచెము చీకటి కాఁగానే తలుపును జక్కఁగా వేసికొని యొక చమత్కారమైన కార్యమునందు శాంతి ప్రవర్తింపఁదొడంగెను. దువ్వెన వేసుకొని ఆగుల్ఫలంబితమైయున్న తన శిరః కేశరాశిని పిడికిటఁ బట్టుకొని కొంతేఁ గత్తిరించి యుంచుకొని, తక్కిన తల వెండ్రుకలను జడవలె చేసెను. దువ్వెనముఖము జూడక చెదరియుండిన వెండ్రుక లాయపూర్వవిన్యాసముచే ఘోరమైన జడగా పరిణమించెను. పిదప, తడియారఁ గట్టిన కాషాయవస్త్రమును రెండుగాఁ జించి యొకటినిదనవనోహరమగునంగంబునకుఁ గట్టి కొని, మఱియొకటిని అొమ్మునకు బిగించి కట్టుకొనెను. ఇంటియందొక చిన్న యద్దముండెను. చాలకాలమునకు దానిని దీసి తన వేషంబును జూచికొని, 'అయ్యో! యెంతపనిచేసితిని'అని యనుకొని, దర్పణమును బాఱవైచి, కత్తిరింపఁబడియున్న వెండ్రుకలతో శ్మశ్రువును గల్పించెను. ఆచంద్రబింబమువంటి ముఖము క్రొత్తఁగు గడ్డము మీసములతోఁ బ్రకాశించెను. అనంతరము ఇంటిలోనున్న యొకహరిణచర్మంబును కంఠమునకుఁ గట్టికొని యెను. అది కంఠమునుండి జానుపర్యంతము శరీరము నాచ్ఛా

దించెను. ఎవఁడేని కవియైనవాఁడు ఆ నవీన "కృష్ణత్వచం గ్రంథి మతీం దధాన" ను గాంచి యుండిన యెడల, ఇప్పుడు మన్మథుని వినాశ మట్లుండుగాక, ఆమన్మథుని పునర్జీవనశంక చేయును. ఈ ప్రకారము సజ్జీభూతుఁడైన యానవీనసన్న్యాసిని నాల్గుప్రక్కలను సావధానముగాఁ జూచి యెవ్వరును లేరని తెలిసికొని, గోప్యముగా రక్షింపఁబడిన యొక పేటికను దీసి దానియం దుండిన యొకమూటను విప్పి నేలపై నుంచెను. అవి కేవలము భారమగు పుస్తకములుగా నుండెను. మనసునందు వీని నేమి చేయవచ్చును? వెంటఁ దీసికొనిపోయి చేయునదేమి? ఈ భారమును మోయుటెట్లు? ఇచట నుంచిపోయినచోఁ బ్రయోజనమేమి? జ్ఞానముచే సుఖములేదనునది తెలిసెను. అది కేవలము భస్మరాశిమాత్రమై యున్నది. ఆభస్మము భస్మముతోనే పోవలసినదని యెంచి ఆగ్రంథముల నొకటొకటిగా మండెడు మంటలో వైచెను. కావ్య, సాహిత్య, అలంకార, వ్యాకరణములు, (ఇఁకను నేమేమి యుండునో చెప్పనలవికాదు) అన్నియు భస్మావశిష్టమైపోయెను. రాత్రి రెండవజామున యంధకారంబున శాంతి సన్న్యాసవేషంబుతోఁ దలుపుతెఱచుకొని యేకాకిగా గంభీరమైన వనమధ్యమును బ్రవేశించెను. గ్రామవాసు లా యర్ధరాత్రిసమయంబున కాననమధ్యమందు అపూర్వమైన సంగీతధ్వనిని వినిరి.



# ఇరువదియవ ప్రకరణము

## శాంతి గురుదర్శనంబు చేయుట

మరునాఁడు ఆనందమఠంబున నేకాంతమగు గదియం దుఁ గూర్చుండి భగ్నోత్సాహులైన సంతానానాయకులు ముగ్గు రాలోచించు చుండిరి. జీవానందుఁడు సత్యానందునిఁ గాంచి 'మహాస్వామీ ? దైవము మనయం దేల యిట్లు అప్రసన్నుఁ డాయెను ? ఏదోషంబువలన మనము మ్లేచ్ఛులచేఁ బరాభ వింపఁబడితిమి ? అని యడిగెను.

సత్యానంద— దైవము ప్రసన్నము కాకపోలేదు యు ద్ధంబున జయాపజయంబులు రెండును గలవు. ఆదినము మన ము జయించితిమి. ఈదినము పర జితులమైతిమి. తుదకు జయ మే సిద్ధించును. ఎవఁ డిదివఱకును దయ చూపినాఁడో యాశంఖ చక్రగదాధారి యగు వనమాలియే రక్షించుననినాకు నిశ్చయ ముగా నమ్మకము గలదు. అతని పాదములను స్పృశించి మన మేవ్రతము నుగ్రహించితిమో యావ్రతమునే సాధింపవలయు ను. విముఖుల మైతిమేని యనంతనరకభోగంబుల ననుభవింతు ము. మన భవిష్యన్మంగళవిచారంబునందు నాకేమియు సంశ యములేదు. అయినను, దైవానుగ్రహములేక యేకార్యమును సిద్ధింపదు. దానికి పురుషకారమును గావలయును. మనము నిర స్త్రులమై యుంటిమి. గుండు తుపాకి ఫిరంగీల యెదుట మన కొయ్యలు, బల్లెము లేమి చేయనోపును. కనుక, మనకు పురుష

కార లాఘవంబున నీయపజయము సంభవించెను. ఇప్పుడు చేయవలసిన దేమనిన, మనము నట్టి యస్త్రసాధనంబులను చాలినంత సంపాదింపవలయును.

జీవానంద—అది బహు కఠినవ్యాపారము.

సత్యానంద—కఠినవ్యాపారమా? జీవానందా! నీవు సంతానుఁడ వైయుండియు నిట్టి మాట చెప్పఁదగునా? మన కసాధ్య మైనకార్య మెద్ది కలదు?

జీవానంద—స్వామీ! వాని నెట్లు సాధింప నగునో సెల వొసంగుఁడు.

సత్యానంద—వాని సంగ్రహార్థమై నేఁటి రాత్రికి తీర్థయాత్ర వెడలెదను. నేను మరల వచ్చునంతవఱకును మీరు ఎక్కువ పనులకుఁ బోకుండుఁడు; సంతానులలో ఐకమత్యంబును గాపాడుకొని యుండుఁడు; మీరు వారికి గ్రాసవసనంబుల నిచ్చుచుండుటయేగాక, మాతృరణజయార్థమై అర్థభాండాగారంబును పూర్ణముగా వృద్ధిపఱిచియుంచి కొనుఁడు. ఈభారము మీయిరువురపై నున్నది.

భవానంద—స్వామీ! తీర్థయాత్ర చేసి వీనిని సంగ్రహంబు చేయుట యెట్లు? మందు, గుండు, తుపాకి, ఫిరంగి మొదలగువానిని విలువకుఁ గొని పంపుట చాల కష్టము. మఱియు ఇవన్నియు దొరకు టెక్కడ? విక్రయించువా రెవరు? తెచ్చువా రెవరు?

సత్యానంద—వెల యిచ్చి కొనుటకు నాచేత కాదు. నేను పనివాండ్రను బంపెదను. ఇచ్చటనే వాని నన్నిటిని తయారు చేయవలయును.

జీవానంద—అదెట్లు? ఈ యానందమఠమందేనా ?

సత్యానంద—దానిని మఱెవ్వట చేయవచ్చును? ఇందు లకై నేను పెక్కుదినములనుండి చింతించుచున్నాఁడను. ఈశ్వరుఁడు దానికిపుడు మార్గమును జూపి యున్నాఁడు. దేవుఁడు ప్రతికూలుఁడై యున్నాఁడని మీరు చెప్పితిరి. అనుకూలుఁడయ్యే యున్నాఁడని నానమ్మకము.

భవానంద—కార్యశాల నెచ్చట నుంచవలయును ?

సత్యానంద—పదచిహ్నగ్రామంబున.

జీవానంద—అచ్చట నెట్లు జరుపనగును ?

సత్యానంద—అట్లు కాకుండినచో నెందులకై మహేంద్రసింహునిచే మహావ్రతమును గ్రహింపవలయును?

భవానంద—మహేంద్రసింహుఁడు వ్రతంబును గ్రహించినాఁడా ?

సత్యానంద—వ్రతంబును గ్రహింప లేదు గ్రహించును. ఈదినమురాత్రి యతనిని వ్రతదీక్షితునిఁగాఁ జేసెదను.

జీవానంద—మహేంద్రసింహుని వ్రతదీక్షితునిగాఁ జేయుట కెట్టి ప్రయత్నములు జరిగియున్నవో నే నెఱుఁగను. అతని భార్యబిడ్డ యవస్థ ఏమిగా నున్నదో? వారి నెచట నుంచి యున్నాఁడో? నే నీదినము నదీతీరమునం దొకశిశువును జూచితిని. దానిం గొనిపోయి నాచెల్లెలిచెంతఁ జేర్చి వచ్చినాఁడను. ఆశిశుసమీపంబున నొకసుందరమైన యువతి చచ్చి పడి యుండెను. ఆమెయే మహేంద్రునిభార్యగా నుండుననియు తలఁచితిని.

సత్యానంద—వారేమహేంద్రుని పెండ్లమునుబిడ్డయును

భవానందుఁ డాశ్చర్యానందపరవశుఁడై, 'తాను ఔషధము నిచ్చి బ్రతికించిన స్త్రీరత్నము మహేంద్రుని భార్యయైన కల్యాణియే, యని నిశ్చయించెను. అయినను, ఆసమయంబున నేమాటయుఁ జెప్పుట కవసరము లేదని మిన్న కుండెను.

జీవానంద—మహేంద్రుని భార్య యెట్లు చచ్చెను?

సత్యానంద—విషమును మ్రింగి చచ్చెను.

జీవానంద—విషము నేల మ్రింగెను?

సత్యానంద—భగవంతుఁ డామెస్వప్నంబున ప్రాణత్యాగంబుఁ జేయు మని యాజ్ఞ నొసంగెను.

భవానంద—ఆ స్వప్నాదేశము సంతానుల కార్యోద్ధారముకొఱకేనా యేమి?

సత్యానంద—మహేంద్రసింహుఁ డిట్లనియే చెప్పెను. ఇపుడు సాయంకాలమైనది; నేను సాయంకృత్యములను దీర్చికొని వచ్చి నూతన సంతానులకు దీక్ష నొసంగెదను.

భవానంద—సంతాను లెందఱు? మహేంద్రసింహుఁడు గాక మఱెవ్వరైనను తమ నిజశిష్యులుగా వచ్చియున్నారా?

సత్యానంద—ఔను; మఱియొక క్రొత్తవాఁడు వచ్చియున్నాఁడు. వానిని నేనెప్పుడును జూచినది లేదు. నేఁడు వాఁడు వచ్చినాఁడు. వాఁడు స్వల్పవయస్సుగలయౌవనపురుషుఁడై యున్నాఁడు. వాని యాకారేంగితంబులను, మాటలను జూచి మిక్కిలి సంతోషము నొందినాఁడను వాఁడు బంగారుముద్దవలె నున్నాఁడు. వానిని సంతానులకార్యమందు శిక్షితునిఁగాఁ జేయుభారము జీవానందునియందున్నది. ఏలనఁగా, జీవానందుఁడు జనుల

చిత్తాకర్షణ చేయుటయందు దక్షుఁడు. నేను పోయెదను; ఇంకొ క మాట యున్నది, దానిని మనసుంచి వినుఁడు.

అనఁగా, వారిర్వురును చేతులుజోడించుకొని ఆజ్ఞ పాలింపవలయు నని విన్నవించుకొనిరి.

సత్యానంద—మీ రిరువు రేమైన యపరాధమును జేసి యుండినను, లేక, నేవచ్చునంతలోఁ జేసినను, నేవచ్చువఱకును దానికి ప్రాయశ్చిత్తము జరుపవలదు. నే వచ్చినపిదప, ప్రాయశ్చిత్తము జరుపఁ దగినది.

ఇట్లు చెప్పి సత్యానందుఁడు స్వస్థానంబునకుఁ జనెను. భవానందుఁడును జీవానందుఁడును పరస్పరము కన్ను లెగర వేసి తల లల్లాడించిరి.

భవానంద—నీమీఁది మాటయే కదా?

జీవానంద—ఉండవచ్చును. చెల్లెలింటికిని హేంద్రుని బిడ్డను విడిచిరాఁ బోయి యుంటిని.

భవానంద—దానియందు దోషమేమి? అదేమి నిషిద్ధము కాదు; బ్రాహ్మణిని జూచివచ్చితివా యేమి?

జీవానంద—గురుదేవుఁడు దానినే మనస్సున నుంచుకొని చెప్పియుండవచ్చునని తోఁచుచున్నది.



## ఇరువదియొకటవ ప్రకరణము

### మహేంద్రునకు సత్యానందుఁడు హితోపదేశము చేయుట.

సత్యానందుఁడు సాయాహ్నికకృత్యమును దీర్చుకొని, మహేంద్రునిఁ బిలిచి 'నీబిడ్డ జీవించి యున్న'దని పలికెను.

మహేంద్ర—ఎక్కడ మహాస్వామీ!

సత్యానంద—నీవు నన్ను "మహాస్వామి"యనెద వేల?

మహేంద్ర—మఠాధికారులను "మహాస్వామి" యని పిలువవలయు నని యందఱును చెప్పెదరు. 'నాబిడ్డ యెక్కడ, మహాస్వామీ!'

సత్యానంద—ఆసంగతిని తెలిసికొనుటకుముందు నేనడు గుప్రశ్నలకు బదులు చెప్పుము. నీవు సంతానుల ధర్మంబును గ్రహించెదవా?

మహేంద్ర—అటులనే గ్రహింపవలయునని నిశ్చయించు కొని యున్నాను.

సత్యానంద—అటులైనచో "బిడ్డ యెక్కడ" యని య డుగరాదు.

మహేంద్ర—ఏల మహాస్వామీ?

సత్యానంద—ఎవరు ఈవ్రతమును గ్రహించెదరో వారు తమ యాలుబిడ్డలు స్వజనులు వీరెవ్వరిసంబంధము నుంచుకొనఁగూడదు. ఆలుబిడ్డల ముఖమును జూచినచో ప్రాయశ్చిత్తముగలదు. ఎంతవఱకు సంతానులకార్యముసిద్ధియగు టలేదో యంతఃవఱకునీవునీబిడ్డనుజూడరాదు. నీవుసంతానులధర్మ

మును గ్రహించుట నిశ్చయమగునేని, బిడ్డ సమాచారమును దెలిసికొని యేమి చేయఁబోయెదవు! చూచినను ప్రకృతమున ప్రయోజనము లేదు.

మహేంద్ర—ప్రభో! ఇంతకఠినమగునియమ మెందులకు?

సత్యానంద—సంతానుల కార్య మతికఠిన మైనయది. ఎవరు సర్వత్యాగులో యట్టివారు తప్ప, మఱెవ్వరును ఉపయుక్తులు కారు. మాయారజ్జుచే నెవరిచిత్తము బద్ధమై యున్నదో అట్టివారు దారమునకుఁ గట్టినగాలిపటమువలెనే భూమిని విడిచి స్వర్గము నెక్కలేరు.

మహేంద్ర—మహాస్వామీ! నాకుఁ జక్కఁగా బోధపడ లేదు. ఎవరు దారసుతాదుల ముఖదర్శనముఁ జేయుదురో యట్టివారు గురుతర మగు కార్యమున కధికారులు కారా?

సత్యానంద—పుత్త్రకళత్రముల ముఖములఁ జూచిన మాత్రమున దైవసంబంధములయిన పనులను మఱచిపోదురు. సంతానుల నియమ మేమనఁగా, అవశ్యక మైనపుడు ప్రాణత్యాగమునకును భయంపడ కూడదు. బిడ్డ ముఖము మనస్సునకు జ్ఞాపకము వచ్చినయెడల బిడ్డను విడిచి ప్రాణత్యాగంబునకు సిద్ధుఁ డగుదువా?

మహేంద్ర—చూడకుండిన మాత్రముననే జ్ఞాపకము లేకుండునా?

సత్యానంద—మఱచుటకుఁ గానిచో నీవీవ్రతమును గ్రహింప వలదు.

మహేంద్ర—సంతానులందఱును ఇట్లే పుత్త్రకళత్రము

లను మఱచి వ్రతగ్రహణము చేసియున్నారా? అట్లుండినయె
డల సంతానుల సంఖ్య యత్యల్పముగా నుండునే?

సత్యానంద—సంతానులలో దీక్షాబద్ధులును, దీక్షా
బద్ధులు కానివారు నని రెండు తరగతులవారు కలరు. ఎవరు
దీక్షాబద్ధులు కారో యట్టివారు సంసారులు; లేక, బికారులు.
అట్టివారు కేవలము యుద్ధకాలమున మాత్రము వత్తురు.
కొల్లలో భాగమునుగాని యితర పురస్కారమును గాని పొంది
వెడలి పోదురు. ఎవరు దీక్షాబద్ధులో యట్టివారు సర్వత్యాగులు.
వారే సంతానుల సంప్రదాయమునకు కర్తలు. నీవు దీక్షా
బద్ధుఁడ వైన సంతానుఁడవుగా నుండవలయు నని నాకోరిక.
యుద్ధమునకు ఖడ్గములు బల్లెములు కుంతములు మొదలగు
ననేక యాయుధములు కలవు. దీక్షితుఁడవు గాకుండినయెడల
ఈసంప్రదాయస్థుల ఘనకార్యములకు నీ వధికారివి కావు.

మహేంద్ర—దీక్ష యననేమి? దీక్షితుఁడై యుండవల
యునా? నేనింతకు మునుపే మంత్రగ్రహణము జేసినాఁడను.

సత్యానంద—ఆమంత్రమును విడిచిపెట్టవలయును. నాచే
మరల మంత్రోపదేశము కావలయును.

మహేంద్ర—మంత్రమును విడుచు టెట్లు?

సత్యానంద—నేను ఆపద్ధతిని జెప్పెదను.

మహేంద్ర—క్రొత్తగా మంత్రోపదేశ మెందులకుఁ
గావలయును?

సత్యానంద—సంతానులు వైష్ణవులు.

మహేంద్ర—అది నాకు స్ఫురింపలేదు. సంతానులు వైష్ణ
వులే కావలసినదేల? వైష్ణవులకు అహింస పరమధర్మము కదా?

సత్యానంద—అది చైతన్యుని సంప్రదాయకు లగు వైష్ణవుల ధర్మము. ఆధర్మము నాస్తికులగు బౌద్ధుల ధర్మము ననుసరించి అస్వాభావికముగ ఉత్పన్నమై యుండు వైష్ణవమతము. స్వాభావికమగు వైష్ణవమతధర్మ మెట్టిదనఁగా, దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధరిత్రి నుద్ధరింపవలయును. ఏలనఁగా, విష్ణువే జగంబునకు రక్షకుఁడై యున్నాఁడు. పదిమాఱు లవతరించి పృథ్వి నుద్ధరించినాఁడు. కేశి, హిరణ్యకశిపు, మధు, కైటభ, ముర, నరకాదిదైత్యులను, రావణాది రాక్షసులను, కంసశిశుపాలాది రాజులను, అతఁడే స్వయముగా యుద్ధమునందు ధ్వంసముచేసి యున్నాఁడు. అతఁడే జేత, జయదాత, పృథ్వియొక్క ఉద్ధారకర్త మఱియు సంతానుల యిష్టదేవత. చైతన్యునియొక్క వైష్ణవధర్మము ప్రకృత వైష్ణవధర్మము కాదు. అది అర్ధవైష్ణవధర్మముగా నున్నది. అది సంపూర్ణవైష్ణవధర్మముకాదు చైతన్యుని విష్ణువు ప్రేమమయుఁడు. అయినను, భగవంతుఁడు కేవల ప్రేమమయుఁడు కాఁడు. అతఁడు అనంతశక్తిమయుఁడై యున్నాఁడు. చైతన్యుని విష్ణువు శుద్ధప్రేమమయుఁడు. సాంతానికులవిష్ణువు శుద్ధశక్తిమయుఁడు. మన మిరువురమును వైష్ణవులమే. అయినను, ఇద్దఱును అర్ధవైష్ణవులే ఇపుడైనఁ దెలిసినదా?

మహేంద్ర—లేదు. ఇదేమో క్రొత్తమాటగా నున్నది. కాశింబజారునం దొక పాదిరితో నేను మాటలాడినపుడు, వాఁడును ఇట్టిమాటలనే చెప్పెను. అనఁగా, ఈశ్వరుఁడు ప్రేమమయుఁడు. నీవు యేసుక్రీస్తును గొలువు మనెను. మీమాటలును అట్టి మాటలుగనే యున్నవి.

సత్యానంద—మన పెద్దలు శాస్త్రముల మూలముగ చాలకాలమునుండి చెప్పిన మాటలనే గదా నేను నీకుఁ జెప్పినాఁడను ఈశ్వరుఁడు త్రిగుణాత్మకుఁ డనుటయు నీవెఱుఁగుదువుగదా?

మహేంద్ర—ఎఱుఁగుదును; సత్త్వ రజస్తమంబులను నీ మూఁడును త్రిగుణములు.

సత్యానంద—మంచిది, ఈ మూఁడు గుణములకును వేర్వేఱు ఉపాసనలు కలవు భగవంతుఁడు తన సత్త్వగుణముచే దయాదాక్షిణ్యాదుల నుత్పత్తి చేయుచున్నాఁడు. కనుక ఆయుపాసనము భక్తితోఁ జేయవలయును; చైతన్యసంప్రదాయస్థు లట్లు చేసెదరు. రజోగుణముచేత నాతని శక్తి ఉత్పత్తి యగుచున్నది. దీని యుపాసన యుద్ధముచేతను, దేవద్వేషుల నిధనంబునను గావలయును; మేము దాని నాచరించెదము. తమోగుణముచేత భగవంతుఁడు శరీరి యగుచున్నాఁడు. చతుర్భుజాదిరూపంబుల నిచ్ఛామాత్రంబున ధరించును. స్రక్చందనాద్యుపచారంబులచే నీగుణముయొక్క పూజ కావలయును; సాధారణజనులు దీని నాచరింతురు. ఇప్పుడు తెలిసినదా?

మహేంద్ర—తెలిసెను. సంతానులు ఉపాసకసంప్రదాయకులుగ మాత్ర మున్నారా?

సత్యానంద—ఔను. మనకు రాజ్యము వలదు. మ్లేచ్ఛులు భగవంతుని విద్వేషులై యుండుటఁబట్టి వారిని సమూలముగా హతము చేయవలయు ననునది యొకటే సంకల్పము.



## ఇరువదిరెండవ ప్రకరణము

### మహేంద్రుఁడు దీక్షితుఁ డగుట

సత్యానందుఁ డిట్లు చెప్పినమీఁద మహేంద్రసింహునిఁ బిలిచికొని మఠమందు అద్భుత చతుర్భుజమూర్తి నెలకొని యున్న అపూర్వశోభాయమాన మగు దేవాలయమునఁ బ్రవేశించెను. అపు డచ్చట అపూర్వశోభాకాంతిగల స్వర్ణ రత్నములచే నలంకరింపఁబడిన బహువిధదీపములు వెలుఁగుచుండెను. వివిధ పుష్పరాసులచే మందిరము ఆమోదముగా నుండెను. మందిరమున నొకఁడు కూర్చుండి మెల్లమెల్లగా "హా రేము రారే" యని నుడువు చుండెను. సత్యానందుఁడు మందిరమును బ్రవేశింపఁగనే యామనుష్యుఁడు లేచి ప్రణామం బాచరించెను.

బ్రహ్మచారి—నీవు దీక్షితుఁడ వయ్యెదవా? యనెను.

ఆమనుష్యుఁడు—నన్ను అనుగ్రహించి దీక్ష నొసంగిన గ్రహించెద.

అపుడు సత్యానందుఁడు ఆతనిని, మహేంద్రుని సంబోధించి, మీరిరువురును యథావిధిగా సుస్నాతులరై సంయతులై యనశనులై యున్నారు కదా? యని యడిగెను.

ఉభయులు—ఆరీతిగనే యున్నాము.

సత్యానంద—మీ రిరువురును భగవత్సాక్షిగా సంతాన మత ధర్మనియమంబుల కన్నిటికి బద్ధులరై యుందు మని ప్రతిజ్ఞ చేయఁగల్లరా?

ఉభయులు—చేయుదుము.

సత్యానంద—ఎన్నిదినములవఱకు . మాతయొక్క ఉద్ధారము కాదో యంతవఱకు గృహధర్మములను త్యజింతురా?

ఉభయులు—అట్లే చేయఁగలము.

సత్యానంద—తల్లిదండ్రులను విడిచెదరా?

ఉభయులు—విడిచెదము.

సత్యానంద—భ్రాతలను భగినీలను?

ఉభయులు—వారినిఁగూడ విడిచి పెట్టెదము.

సత్యానంద—దార సుతులను?

ఉభయులు—త్యజించెదము.

సత్యానంద—ఆత్మీయస్వజనులను? దాసదాసీజనులను?

ఉభయులు—అందఱను బరిత్యజించెదము

సత్యానంద—ధనము? భోగములు?

ఉభయులు—సర్వము పరిత్యాగ మాయెను.

సత్యానంద—ఇంద్రియములను జయింతురా? ఏకాసనమున స్త్రీలతోఁ గూర్చుండకుందురా?

ఉభయులు—ఇంద్రియములను జయించెదము. అట్లు కూర్చుండుట లేదు.

సత్యానంద—భగవత్సాక్షిగా సొంతమునకుఁగాని, లేక స్వజనులకొఱకుఁగాని అర్థోపార్జన చేయుట లే దని ప్రతిజ్ఞ చేయుదురా? ఏయుపార్జనచేసినను దానిని వైష్ణవధనాగారంబున కొసంగుదు మని ప్రమాణము చేయుదురా?

ఉభయులు—అట్లే ప్రమాణము చేయుదుము.

సత్యానంద—సనాతనధర్మంబునకై శక్తివంచనలేక అస్త్రపాణులై యుద్ధము చేయుదురా?

ఉభయులు—చేయుదుము.

సత్యానంద—రణరంగంబున వెనుదీయరుకదా?

ఉభయులు—వెనుదీయము.

సత్యానంద—ప్రతిజ్ఞాభంగ మొదవినచో?

ఉభయులు—జాజ్వల్యమానమగు అగ్నియందుఁ బ్రవేశింతుము లేక, విషమునైనను తిని ప్రాణములను త్యజింతుము.

సత్యానంద—ఇంకొకమాట మహేంద్రుఁడు కాయస్థుఁడని నాకుఁ దెలియును; ఇంకొకనిఁ జూచి, నీ వేజాతివాఁడవు?

మఱొక్కఁడు—నేను బ్రాహ్మణకుమారుఁడను.

సత్యానంద—మంచిది, మీరు జాతిని విడువఁగలరా? సంతానులంద ఱొకే జాతి. ఈమహావ్రతంబున బ్రాహ్మణ శూద్ర భేదము లేదు: మీ రేమి చెప్పెదరు?

ఉభయులు—మే మాభేదము నుంచుకొనుట లేదు. మన మందఱ మొక మాతృసంతానులము.

సత్యానంద—అట్లయినచో మిమ్ము దీక్షితులను జేసెదను. మీ రిపుడు చేసిన ప్రమాణవాక్యములయం దొక్కదానికైనను భంగము రాఁగూడదు. శ్రీమురారియే దీనికి సాక్షి. ఎవ్వఁడు రావణ కుంభకర్ణ కంస హిరణ్యకశిపు జరాసంధ శిశుపాలాది దుష్టుల నాశనంబునకు హేతుభూతుఁడై యుండెనో; ఎవఁడు సర్వాంతర్యామియై, సర్వజయియై సర్వశక్తిమంతుఁడై, సర్వనియామకుఁడై, యున్నాఁడో; ఎవఁడు ఇంద్రుని వజ్రాయుధంబునను, మార్జాలనఖములయందును తుల్యరూ

పుఁడై యున్నాఁడో; యట్టి మహానుభావుఁడు ప్రతిజ్ఞాభంగ కారిని ధ్వంసముచేసి నరకంబునఁ బడవేయునుగాక!

ఉభయులు—తథాస్తు.

సత్యానంద—మీరు "వందే మాతరం" అని గానము చేయుఁ డనఁగా నిరువురు నా నిభృతమందిరమున మాతృస్తోత్రమును పాడిరి. పిమ్మట బ్రహ్మచారి వారికి యథావిధిగా దీక్ష నొసంగెను.

---

## ఇరువదిమూఁడవ ప్రకరణము.

### మహేంద్రుఁడు స్వగృహమున వసించుట కియ్యకొనుట

దీక్షాసమాపనాంతరమున సత్యానందుఁడు మహేంద్రుని యత్యంతము నేకాంత మగు నొకస్థలమునకుఁ బిలిచికొని పోయెను. ఇరువురును గూర్చున్నపిదప, సత్యానందుఁ డిట్లని చెప్పందొడంగెను. "కుమారా! ఇపుడు నీవు మహావ్రతమును గ్రహించినందుచే భగవంతుఁడు మనపక్షముగా నున్నాఁడని తలంచెదను. నీ మూలముగా మాతృమహాత్కార్యము నెఱవేఱవలసినదిగా నున్నది. నీవు చక్కఁగా నామాటలను చెవియొగ్గి వినుము. నీవు భవానంద జీవానందులతో వనవనంబులను దిరిగి యుద్ధము చేయ నవసరము లేదు. నీవు పదచిహ్నాగ్రామంబునకు మరలి పొమ్ము. స్వగృహంబున నుండియే సన్న్యాసధర్మంబు నాచరింపుము."

మహేంద్రుఁడు విస్మితుఁడై, కొంచెము వ్యాకులమనస్కుఁ డాయెను. ఏమియు నుత్తర మియ్య లేదు. బ్రహ్మచారి

మరల చెప్పెను. "ఇపుడు మనకాశ్రయము లేదు. ప్రబల మగు సైన్యము వచ్చి మనలను అవరోధము చేసినయెడల వనము భోజనసామగ్రులను సంగ్రహించి తలుపువేసికొని పదిదినములు నిర్విఘ్నముగా నుండుటకుఁ దగినట్టి స్థలము లేదు. మనకు కోట లేదు; నీకు గొప్పమేడ యున్నది. నీగ్రామము నీ యధికారమున నున్నది. నాయభిప్రాయ మేమనఁగా—అచ్చటనే యొకకోటను నిర్మింపవలయును. కోటగోడనుండి పదచిహ్నగ్రామముచుట్టును అచ్చటచ్చట బురుజులను గట్టి వానిపై ఫిరంగి గుండ్ల నెక్కించినయెడల నుత్తమమయిన కోట యగును. నీ వింటికేఁగి నీయింటనే వసింపుము. క్రమక్రమముగా అచ్చటికి రెండువేల జనులు సంతానులు వచ్చి చేరుదురు. వారిచే కోట కొత్తళములను నిర్మించుచుండుము. అచట నొక లోహనిర్మిత మగు గృహంబును గట్టింపవలయును. అది సంతానుల అర్థభాండాగారమున కుపయుక్త మగును. బంగారునాణెములు నిండించిన పెట్టెల నొక్కొక్కటిగాఁ బంపెదను. నీ వాద్రవ్యముతో నీకార్యంబు లన్నిటిని నిర్వహింప వలయును. మఱియు, నేను నానాదేశములనుండి శిల్పిశాస్త్రనిపుణులను కూలిపనిచేయువారలను బిలిచికొని వచ్చెదను. శిల్పిశాస్త్రజ్ఞులు వచ్చినవెంటనే నీవు పదచిహ్నగ్రామంబున నొక కార్యగృహంబును స్థాపించి, యచట మందుఁ గుండు ఫిరంగి, తుపాకి మొదలగువానిని తయారు చేయించవలయును. దీనికొఱకే నిన్నింటికి పోయి వాసము చేయు మని చెప్పుచున్నా" ననెను.

మహేంద్రుఁడును సమ్మతించెను.

---

## ఇరువదినాలుగవ ప్రకరణము

### మహేంద్రుఁడు శాంతిని దెలిసికొనుట

మహేంద్రుఁడు సత్యానందుని పదకమలంబుల కెఱఁగి, యనుజ్ఞఁ గైకొనియె. అతనితో నింకొక మనుష్యుఁడును దీక్షితుఁడై యుండెను. అతఁడును వచ్చి సత్యానందునికి మ్రొక్కెను. సత్యానందుఁ డాశీర్వదించి కృష్ణాజినముపైఁ గూర్చుండ నియమించెను. అనంతరము, యోగక్షేమలాభములనుగూర్చి ముచ్చటించుచుండి, 'కుమారా! నీకు స్థిరమైన భక్తి కలదా?' యని యడిగెను:

శిష్యుఁడు—ఎట్లు చెప్పఁగలను? మన మెవనిని భక్తిగల వాఁడని నుడివెదమో యట్టివాఁడు శుద్ధకుంతర్యై యాత్మ ప్రతారణుఁడై యుండును.

సత్యానందుఁడు సంతోషపడి, 'చక్కఁగా నుడివితివి; భక్తి నెట్లతిక్రమింపవలయునో యావిధమగు అనుష్ఠానము చేయుము. నీ ప్రయత్నము సఫలము కాసిమ్మని దీవించెను. వలన వత్సా నీవింకను బాలుఁడవుగా నున్నావు. నిన్నే పేరున పిలుతును? దానిని గుఱించి నేనిదివఱకు ఆలోచించలేదు.'

నూతనసంతానుఁడు—తమమనంబునం దేపేరు తోఁచెడినో యాపేరునఁ బిలువవచ్చును. నేను వైష్ణవుల దాసానుదాసుఁడను.

సత్యానం—నీయొక్క నవీనవయస్సునుబట్టి నీకు నవీనానందుఁ డని పే రిడిన బాగని తోఁచుచున్నది. కావున నీవానామంబును పరిగ్రహింపుము. అయిన నీమొదటిపే రేమి? చెప్పుట కేమి యభ్యంతర ముండినను జెప్పవలయును. నాకుఁ జెప్పినయెడల వే తెవ్వరి చెవిని సోఁకదని నమ్ముము. సంతానుల మర్మ మేమనఁగా, ఏదైనను సరియే, ఏవిషయమైనను సరియే, అది వాచ్యమైయుండినను సరియే, గురువునకుఁ జెప్ప వలయును. చెప్పినందునఁ నష్టమేమి యు నుండదు.

శిష్యుఁడు—నా మొదటిపేరు శాంతిరామదేవశర్మ.

సత్యానంద—నీపేరు శాంతిమణి పాపివి కాదా?

అనిచెప్పి, సత్యానందుఁడు వ్రేలాడుచుండిన గడ్డమును పట్టి యీడ్వఁగా నది యూడి వచ్చెను. పిదప, సత్యానందుఁడు 'తల్లీ! నాయెడ వంచనచేయ నగునా? ఈయల్పవయస్సుననే వంచన నేర్చినచో నింకేమి? మీసమును గడ్డ ముంచుకొనిన నేమి? నీకంఠస్వరము, కనుచూపులు, ఈ ముసలివానిముందు మఱుగుపఱుప నగునా? నేను తెలివిమాలినవాఁడనై యుండినచో నింతటి గొప్పకార్యమునకుఁ బూనఁగలనా?' యనెను.

శాంతి—ముఖము మాడ్చుకొని రెండు కన్నులును మూసికొని యధోవదనయై యుండెను. వెంటనే కనులు తెఱచి యావృద్ధునిపై విలోలకటాక్షమును నిగుడించి, 'ప్రభూ! ఏమి దోషము నాచరించితిని. స్త్రీబాహువులయం దెపుడును బల ముండదా?' యనెను.

సత్యానంద—గోష్పదంబున నీ రున్నయట్లే.

శాంతి—సంతానుల బాహుబలంబును తా మెప్పుడై నను పరీక్ష చేసి యున్నారా?

బ్రహ్మచారి—పరీక్షించి యున్నాను.

ఇట్లని చెప్పి సత్యానందుఁడొక యుక్కుధనుస్సును, నొక యినుపతంతిని దెచ్చియిచ్చి, "యెవఁ డీధనుస్సున నీతంతిని గట్టి, వింటిని వంచి, టంకారము చేయునో, వాఁడే సంతానుఁ" డనెను.

శాంతి—వింటిని తంతిని చేతఁదీసికొని చక్కఁగాఁ జూచి సంతాను లంద ఱీపరీక్షయందు ఉత్తీర్ణులైనారా? యనిరయెను.

సత్యానంద—లేదు. దీనిచే వారి బల మెంతటి దనునది నిశ్చయించుకొని యున్నాను.

శాంతి—అట్లయిన నెంద ఱీపరీక్షలో ఉత్తీర్ణులైనవారు.

సత్యానంద—ఇరువురు మాత్రము.

శాంతి—ఎవ రెవ రని యడుగవచ్చునా?

సత్యానంద—చెప్పుటయందు నిషేధ మేమియు లేదు. నేనొకండను

శాంతి—రెండవవా రెవరు?

సత్యానంద—జీవానందుఁడు.

శాంతి—వింటిని తంతిని దీసికొని కొంచెమైనను శ్రమ లేక విల్లు వంచి, నిమిషమాత్రంబునఁ బూన్చి సత్యానందుని పాదముల సమీపమున పాఱవైచెను.

సత్యానందుఁ డాశ్చర్యభయంబు లొంది స్తంభితుఁ డాయెను. కొన్నినిమిషముల 'కిదేమి? నీవు దేవివా? లేక మానవస్త్రీవా?' యని యడిగెను.

శాంతి—చేతులు జోడించికొని, నేను సామాన్యురా లగు మనుష్యస్త్రీని. అయినను, నేను బ్రహ్మచారిణిని యనెను.

సత్యానంద—అయిన నేమి? నీవు బాలవితంతువా? అట్లయినను ఇంత బల మెక్కడిది? అది యేకాహారికదా?

శాంతి—నేను సధవను.

సత్యానంద—నీస్వామి నిరుద్దిష్టుఁడా? ఎవరు, చెప్ప వచ్చునా?

శాంతి—ఉద్దిష్టుఁడే; అతనికొఱకే వచ్చితిని.

ఉన్నట్లుండి మేఘమును భేదించుకొని వెడలి వచ్చిన యెండవలె, సత్యానందుని స్మృతి ప్రకాశమాన మయ్యెను. వెంటనే జీవానందుని భార్యపేరు శాంతి యని తెలిసికొని, 'నీవు జీవానందుని బ్రాహ్మణివేనా?' యనెను.

ఈతేప జటాభారముచే నవీనానందుని ముఖము మఱుఁగు చేయఁబడియెను. కొన్ని యేనుంగుల తొండములు రాజీవ ములపైఁ బడియున్నవియో యనున ట్లగపడియెను.

సత్యానందుఁడు—'ఏల నీ వీపాపాచరణము నాచరించు టకై వచ్చితివి?' అని యడిగెను.

శాంతి—వెంటనే జటాభారమును వీపుపై వేసికొని, ముఖ మెత్తి, 'ప్రభూ! పాపాచరణ మేమున్నది? పత్ని పతి ననుసరిం చుట పాపాచరణమా? సంతానుల ధర్మశాస్త్రమునందు దీ నిని పాపాచరణ మని చెప్పియుండినయెడల, సంతానుల ధర్మ ము అధర్మమైనయదే. నేను నాస్వామియొక్క సహధర్మిణిని. వారు ధర్మాచరణమందు ప్రవృత్తులై యున్నారు. నేను వారి

తోఁగూడ ధర్మాచరణ మాచరించుటకై వచ్చియున్నాను' అనెను.

శాంతియొక్క గంభీరవాణినివిని, యామె యున్నత గ్రీవ మును, స్ఫీతవక్షఃస్థలమును, కంపితాధరములను, అశ్రుప్లుతనేత్ర ములను గాంచి సత్యానందుఁడు అమితానందంబును బొంది' శాంతినిఁజూచి, 'నీవు సాధ్వివి. అయినను, తల్లీ! పత్ని కేవ లము గృహధర్మమున సహధర్మిణిగాని, వీరధర్మమున రమణి లేదుగదా ? '

శాంతి—ఏమహావీరుఁడు అపత్నీకుఁడై వీరుఁడై యుండె ను ? రాముఁడు సీత లేకుండిన వీరుఁ డగుచుండెనా? అర్జునున కెందఱో భార్య లుండిరి. భీమున కెంతబలమో యందఱు పత్ను లుండిరఁట ! ఎంతయని చెప్పుదును ? తమకుఁ దెలియని దేమున్నది?

సత్యానంద—నీవు చెప్పునది నిజము ; అయినను, రణ రంగమున నేవీరుఁడు భార్యాసహితుఁడై యుండెను ?

శాంతి—అర్జునుఁడు యాదవసైన్యముతో నంతరిక్షమునఁ బోరునపు డాతని రథమును నడపినవా రెవరు? ద్రౌపది సమీప మున లేకుండిన, పాండవులు కురుక్షేత్రమునందు యుద్ధము చేయుదురా ?

సత్యానంద—వా రట్లుండవచ్చును. సామాన్యు లగు మనుజుల మనస్సు స్త్రీలయం దాసక్తమై కార్యభంగ మగు చున్నది. ఆ హేతువుచేత సంతానుల వ్రతమందు స్త్రీలతోడ నేకాసనంబునఁ గూర్చుండరా దనుపద్ధతి యొకటి యేర్పడి

యున్నది. జీవానందుఁడు నా కుడిభుజమై యున్నాఁడు. నీవు నాకుడిభుజమును విఱుచుటకై వచ్చితివి.

శాంతి—నేను తమకుడిభుజము బలమును ఎక్కువచేయుటకై వచ్చియున్నాను. నేను బ్రహ్మచారిణిని. విభునితో బ్రహ్మచారిణిగనే యుండెద. నేను కేవల ధర్మాచరణము కొఱకే వచ్చినదానను. స్వామి సందర్శనంబునకుఁ గాదు. విరహాయంత్రమునకు నేను లోఁబడినదానను గాను. స్వామి ధర్మచ్యుతికి రక్షకురాలను. వానలేక గొప్పవృక్షము లెండి పోవును. నేను మహామహీరుహతలమునందు వర్షింపఁజేయుదు. తాము నిశ్చింతతో నుండుఁడు.

సత్యానంద—అదేమి; మహామహీరుహంబునకు అనావృష్టిభయము కలదా? జీవానందునికి ధర్మచ్యుతియా?

శాంతి—అయినదానిని కానీక చేయఁగలవా?

సత్యానంద—ఏమై యున్నది? జీవానందునికి ధర్మచ్యుతి కల్గినదా? హిమాలయములోని కొనలో మునిఁగిపోయెనా?

శాంతి—నిన్నమధ్యాహ్నంబున వారు వచ్చి చూచిరి; వ్రతభంగమై పోయెను.

దీనిని విని, పలితకేశి యగు బ్రహ్మచారి రెండుచేతులతో కనులు మూసికొని యేడ్చెను. సత్యానందు డేడ్చుటను వింతకుము న్నెవరును జూచి యుండలేదు.

శాంతి—ప్రభూ! మీకన్నుల నీరు రాఁదగునా?

సత్యానంద—ప్రాయశ్చిత్త మేమి తెలియునా?

శాంతి—తెలియును. ఆత్మహత్యయే.

సత్యానంద—అందులకై యేడ్చెదను; జీవానంద శోకంబునకై యేడ్చెదను.

శాంతి—నేనును దానికొఱకే వచ్చి యున్నాను. జీవానందుని ప్రాణము పోకుండునట్లు చూచుకొని యుండుటకే వచ్చి యున్నాను.

సత్యానంద—బాలా ! నీ యభీష్టము సిద్ధించుగాక. నీ యపరాధముల నన్నిటిని మన్నించితిని. నీవు సంతానుల యందు పరిగణితురాలవై యుందువు. నీ మర్మము నెఱుంగనందున నిన్నుఁ దిరస్కరించితి. నా కేమి తెలియును ? నేను వనచారి యగు బ్రహ్మచారినిగాని వేఱుకాదు. నేను స్త్రీలవలె నౌదునా ? అ దెట్లగుదును ? జీవానందుఁడు నా ప్రాణాధిక ప్రియుఁడు, ఇప్పుడు చూచితివా ! కుడిచేయి పడిపోయినచో దేవకార్యము నెఱవేఱదు, ఎన్ని దినములు సాధ్యమో యన్నిదినంబులవఱకును జీవానందుని పృథ్వియం దుంచుటకుఁ బ్రయత్నింతును. నీవును కూడనుండి యీ బ్రహ్మచర్యంబును బాలింపుము. నీవు నా ప్రియశిష్యవైతివి. సంతానులని వినినచో నా కానందము. కావున సంతానుల కందఱకును "ఆనంద" యను నామ మిడఁబడినది. ఇది "ఆనందమఠము" నీవు "ఆనంద" యనుపేరును ధరింపుము. నీపేరు "నవీనానంద" యని యుండనిమ్ము,

శాంతి—నేను ఆనందమఠమున నుండవచ్చునా?

సత్యానంద—ఇఁక నెచటికి పోదువు? ఈరాత్రి యిచట నేయుండుము.

శాంతి—తర్వాత?

సత్యానంద—తల్లీ! భవానివలె నీ లలాటమునందు అగ్ని ప్రజ్వలించుచున్నది. సంతానసంప్రదాయస్థుల నందఱను కాల్చి వేయుదువేమొ? అనిచెప్పి, శాంతిని దీవించి యనుజ్ఞ నొసంగెను.

శాంతి మనంబున, 'ఓరీ ముదుసలిగొడ్డా! నాముఖము నందా యగ్ని? నేను కాలినముఖము గలదాననా? నిన్నుఁ గన్న తల్లి కాలినముఖము గలది.' అని యనుకొనెను.

వాస్తవముగా సత్యానందున కీ యభిప్రాయము లేదు. ఆమె నేత్రంబుల విద్యుత్కటాక్షమును గుఱించి యతఁ డట్లు చెప్పెను. అయినను, ఆముసలివాఁడు యువతికి వివరించి చెప్ప వచ్చునా?

---

## ఇరువదియైదవప్రకరణము

### జీవానంద నవీనానందుల కలహము.

శాంతి యారాత్రి మఠమునకుండుట కనుజ్ఞఁగొని యుండెనుగాన, గఠమున నొక గదిని చూచికొనుటకై పోయెను. పెక్కు గదులుండినవి. గోవర్ధనుఁ డను నొక పరిచారకుఁ డుండెను. వాఁడును సంతానుఁడే. అయినను, పై తరగతిలోఁ జేరినవాఁడు కాఁడు. వాఁ డొక దీపమును చేతఁ బట్టుకొని గదులను చూపుచు వచ్చెను. ఏగదియు శాంతికి సమ్మతముగ నుండలేదు. హతాశుఁడై శాంతిని సత్యానందునికడకుఁ బిలిచికొని పోవుటకు యత్నించెను.

అప్పుడు శాంతి, 'అయ్యా సంతానబాబు! ఈప్రక్కను కొన్నిగదు లున్నవిగదా? వానినేల చూపలే' దనెను.

గోవర్ధన—ఆగదులు మంచివియే. అయినను, వానిని జూడరాదు.

శాంతి—ఎవ రున్నారు?

గోవర్ధన—గొప్పగొప్ప సేనాపతులు న్నారు.

శాంతి—గొప్పగొప్ప సేనాపతు లెవరు?

గోవర్ధ—భవానంద, జీవానంద, ధీరానంద, జ్ఞానానందులు; ప్రస్తుతము ఆనందమఠము ఆనందమయముగా నున్నది.

శాంతి—ఆగదులను గూడ చూచెదను.

గోవర్ధనుఁడు శాంతికి మొదట ధీరానందుని గదినిఁ జూపెను. ధీరానందుఁడు మహాభారతమునందు ద్రోణపర్వమును జదువుచుండెను. అభిమన్యుఁడు ఏవిధముగా సప్తరథులతోఁ బోరుచుండెనో యాప్రకరణముననే మనస్సు నుంచినవాఁడై యుండెను గాన, నతఁడు మాటలాడలేదు. శాంతియు మాటలాడక యటనుండి వెడలెను.

అనంతరము భవానందుని గృహంబునకుఁ బోయెను. భవానందుఁ డపు డూర్ధ్వదృష్టి గలవాఁడై ఎవ్వరిముఖమునో చూచుచుండెను. అది ఎవరిముఖమో మనకుఁ దెలియదు. అయినను, ఆముఖము అతిసుందర మైనది; కృష్ణవర్ణమును కుంచితమునైన సుగంధముగల యలకరాశి యాకర్ణప్రసారి యగు భ్రూయుగ్మముపై వాలి యుండెను. మధ్యంబున త్రిభుజాకారమగు లలాటదేశమందు మృత్యుకరాళ మగు నల్లని ఛాయ కన్పట్టుచుండెను. చూడఁగా మృత్యువును మృత్యుం

జయుఁడును యుద్ధము చేయుచున్న ట్లగపడెను. నేత్రములు నిమీలితములై యుండెను. భ్రూయుగ్మము స్థిరముగా నుండెను. ఓష్ఠము నీలవర్ణమై యుండెను. గండస్థలము పాండురమై యుండెను. ముక్కు చల్లనై యుండెను. వక్షము న్నతమై యుండెను. వాయువు వసనమును విక్షిప్తము జేయుచుండెను. కొంచెము సేపటికి యెట్లు శరత్కాల మేఘమునందు విలుప్తుఁడైన చంద్రుఁడు క్రమక్రమముగా మేఘరాశిని ఉద్భాసితము జేసి తనసౌందర్యమును బయలుపుచ్చునో; ఎట్లు ప్రభాత సూర్యుఁడు తరంగాకృతమైన మేఘమాలికను క్రమక్రమముగా సువర్ణీకృతముజేసి ప్రదీప్తుఁడై దిఙ్మండలమును వెలింగించి స్థల జల కీట పతంగంబులను ప్రఫుల్లముజేయునో; అట్లే యా శవముయొక్క దేహమందు ప్రాణసంచారకాంతి ప్రకాశించుచువచ్చెను. ఆహా! ఎట్టికాంతి? భవానందుఁడు ఆ మొగమునందే దృష్టి నుంచి యుండెను. అతఁడు పలుక లేదు. కల్యాణి రూపంబునం దతని హృదయ మాకర్షింపఁబడి యుండెను. శాంతిరూపముపై నతనిదృష్టి పోలేదు.

అటనుండి శాంతి మఱొకగదియొద్దకుఁ బోయి, 'ఇది యెవ్వరిది' అని యడిగెను.

గోవర్ధన—జీవానంద ఠాకూరువారిది.

శాంతి—వా రెక్కడ? ఇచట నెవ్వరు లేరుగదా?

గోవర్ధన—ఎక్కడికైనను బోయి యుందురు. ఇపుడే వత్తురు.

శాంతి—ఇది యన్నిటికన్న బాగుగ నున్నది.

గోవర్ధన—ఈ గదియం దుండుటకు వలనుపడదు.

శాంతి—ఏల?

గోవర్ధన— జీవానందఠాకూరు ఇచట నుందురు.

శాంతి—వారు లేరు, కావలసి యున్న వేఱేగదిని చూచు కొనఁగలరు.

గోవర్ధన—అది యె ట్లగును? ఎవ్వ రిచ్చట నుందురో వారే దీనికి యజమానులు. వారేమిచేసినను చేయుదురు.

శాంతి—మంచిది, నీవుపో, నాకు చోటు దొరకకున్న యెడల నొకచెట్టుక్రింద నుండెదను.

ఇట్లనిచెప్పి గోవర్ధనుని కాజ్ఞయిచ్చి పంపి శాంతి యాగది యందుఁ బ్రవేశించి జీవానందుని కృష్ణాజినమును పఱచుకొని దానిపైఁ బండుకొనియెను.

కొంచెము సేపటికి జీవానందఠాకూరు వచ్చెను. దీపము వెల్తురు ప్రకాశముగా నుండనందున కృష్ణాజినముపై పరుండి యుండుటను దెలియక దానిపై గూర్చుండఁబోయి, శాంతి మోఁకాలిపైఁ గూర్చుండెను. ఉన్నట్లుండి మోఁకా లెత్తి నందున జీవానందుఁడు క్రింద పడెను.

జీవానందునికిఁ గొంచెము నొప్పి యాయెను. అతఁడు క్రుద్ధుఁడై లేచి కూర్చుండి 'యెవ రిచ్చట?' యని గద్దించి యడిగెను.

శాంతి—నీకు మనుష్యుల మోఁకాలిపైఁ గూర్చుండుట కేర్పఱచిన స్థల మిదేనా?

జీవానంద—నీవు దొంగతనముగ నాగదిలోఁ బరుండి యుండు టెవ రెఱుంగుదురు?

శాంతి—నీగది యె ట్లాయెను?

జీవానంద—మ తెవ్వరి గది?

శాంతి—నాగది.

జీవానంద—నీది కాదు. నీ వెవరవు?

శాంతి—నేను నీచెల్లెలి మగఁడను.

జీవానంద—నీవు నావాఁడ వగుదువో కాదో? నేను నీవాఁడ నని తోఁచుచున్నది. నీకంఠధ్వని నాభార్య కంఠధ్వనివలె నున్న ట్లగపడుచున్నది.

శాంతి—బహుకాలము నీభార్యకును నాకును ఏకాత్మభావ ముండెను. దానిచే నిరువుర కంఠధ్వను లొకటిగా నుండవచ్చునని తోఁచుచున్నది.

జీవానంద—ఏమి? చాలా అధిక ప్రసంగము లాడెదవు? ఈ మఠమునఁగాక ఇతరస్థలమైె యుండినచో నొక్కగుద్దుగుద్ది పండ్లు రాలగొట్టి యుందును.

శాంతి—పండ్లూడఁ గొట్టుట సామాన్యము కాదు. నిన్నటి దినము నగరమున నెంతమంది దంతము లూడఁగొట్టితివి, లెక్కపెట్టుము, వ్రేళ్లు విడిచెదను, ఏదీ చూతము, దంభముచేఁ గార్య మగుట లేదు, నే నిప్పుట పరుండినాను, నిద్దుర వచ్చుచున్నది, మీరు సంతానులలోఁ జేరినవారు, గత్తర యాయెనా వెంటనే పాఱిపోయి బ్రాహ్మణస్త్రీల చీరలను కప్పుకొని దాఁగుదురు.

జీవానందఠాకూరు మహాకోపము వహించెను. సత్యానందుఁడు ఆనందమఠమున సంతానులు పరస్పరము కొట్టుకొనరాదని నిషేధించి యున్నాఁడు. అయినను, వీనినోరు మూయింపక యుండఁగూడదు. చెంపదెబ్బ తీయవలసియే

యున్న దని యనుకొనెను. కోపముచే శరీరమాద్యంతమును మండుట కారంభించెను. అయినను కంఠస్వర మతిమనోహారం బై స్వర్గ కవాటము తెఱువఁబడి వచ్చుచున్నదో యనున ట్లుండెను. వినరాని కటూక్తులు మర్మభేదిర్లై యుండెను. జీవానందుఁడు లేచుటకును కూర్చుండుటకును ఇష్టములేనివాఁడై యుండెను. ఉభయసంకటముగా నుండెను. తుదకు, "మహాశయుఁడా! ఈయిల్లు నాది; చాల కాలమునుండి నాయనుభవమున నున్నది. తాము బైటపొండు" అనెను.

శాంతి—ఈయిల్లు నాది; ఇప్పటికి ఒకగడియ ప్రొద్దుగా నాయనుభవమున నున్నది; కనుక తామే బైటికి పొండు,

జీవానంద—ఇది మఠముగానుండుటచేత, దుడ్డుకఱ్ఱతోఁ గొట్టి నిన్ను నరకకూపంబున కనుపనైతిని. అయినను, ఇప్పుడే మహాస్వాముల యనుజ్ఞ నొందివచ్చి నిన్ను వెడలఁగొట్టెదను.

శాంతి— నేను మహాస్వాముల యనుజ్ఞనొందియే నిన్నుఁ దఱుమగొట్టెద; నీవు దూరముగా పొమ్ము.

జీవానంద—మంచిది; ఈయిల్లు నీదికాదుకదా? స్వాములవారినే యడిగివచ్చెదను; నీ పేరేమి? చెప్పుము.

శాంతి—నాపేరు నవీనానంద గోస్వామి. నీ పేరేమి?

జీవానంద—నాపేరు జీవానంద గోస్వామి.

శాంతి—నీవేనా జీవానంద గోస్వామివి? కావుననే యిట్లు?

జీవానంద—ఎట్లు?

శాంతి—జనులు చెప్పుచున్నారు, నేనేమి చేయుదును?

జీవానంద—ఏమని చెప్పెదరు?

శాంతి—దానిని జెప్పుటకు నా కేమిభయము? జనులు జీవానందుఁడు భ్రష్టుఁడు మూర్ఖుఁడు, అని చెప్పెదరు.

జీవానంద—భ్రష్టుఁడు, మూర్ఖుఁడు, ఇంక నేమనియెదరు!

శాంతి—బుద్ధిలేనివాఁడు, అని కూడ.

జీవానంద—ఇంక నేమి చెప్పెదరు?

శాంతి—యుద్ధమునందు చేతకానివాఁ డని.

జీవానందునికి శరీరమంతయు కోపముచే ధగధగ మండి, ఇంక నేమైనఁ గలదా?' యని యడిగెను.

శాంతి—ఇంకెంతని చెప్పుదును, నిమాయి తనచెల్లెలని కూడ చెప్పెదరు.

జీవానంద—నీవు గూఁబవు

శాంతి—నీవు ఎలుగుబంటివి.

జీవానంద—నీవు ఉలూక, అర్వాచీన, నాస్తిక, విధర్మ, భ్రష్ట, పామరుఁడవు.

శాంతి—నీవు యలాయవాయవోచీచః, నీవు స్తుశ్చుభి శ్చ్వశాత్, నీవు ష్టుభిష్ట్వయాదాంతయో. *

జీవానంద—ఓరీ! ఇటనుండి వెడలుము, లేకున్న నీగడ్డము పెరికివేయుదును చూడుము.

శాంతి, గడ్డమును పట్టినచోఁ బ్రమాద మగు నని యెంచికొని స్థలమును విడిచి పలాయన తత్పరురా లయ్యెను.

జీవానందుఁడు వెంటనంటిపరుగెత్తెను. మఠమును విడిచి బయటికి పోయినచో రెండుతన్నులు తన్నవచ్చు నని తలంచి పరువిడెను, శాంతి యెంతైనను స్త్రీ పరువిడెడి యభ్యాసము

---

* వ్యాకరణసూత్రములు కొంచెము వికృతమై యుండవచ్చును!

తక్కువ. ఈవిద్యలో జీవానందుఁడు నిపుణుఁడు. తటాలున పోయి శాంతిని కొట్టవలయునని యెంచి పట్టుకొనెను. ఆమెను తాఁకిన మాత్రాననే జీవానందుఁడు విస్మితుఁడై విడిచి పెట్టెను. అయినను, శాంతి జీవానందుని మెడపై చెయివేసి గట్టిగా పట్టుకొనియెను.

జీవానందుఁడు, 'ఏమి, నీవు స్త్రీవి! విడువుము, విడువుము!' అనెను. శాంతి యామాటను చెవి నిడక గట్టిగా, 'ఎవరు లేరా, చూడుఁడు, చూడుఁడు, ఒక సంతానుఁడు బలవంతముగా స్త్రీయొక్క సతీత్వమును భంగపఱచుచున్నాఁడు' అని యఱచెను.

జీవానందుఁడు, చేతితో నామె నోరు మూసి, 'సర్వనాశము ! అట్టిమాటఁ జెప్పవలదు. విడువుము, విడువుము నాకు నొప్పిగా నున్నది.'

శాంతి విడువలేదు. ఇంకను గట్టిగా నఱచెను. శాంతి పట్టును విడిపించుకొనుట సామాన్యము కాదు. జీవానందుఁడు రెండుచేతులను జోడించుకొని, 'నీకాళ్లకు మ్రొక్కెదను, విడువుము' అని వేఁడికొనెను. ఇంతలో నా యాఁడుదాని యార్తధ్వని యాయరణ్యమంతయు నావరించెను.

ఇచట మఠమునం దున్న గోసాయీలు ఆఁడుదానిని అత్యాచారము చేయుచున్నా రని విని, యనేకులు చేతిదీప ములను వెలిఁగించుకొని దుడ్డుకఱ్ఱలను చేతఁబట్టుకొని వెడలిరి. జీవానందుఁడు వారినిఁజూచి వడవడ వడంకెను. శాంతి 'ఇంత వణఁ కేల? నీవతిభయస్థుఁడవు! జనులు నిన్ను మహావీరుఁడ వని పొగఁడుచున్నా' రనెను.

గోసాయీలు దీపములు దీసికొని దగ్గఱించుటను గని, “నేను కాపురుషుఁడను. నీవు విడిచిపెట్టుము, నేను పాఱిపో యెద’ ననియెను.

శాంతి—నీబలమును జూపి విడిపించుకొనుఁము.

జీవానందుఁడు లజ్జచే స్త్రీచేతిపట్టును విడిపించుకొనఁ జాల నని నుడువుటకు సిగ్గయి, ‘నీవు చాల పాపిష్ఠురాల’ వని చెప్పెను.

శాంతి, చిరునగవుతో విలోలకటాక్షమును బ్రసరింపుచు, ‘ప్రాణాధికా! నేను నీయందు బద్ధానురాగనై యున్నాను. నేను నీ దాసిని, కావలయు ననియే యిటకు వచ్చితిని. నన్ను గ్రహింపుము. గ్రహింతు నన్నచో విడిచిపెట్టెద’ ననియెను.

జీవానంద—దూరముగా పో. పాపీ! దూరముగాపో, ఇట్టిమాటను నేను వినఁజాలను.

శాంతి— నేను పాపినే. అందులకు సందేహము లేదు. అట్లు కాకున్నచో స్త్రీనై పుట్టి పురుషునిచెంతకు వచ్చి ప్రేమ భిక్ష నడుగుచుంటినా? నేను చెప్పినప్రకారము చేయుము, విడిచిపెట్టెదను.

జీవానంద—ఛీ, ఛీ, ఛీ,! నేను బ్రహ్మచారిని—నాకిట్టి మాటఁ జెప్పఁదగినదికాదు. నీవు, నాయొక్క—

వెంటనే శాంతి, భయముచేత ‘యూరకుండు మూర కుండుఁము, నేను శాంతి’ ననియెను.

ఇట్లుచెప్పి శాంతి జీవానందుని విడిచి యతని పాదధూ ళిని శిరస్సున ధరించుకొని చేతులుమోడ్చి, ‘ప్రభూ! అపరా ధమును మనంబున నుంచకుము. అయినను, పురుషుల ప్రీతి

విళ్వాపముల నటనను గాల్పుము. నన్ను గుర్తింపకపోతిరి !'
అనియెను.

అప్పుడు జీవానందుని మనస్సునకు జరిగిన దంతయుఁ బ్రస్ఫుట మాయెను. శాంతిగాక మఱెవ్వ రీపని చేయుదురు ? శాంతితప్ప ఇట్టిచమత్కారమును జేయుట కెవ్వరు సమర్థులు ? శాంతికి గాక, మఱెవరిబాహువులయం దింతటిబలము గలదు ? ఇట్లు చింతించి యానందభరితుఁడై అప్రతిభుఁడై యేమో చెప్పందొడంగెను. అయినను, అవకాశము లేకపోయెను. గోసాయీలు వచ్చిచేరిరి. ధీరానందుఁడు ముస్ముందుగా వచ్చి, జీవానందునిఁ గూర్చి 'యిదేమి గల్లంతు' అనెను.

జీవానందుఁ డేమని యుత్తర మియ్యఁగలడు? శాంతి ఆసమయమున వానిచెవిలో 'నన్ను నీవుపట్టుకొని యుంటి వని యెట్లుచెప్పుదు' నని చెప్పి, కొంచెమునవ్వి, ధీరానందుని ప్రశ్న కుత్తరముగా—గల్లంతు జరిగెను. ఎవతె యోయాడుఁది యఱచుచుండెను. అది తనపాతివ్రత్యమును భంగపఱిచిరనికూసెను. ఎచ్చటనో తెలియలేదు, జీవానందుఁడును వెదకెను, నేనును వెదకివెదకి వేసారితిని. ఎవరును గనుపడలేదు. మీరందఱు నొక్కసారి యీయడవియందు వెదకిన బాగుగ నుండును. ఆవైపున దూరముగా అఱచినశబ్దము వినవచ్చెను, అనిచెప్పెను.

శాంతి గోసాయీలకు నిబిడ మగు నరణ్యమును జూపెను. జీవానందుఁడు శాంతినిఁగూర్చి 'వైష్ణవుల కింతటి తొందర యిచ్చుటవలన నీ కేమిఫలము ? ఆవనంబున కేఁగినచో, వారు మరలి రా వీలగునా? పామే కఱచునో, లేక, పులియే తినునో యనెను.

శాంతి—స్త్రీ పేరు చెప్పియుండుటవలన వైష్ణవులు కొంచెము ప్రయాసపడిరిగాని, వెనుకకు రాఁ జాలరు. వలదనినచో వెనుకకు మఱలివచ్చునట్లు చేసెదను.

ఇట్లనిచెప్పి శాంతి గోసాయీలను బిలిచి 'తాము కొంచె మాలోచింపవలయును. ఒకవేళ భూతప్రేతపిశాచములై యుండినను ఉండవచ్చును. వానిమాయచే నిట్లగుటయు కల' దనెను.

దీనిని విని గోసాయీలలో నొకఁడు 'ఇది సరియైనమాట సందేహము లేదు. లేకుండినచో స్త్రీ యెక్కడనుండి వచ్చె' ననియెను.

గోసాయీ లందఱు నదే యభిప్రాయము కలవారైరి. భౌతికమాయ యని యనుకొని యందఱును తమతమ నెలవులకుం జనిరి.

జీవానంద—రా, యిచ్చటనే గూర్చుందము. ఇదంతయు నాకుఁ దెలియఁజెప్పుము. నీవిచ్చటి కెట్లు వచ్చితివి? ఎందులకై వచ్చితివి ? ఈవేషమేల ఇంత చమత్కారము లెక్కడ నేర్చితివి?

శాంతి—నేను నీకొఱకే వచ్చితిని. ఎట్లువచ్చితి నందువా నడిచియే వచ్చితిని. ఈ వేష మేలయందువా ? నాయిష్టము. ఇంత చమత్కారము నెచట నేర్చితి ననఁగా, ఒకపురుషుని యొద్ద నేర్చితిని. ఇదంతయు సవిస్తరముగాఁ జెప్పెదను. ఈ యడవియం దేల కూర్చుండి యుండవలయును ? నీ లతాకుంజంబునకుఁ బోదము రమ్ము, అని పిలిచెను.

జీవానంద—నాకు కుంజ మెక్కడిది ?

శాంతి—మఠమందు.

జీవానంద—అచ్చటికి స్త్రీలు పోరాదు.

శాంతి—నేని స్త్రీని కాదు గదా?

జీవానంద—నేను స్వామియాజ్ఞ నుల్లంఘింపఁజాలను.

శాంతి—నాకు స్వామియాజ్ఞ యై యున్నది. కుంజమునకుఁ బోయిన పిదప నంతయుఁ జెప్పెదను. నే నింటికిఁ బోవక గడ్డమును మీసమును తీయను. గడ్డమును తీయకుండినచో నీ పాడుమూతిదానిని నీవు గుర్తింపవు, ఛీ! పురుష జాతి యెటువంటిది!



## ఇరువదియాఱవ ప్రకరణము

### సంతానులు తమపరాక్రమమును జూపుట

కడచిన డెబ్బదియాఱవ సంవత్సరము సంపూర్ణ మాయెను. బంగాళాదేశమునందు నాల్గుపాళ్లో యెనిమిదిపాళ్లో లేక యున్నికోట్లజనులలో దాని నెవరు చెప్పఁగలరు? ఎందఱినో యమపురికిఁ బంపివేసి యాదుర్వత్సరము తానును కాలగ్రాస మొందెను. డెబ్బదియేడవసంవత్సరమున దేవుఁడు సుప్రసన్నుఁ డాయెను. సువృష్టి కలిగెను. పృథ్వి సస్యశాలిని యాయెను. జీవమాత్రావశిష్టులు కడుపు నిండుగ భుజించిరి. అనాహారులై యుండినవారును, అల్పాహారులై యుండినవారును, పూర్ణాహారము నొక్కటేసారి తిని, యఱిగించుకొనలేక మృతులైరి. పృథ్వి సస్యశాలిని యాయెనుగాని, జనశూన్యము. గ్రామం

బులలోని యిండ్లు పాడుపడి పశుపక్షులకు విశ్రామభూమిలై ప్రేతభీతికిఁ గారణమాయెను. పంటభూములను సాగుబడిచేయు వారులేక, బీడుపడి గడ్డి పెరిఁగి యుండెను. దేశమంతయు కానవనమువలెఁ గన్పట్టెను. ఎచ్చట శ్యామలకోమల మగు సస్యరాశి ప్రకాశించుచుండునో; ఎచ్చట అసంఖ్యాకములగు పశుపక్షులు మేయుచుండునో; ఎయ్యది గ్రామమం దుండు యువకయువతులు గుంపుచేరి యామోద ప్రమోదంబులఁ జేయుచుండిన యుద్యానభూములుగా నుండునో; అవియన్నియు ఘోరతరమైనవనంబగుచు వచ్చెను. ఒకయేఁడు కడచెను; రెండేండ్లుచెల్లెను, మూఁడేండ్లాయెను. కాననము మఱింత వృద్ధియగుచు వచ్చెను. ఏస్థలము మనుష్యుని సుఖంబున కాటపట్టై యుండెనో యది నరమాంస లోలుపమైన వ్యాఘ్రాదులకు వాసస్థలమాయెను. ఎచ్చట సుందరీమణులు గుంపుచేరి యలకాంకిత చరణంబులయందలి గజ్జెలు, పిల్లాండ్లు, గొలుసులు, మెట్టులు ఈ మొదలగు నాభరణములు ఘల్లు ఘల్లున శబ్దము చేయఁగా నెచ్చెలులతో సరససల్లాపము లాడుచు పకపకనవ్వుచుఁ బోవుచుండిరో యాస్థలములయందు భల్లూకములు బిలంబులను ద్రవ్వికొని పిల్లలను కని లాలన పాలన చేయ నారంభించెను. ఎచ్చట పిన్నవాండ్రు పిన్నవయసున సంధ్యాకాల మల్లికా కుసుమమువలె ఉత్ఫుల్లహృదయులై యాటపాటలఁ బ్రొద్దుపుచ్చుచు సంచరించుచుండిరో యాస్థలములయందు మత్తగజంబులు చెట్లకొమ్మలను లాగుచుఁ దిరుగుచుండెను. ఎచ్చట దుర్గోత్సవములు జరుగుచుండెనో యచ్చట సృగాలావాస

మయ్యెను. నాట్యమందిరములందు విషసర్పములు పగటియందే కప్పలను వెదకుచుండెను. పంటపండునుగాని, తినుటకు జనులు లేరు. ధాన్యముపండినను ధనము లేదు. కొనువారే లేరు. జమీందారులు కప్పముల నిచ్చుటకు శక్తిలేనివారైరి. వారికి రైతు లియ్యవలసిన పన్ను నియ్యరు. రాజు జమీందార్లను జప్తుచేసినందుచే హృతసర్వస్వులై దరిద్రు లగుచు వచ్చిరి. భూమాత సుప్రసూతియాయెను. అయినను సొమ్ము పుట్టదు. ఎవ్వరింటియందును ఒకకాసైనను లేదు. ఎవని చేతికి దొరకినదానిని వాఁడే తినుచుండెను. దోపిళ్లు, దొంగతనములు ప్రబలమాయెను. సాధుశీలుఁడు భీతిచే నిల్లు విడిచి కదలక తలదాఁచుకొని యుండెను.

ఇచట సంతాన సంప్రదాయస్థులు నిత్యమును చందన పుష్ప తులసీదళములచే విష్ణుపాదపద్మంబులను పూజచేయుచు నెవరి యింటియందైనను తుపాకి పిస్తోలు లుండినచో వానిని దీసికొని వచ్చుచు నుండిరి.

భవానందుఁడు, 'భ్రాతృలారా! ఇండ్లయందు పద్మరాగ వజ్ర వైడూర్య ప్రవాళాదు లుండినను వానిని తాఁకక, విరిగిపోయిన తుపాకిగా నుండినను వానినిమాత్రము తీసికొనిరం' డని చెప్పుచుండెను.

సంతానసేనాధిపతులు ఒక్కొకగ్రామంబునకును దమ యనుచరులను బంప నారంభించిరి. అనుచరులు గ్రామంబులకుఁ బోయి యచ్చట హిందూజనులను జూచినను వారినిఁ గూర్చి విష్ణుపూజ చేయుదురా? యని యడుగుదురు. ఇట్లు చెప్పుచు ఇరువదిముప్పదుగురు గుంపుగాఁ జేరి ముసల్మానుల

గ్రామములపైఁబడి వారియిండ్లను కాల్చుచుండిరి.. ముసల్మానులు ప్రాణరక్షణయందు వ్యస్తులై యున్నప్పుడు వారి సర్వస్వమును సంతానులు దోఁచుకొనిపోయి దానిని క్రొత్తఁగా వచ్చిన విష్ణుభక్తులకు పంచి యిత్తురు. కొల్లలో దొరకినభాగముతో గ్రామనివాసులు తృప్తులుకాఁగనే వారినిఁ బిలిచికొని వచ్చి విగ్రహముల పాదస్పర్శచేయించి వారిని సంతానులుగఁ జేయుదురు. జనులు సంతానత్వమునందు విలక్షణమైన లాభము కలదని భావించిరి. విశేషముగా తురకల రాజ్యమందు సరిగాని యనాయకత్వమును గాంచి, యందఱును వారియందు విరక్తులైరి. హిందూధర్మము లోపముగా నుండిన కారణముచే ననేకహిందువులు హిందూమతమును స్థాపించుటకు ప్రబలమగు నాతురము గలవారైరి కావున, సంతానులసంఖ్యవృద్ధిగైనది. దినదినము నూర్లకొలఁదిజనులు చేరుచుండిరి. అందఱును భవానందజీవానందుల పాదములపైఁబడి వారి యాజ్ఞాప్రకారము దండులోఁ జేరి తురకలను శాసింపఁబోవుచుండిరి. సర్కారునౌకర్లను ఎచ్చటఁ జూచినను పట్టి కొట్టుచుండిరి. కొందఱను జంపుటయుఁ గలదు. సర్కారు ధన మెచ్చటనుండినను కొల్లగొట్టి యింటికిఁ దెచ్చుకొందురు. తురకల గ్రామము కనఁబడినచో కాల్చి బూడిద చేయక వదలరు.

అప్పుడు నగరంబున మహారాజునకు హెచ్చరిక గలిగెను. సంతానులను శాసించుట కతఁడు సైన్యములను బంపనారంభించెను. అయినను, అదివఱకే సంతానులు బలవంతులై శస్త్రధారులై మహాపరాక్రమశాలులై యుండిరి. వారిదర్పమునకు తురకలసైన్యము నిలువక పోయెను. ఒకవేళ ముందు

నకువచ్చి నిలిచినను, సంతానులగుటచే వారు తురకలను ఛిన్నభిన్నముచేసి హరిధ్వని చేయుచుండిరి. సంతానుల బలమును యవనసైనికులు పాఱఁద్రోలినను, అప్పుడే యెక్కడనుండియో వేఱొకసంతానులగుంపు వచ్చి తురకల తలలను నరికి పాఱవైచి "హరీ హరీ" యని వెడలిపోవుదురు. రాజైన అసదుల్‌జమానునకు మిక్కిలి కష్టము సంభవించెను. వాఁడు అనేకములైన ఫిరంగులు మందు గుండ్లు ఏనుఁగులు గుఱ్ఱములు ఇంకను కావలసినవానిని బంపెను. అందువలనఁగూడా సంతానుల "జయజగదీశహరే" యను నినాదము నివారణము కాలేదు. అసదుల్‌జమానుఁడు తాను రాజ్యచ్యుతుఁడగుదుననియే నిశ్చయించెను.

అపుడతఁడు దుఃఖితుఁడై యాంగ్లేయులకు జాబు వ్రాసెను. ఎట్లనః—'నేనిప్పుడు నేలపన్నురూపాయలను వసూలుచేయుట కేమిచేసినను సాధ్యపడలేదు. ఇరసాలు పంపలేను; ఇప్పుడు మీరు రక్షించితిరేని పిదప వసూలు చేయవచ్చును; లేనియెడల మీరే వచ్చి వసూలు చేసికొనవలయును'.

ఆంగ్లేయులు మొదట కొన్నిచోట్లయందు తామే పన్నులు వసూలుచేసికొనుచుండిరి. అయిన, నిప్పుడు వారి ప్రయత్నము విఫలమగుచు వచ్చెను. ఈసమయంబున ప్రథితనామకుఁడగు భారతవర్ష యింగ్లీషుకులోత్పన్నుఁడైన ప్రాతస్సూర్యుఁడోయనునట్లు ప్రకాశించెడు వారన్‌హేస్టింగ్సు భారతవర్ష గవర్నరు జనరలుగా నుండెను. అతఁడు కలకత్తాలో కూర్చుండి యొకయినుపగొలుసును ముందిడుకొని మనస్సునందీయొక్క గొలుసుతో నీసనాగరద్వీపభారతభూమిని కట్టి

వేయుదు నని తలంచుకొనెను. ఒక్కనాఁడు జగదీశ్వరుఁడు సింహాసనాసీనుఁడై నిస్సందేహముగాఁ "తథాస్తు" అనెను. అయి నను, ఆ దినము దూరముగా నుండెను. సంతానులభీషణమగు హరిధ్వనికి వారన్ హేస్టింగ్సుకూడా కంపితుఁడాయెను.

వారన్ హేస్టింగ్సు మొదట ఫౌజుదారి సైన్యమువలన సంతానుల రాజవిద్రోహము నణఁగింపఁ బ్రయత్నపడెను. అయినను, ఫౌజుదారి సిపాయీలవ్యవస్థ చాల చెడిపోయి యొకముసలిదాని నోటనుండి హరినామము వినినను భయపడి పాఱిపోవునట్టి స్థితిలో నుండెను. కావున వారన్ హేస్టింగ్సు నిరుపాయుఁడై దక్షుఁడగు కేప్టన్ థామస్ అనునొకసైనికుని యధినాయకునిగాఁ జేసి కంపెనీసైన్యమును విద్రోహనివారణా ర్థమై వీరభూమి ప్రదేశంబున కంపెను.

కేప్టన్ థామసు వీరభూమినిఁ జేరి, యచటరాజవిద్రోహ నివారణవిషయమై యత్యుత్తమములైనయేర్పాట్లుచేయనారం భించెను. రాజుయొక్కసైన్యమును, జమీందారులసైన్యముల నడగితీసికొని యుద్ధంబున సుశిక్షితులగు కంపెనీసైన్యముతోఁ జేర్చి; వారిలో బలిష్ఠులైన దేశవిదేశవీరులను వెదకి సైనికు లను తయారుచేసెను. పిమ్మట, నాసైన్యమును గుంపులుగుంపు లుగా విడఁదీసి, యాగుంపులకు తగినవారిని యధికారులనుగా నియమించెను. పదంపడి, వారికి దేశదేశములను విభాగించి యిచ్చి మీరు వేటకాండ్రవలె పొంచియుండి యెచ్చట విద్రోహులు చిక్కినను చీమలను నలుపునట్లు ధ్వంసముచేయ వలయు నని చెప్పిపంపెను. కంపెనిసైనికులలోఁ గొందఱు గంజాయి, కొందఱు రం (నిషాగలిగించు సారాయి) త్రాగి, తుపా

కులను బారు చేసికొని సంతానుల వధకై వెడలిరి. అయినను, సంతానులసంఖ్య యెక్కువగా నుండినదేగాక, వారు అజయ్యులై యుండిరి. కేప్టన్ థామసుయొక్క సైనికులు, [కో]తకాలములో కొడవలికి దొరికినపైరువలె కత్తరింపఁబడిరి. హారిహారిధ్వనిచే కేప్టన్ థామసుయొక్క చెవులు చెవుడు వడెను. ఈవిధముగ 1776- వసంత్సరమునందు వీరభూమిలో సంతానులు ప్రసిద్ధి కెక్కిరి.

---

## ఇరువదేడవ ప్రకరణము

ఆకాలమున కంపెనీవారిచే పట్టుపనిచేయు కార్ఖానాలు స్థాపింపఁబడి యుండెను. శివగ్రామంబున నొకకోఠా రుండెను. డనివర్తుదొర అనువాఁడు కోఠారునకు ఫ్యాక్టరు(Factor) అనఁగా అధ్యక్షుఁడై యుండెను. కోఠారుల సంరక్షణవిషయమునందు తగినయేర్పాట్లు కలిగియుండెను. డనివర్తుదొర యెట్లో తన ప్రాణరక్షణము చేసికొని వసించుచుండెను. అయినను, వాఁడు తనభార్యను బిడ్డలను కలకత్తాకుఁ బంపి యుండెను. ఇట్లుండినను వానికి సంతానుల యుపద్రవము తప్పలేదు. ఈసమయమున నాప్రదేశంబునకు నాలుగైదు పటాలములతోడ కేప్టన్ థామసువిజయముచేసి యుండెను. క్రొత్తగాఁ జేరిన మాలలు మొదలగు నీచజాతి సంతానులు కొందఱు పరధనాపహారణంబునందు తాత్పర్యులై యుండిరి. కేప్టన్ థామసుదొరవారు సైన్య

మునకై మంచి బియ్యము నెయ్యి గోధుములు మొదలగువా నిని బండ్లపై తెప్పించుచుండిరి. దానిం గని నోట నీరూరి నూ తనముగ సంతానులైన మాలలు ఆబండ్ల నడ్డగించిరి. అయిన ను, వారు థామసుయొక్క సిపాయీలచేత నుండిన తుపాకుల దెబ్బల కోర్వక, వెన్నిచ్చి పాఱిరి. కేప్టన్ థామసు తత్క్షణమే కలకత్తాకు వ్రాసిన దేమనఁగా:—

ఈదినము నూట యేఁబది యేడ్గురు కంపెనీసిపాయీలను దీసికొనిపోయి పదునాల్గు వేల నేడునూర్ల రాజవిద్రోహులను పరాజయ మొందించితిని. ఈరాజవిద్రోహులలో రెండు వేల నూట యేఁబదిముగ్గురు హతులైరి; వేయియు నిన్నూటముప్పది ముగ్గురు గాయ మొందిరి; ఏడ్గురు ఖైదీలుగాఁ జిక్కిరి. అని వ్రాసె ను—ఇందు తుదిమాటమాత్రమే సత్యము. కేప్టన్ థామసు, 'ఛ్లేనహీం' లేక రసవాకుని యద్ధమునందు జయము కల్గినదని తెలిసికొని గడ్డమును మీసమును దువ్వుకొనుచు నచ్చటచ్చట తిరుగుచుండెను. మఱియు డనివర్తుదొరతో, ఇంకేమి? రాజ విద్రోహము నివారణ మాయెను; నీపుత్త్రకళత్రములను కల కత్తానుండి రప్పించుకొనవచ్చు నని హెచ్చరిక చేసెను. డనివ ర్తు, 'అటులనే కానిండు; తా మిచ్చట నింకను పదిదినము లుండుఁ డు; దేశస్థితి యింకను గొంచెము స్తిమితమునకు రానిండు. తద నంతరము నాభార్యయు పిల్లలు వత్తు' రనియెను. డనివర్తునింట చాల గొఱ్ఱెలును కోళ్లును నుండెను. ఉత్తమ మైన పన్నీరును నానావిధము లగు అడవిపక్షులును మృగములును నతనిభోజన మునకు సిద్ధ మగుచుండెను. గడ్డముపెంచినవాఁ డొక బబ్బర్చి

రెండవ ద్రౌపదియైయుండెను. అందువలన, థామసు హెచ్చు మాట చెప్పక నచ్చుటనే యుండెను.

ఇచట, భవానందుఁడు పండ్లు కొఱుకుచు మనస్సుననె ప్పు డీకేప్టన్ దొరతలను ఖండించి శంబరారి యనుపేరు పొం దుదునో యని యాలోచించుచుండెను. ఆంగ్లేయులు హిందూ స్థానదేశము నుద్ధరించుటకై వచ్చియున్నారని సంతానులెఱుఁ గరు. ఎట్లు తెలిసికొందురు? కేప్టన్ థామసుయొక్క సమసాదు యిక లగు నితర యింగ్లీషుజనులను వారెఱుఁగరు. అప్పటి యింగ్లీషువారి మనస్సులోని యుద్దేశ్యము భగవంతుని యిష్ట మునందుమాత్రమే యుండెను. భవానందుఁడు, తనమనసునం దీయసురులను నాశము చేసివేసెద; అందఱు నొకటిగా చేరనిమ్ము; వారేమరి యుండనిమ్ము; నేను కొంచెము దూరముగనే యుండె దనని యీవిధముగాఁ దలపోయుచుండెను. సంతాను లందఱును మఱుగున నుండిరి. కేప్టన్ థామసు నిష్కంటకముగ ద్రౌప దియొక్క గుణగ్రహణంబున నివిష్టచిత్తుఁడై యుండెను.

థామస్ సికారియం దిష్టము గలవాఁడు. అప్పుడప్పుడు శివగ్రామ సమీపమునఁగల యరణ్యమునకు వేటాడుటకేఁగుట కలదు. ఒకనాఁడు డనివర్తుతోఁగూడిఁ గుఱ్ఱమునెక్కి కొందఱు వేటకాండ్రనుఁ బిలిచికొని పోయి యుండెను. థామసు అస మసాహసికుఁడై బలపరాక్రమంబులయం దాంగ్లేయజాతివారి లో సాటిలేనివాఁడై యుండెను. ఆయరణ్యము పులులు ముండ్ల పందులు ఎలుఁగుగొడ్లు మొదలగు దుష్టమృగముల కావాసస్థా నమై యుండెను. జను లచ్చటికిఁ బోవుటకు భయపడుదురు.

థామసు ఆయడవిలోఁ గొంతదూరము పోయిన పిదప వెంటవచ్చిన వేఁటకాండ్రు ముం దడుగిడరైరి. ఇఁకముందు మార్గము లేదు; కనుక, పోవుటకు సాధ్యపడ దని వెనుక నిలిచి పోయిరి. డనివర్తుఁ డొకానొకప్పు డాయరణ్యమధ్యమున పులి చేతికిఁ జిక్క పడరానిపాట్లు పడి యుండెనుగాన, నది జ్ఞాపకమునకు వచ్చినందున వాఁడు ముందుపోవుట కిష్టపడలేదు. అందఱును వెనుకకుఁ దిరిగి పోవలయునని చెప్పిరి. కేప్టను దొరమాత్రము ఎవరు ఎన్నివిధములఁ జెప్పినను వినక మీరు పొండు, నేను వచ్చుటలే దనిచెప్పి, యామహారణ్యమధ్యమునం బ్రవేశించెను.

ఆయరణ్యమధ్యమున మార్గమే లేదు. గుఱ్ఱము పోవుటకును త్రోవ లేదు. కనుక గుఱ్ఱమును విడిచిపెట్టి భుజముపై తుపాకి నుంచికొని యొక్కఁడే యరణ్యమునఁ బోయెను. అచ్చటచ్చట, పులిని వెదకుచుఁ బోయెనుగాని దొరకలేదు. చూచిన దేమి? ఏదియో జంతువు ఒక్క పెద్దచెట్టుక్రింద ప్రస్ఫుటమగువికసితకుసుమయుక్తలతాగుల్మంబులచే నావరింపఁబడిన ప్రదేశమందు కూర్చుండియున్నట్లు కనుగొనెను. ఆ దేమి? పులియా? పులి కాదు. ఒకసన్న్యాసి. అతని తేజము వనమునంతయు ప్రకాశింపఁ జేయుచుండెను ప్రస్ఫుటితమైనపుష్పము లాదేవసదృశం బగు శరీరసంసర్గముచే నధికసుగంధయుక్త మయ్యెను. కేప్టను థామసు విస్మితుఁ డాయెను. విస్మితుఁ డగుటయేగాక, కోపమును వహించెను. థామసునకు దేశభాషచక్కఁగావచ్చియుండెను, గాన, 'నీవు యెముఁడ' వని యడిగెను (ఎవఁ డనుటకు బదులుగా యెముఁ డని చెప్పియుండును.)

సన్న్యాసి—నేను సన్న్యాసిని.

కేప్టన్—నీవు ( Rebel ) (రాజద్రోహివి).

సన్న్యాసి—అట్లనఁగా నేమి?

కేప్టన్—నేను నిన్ను గుండుతోఁ గాల్చెదను.

సన్న్యాసి—కాల్చుము.

కేప్టను తన మనస్సులో కాల్చి వేయుదునా? వద్దా ? అని యాలోచించుచుండునంతలో, మెఱుము వేగమువలె యా నవీనసన్న్యాసి వానిపైఁబడి చేతియందుండిన తుపాకిని లాగు కొనెను. సన్న్యాసి వక్షావరణచర్మమును లాగివేసెను. మీసమును గడ్డమును పీకి పాఱవైచెను. థామసు చూచుచుండఁగనే యొక యపూర్వమగు సుందరస్త్రీమూర్తిగా నిలిచెను. సుందరి చిరునగవుతో, 'దొరగారూ! నే నాఁడుదానను; ఎవ్వరిని తొందరపెట్టను; హిందువులకును తురకలకును ఘోరరణము జరుగుచుండఁగా, మధ్య మీరేల రావలయును? మీరు ఇంటికి మరలి పొండు' అనియెను.

థామస్—నీ వెవరు?

శాంతి—చూడుము, నేనాఁడుదానను ఎవరితోఁ బోరుటకై నీవు వచ్చి యున్నాఁడవో వారిలో నే నొక్కని భార్యను.

థామస్—నీవు నాగుఱ్ఱముపైఁ గూర్చుందువా?

శాంతి—ఏల? నీకు ఉపపత్ని నగుటకా?

థామస్—యజమానురాలుగా—అయినను పెండ్లి చేసికొనను.

శాంతి—నేను జెప్పవలసిన దొకటి యున్నది. మాయింటియం దొక అందమైన కోఁతి యుండెను; అది చచ్చిపోయెను.

పంజరము ఖాలీగా నున్నది. ఆపంజరములో నిన్నుంచి మంచి కల్లు పోసెదను; నీవు వచ్చెదవా? మఱియు మాతోఁటలో మంచి రసదాళి యరఁటిపండ్లుకూడ యున్నవి.

థామస్—నీవు మంచి వీరాంగన (spirited woman) గా నున్నావు. నీధైర్య శౌర్యములను (courage) గాంచి, నాకు చాల సంతోష మైనది; నీవు నాగుఱ్ఱముపై నెక్కుము. నీస్వామి యుద్ధమునఁ జచ్చిపోయినయెడల నీ వేమగుదువు?

శాంతి—సరియే, అయినను మన మొకశపథము చేసి కొందము. యుద్ధ మింకను రెండుమూఁడు దినములలో ప్రారంభ మగును; నీవు జయించితివేని నేను నీకు ఉపపత్ని నయ్యెదను; మేము జయించితిమేని, నీవు జీవించి యుంటివేని, మా పంజరమున వసించి పండ్లు తినుచుండెదవా?

థామస్—అరఁటిపండ్లు తినుటకు ఉట్టము మైనది (ఉత్తమ మైనది). ఇప్పు డున్నదా యేమి?

శాంతి—తీసికొనుము, నీతుపాకిను తీసికొనుము. ఇట్టి క్రొత్తజయశాలురతో నెవ్వరు మాటలాడఁగలరు?

శాంతి తుపాకీనిఁ బాఱవైచి నవ్వుచు వెడలి పోయెను.

---

## ఇరువదెనిమిదవ ప్రకరణము.

### శాంతి భర్తకు హితము చెప్పుట

శాంతి హరిణ వేగముతో వనమధ్యమం దెచ్చటికో పోయెను. కొంచెము సేపటికి థామసు స్త్రీకంఠమునుండి మధుర మైన సంగీతమును వినెను.

ఈ యౌవన జలతరంగ వరోధిపుఁ డెవఁడో?
హారే మురారే! హారే మురారే!

మురల నెచ్చటనో సారంగ మధురధ్వని వినఁబడెను.

ఈ యౌవన జలతరంగ వరోధిపుఁ డెవఁడో?
హారే మురారే! హారే మురారే!

దానితో పురుషకంఠమును జేరి సంగీతము వినఁబడెను.

ఈ యౌవన జలతరంగ వరోధిపుఁ డెవఁడో?
హారే మురారే! హారే మురారే!

మూఁడు స్వరములు నొకటిగాఁ జేరి వనలతలనెల్లఁ గంపించెను. శాంతి గానము చేయుచు వెడలి పోయెను.

ఆ దట్టమగు వనమున నేమి యుండినదియు బయట నుండి చూచిన గోచరము కాదు. శాంతి, యా వనమధ్యమునఁ బ్రవేశించెను. అచ్చట శాఖాపల్లవరాశియం దొక చిన్న కుటీర ముండెను. అది మ్రానికొమ్ములచేఁ గట్టఁబడి యాకులచేఁ గప్పఁబడి యుండెను. అంవలిగోడలు తడికెలు కట్టి మట్టిచే నలకబడినదిగ నుండెను. దానితలుపు లతలచే నల్లఁబడి యుండెను. ఆతలుపును దెఱచుకొని శాంతి ప్రవేశించెను. అచ్చట జీవానందుఁడు సారంగమును వాయించుచుఁ గూర్చుండి యుండెను.

జీవానందుఁడు శాంతినిఁ జూచి, 'ఇన్నిదినములకు జలతరంగము పొంగి ప్రవహించెనా?' యనెను.

శాంతి నవ్వి, 'ఆనకట్ట కట్టఁబడినపిదప నుప్పొంగి ప్రవహించు టెట్లు? ' అని యుత్తర మొసంగెను.

జీవానందుఁడు కందిన మోముకలవాఁడై, చూడుము, 'శాంతీ! ఒకనాఁడేమో నాకు వ్రతభంగము కలిగి నాప్రాణము ఉత్సర్గమై పోయి యుండెను. ఆపాపంబునకుఁ బ్రాయశ్చిత్తము కావలయును. ఇన్నిదినములకుఁ బ్రాయశ్చిత్తము జేసికొను చున్నాను. కేవలము నీకోరికచేతఁ జేసికొనలేదు. ఇఁక ఘోర యుద్ధము జరుగుటకు కాలవిళంబము లేదు. ఆయుద్ధ క్షేత్ర ముననే నాప్రాయశ్చిత్తము జేసికొనవలయును. ఈ ప్రాణ మును ద్యజింపవలయును. నేను చచ్చుపర్యంతము ఈబ్రహ్మ చర్యమే' అనెను.

శాంతి—నేను నీ ధర్మపత్నిని; సహధర్మిణిని; ధర్మ కార్యమునందు సహకారిణినై యున్నాను. నీ వతిశయ మైన గురుతర ధర్మంబును గ్రహించినవాఁడవు. ఆధర్మమునకు సహా యము చేయుటకే నేను ధర్మంబును గృహమునుత్యజించి వచ్చి నదానను. ఇరువురును జేరి ధర్మాచరణము నాచరింత మనియే కదా యిల్లు విడిచివచ్చి వనమున వసించుచున్నాను. నీ ధర్మ మును వృద్ధిచేసెదను. ధర్మపత్నినై యుండి ధర్మమును విఘ్నము చేయుదునా? వివాహము ఇహమునకు పరమునకు ప్రయో జనకారి. ఇహమునకు మాత్రమే నేను నిన్ను వివాహ మాడ లేదు. దానిని నీ వెఱుంగుదువు. మన వివాహము పరలోక ప్రయోజనమునకునై యున్నది. పరమున ఫల మొకటికి రెం డింత లగును. ప్రభూ! నీవు నాకు గురుఁడవు. నేను నీకు ధర్మ మును జెప్పఁగలనా? మఱియు నీవు వీరుఁడవు, నీకు వీరవ్రత మును నేర్పఁగలనా?

జీవానందుఁ డాహ్లాదముచే గద్గదకంఠుఁడై—నీవు నేర్పియే నేను నేర్చికొంటిని, అనెను.

శాంతి ప్రఫుల్లచిత్తయై—ఇంకను వినుము; గోసాయీ! ఇహామందే మన వివాహము నిష్ఫలమా? నీవు నన్నుఁ బ్రేమించుచున్నావు. నేను నిన్నుఁ బ్రేమించుచున్నాను. ఇంతకంటె ఇహామున నింకేమి యధిక ఫలము కావలయును? చెప్పుము— "వందేమాతరం"

అపు డాయిరువురును జేరి యేకకంఠముతో "వందేమాతరం" అనుగీతమును పాడిరి. వారు గానము చేయుచు కన్నీరు నించి యేడ్చిరి

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

భవానందుఁడు రాజనగరంబున కల్యాణితో సంభాషించుట

భవానందగోస్వామి, యొక్కసారి రాజనగరంబునకు వచ్చి ప్రశస్తమైన రాజవీథిని విడిచి చీఁకటిగా నుండు నొక సందున బోయెను. ఆసందులోని ఇరుపార్శ్వములందును గొప్ప గొప్ప మేడయిండ్లు కలవు. సూర్యుఁడు మధ్యాహ్నసమయంబునమాత్ర మొక్కసారి తొంగిచూచును. మరల నెప్పటివలె నచ్చట నంధకారమే. ఆసందులో నొక రెండంతస్తుల సౌధమునందు భవానందుఁడు ప్రవేశించెను. మొదటియంతస్తులో నొక చిన్నయింటియందు ఏఁబదియేండ్ల యాఁడు దొకతె వంట

చేయుచుండెను. అచ్చటికిఁబోయి భవానందమహాప్రభువు దర్శన మొసంగెను. ఆయాఁడుది యర్ధవయస్కురాలును, నల్లని యాకారమును, బలిసినశరీరమును గల్గి, ఎఱ్ఱచీరెనుధరించి యుండెను. చెక్కిళ్లపై పచ్చ పొడిపించుకొని యుండెను. నీరుంత ప్రదేశమున కేశదామము చూడాకారముగ శోభిల్లుచుండెను. గరిటెను తపెలయందుంచి "ఠణఠణ" శబ్దముచేయుచుఁ ద్రిప్పుచుండెను. అలకావళి కేశగుచ్ఛ మటునిటు నెగురుచుండెను. తనలోదానే యేమేమో చెప్పుచుండెను. ఆమె ముఖభంగి వికారమైనపు డంతయు తలమీఁది చూడాకారమైన ముడి నానాప్రకారములుగ నల్లాడుచుండెను. ఇట్టిసమయమున భవానందప్రభువు ప్రవేశించెను. ప్రవేశించి, 'ఏమి, ఠాకూరాణీ! లేచిరా? నమస్కరించెద' ననియెను.

ఠాకూరాణి భవానందునిఁగాంచి, భయంపడి, చీరెను సవరించికొనుట కారంభించెను. మస్తకమున నున్న చూడాకార మగు ముడిని విప్పవలయు నని యిష్టము. అయినను అనుకూల పడ లేదు. ఏలన, చేతిలో గరిటె యుండినదేగాక చేయిని కడిగి కొనలేదు. నూనెచే మసృణమైన యా చికుర జాలమునందు, అయ్యో! అందులో పూజాసమయమున నొక వకుళపుష్పము చిక్కుకొని యుండెను. చెఱఁగుతో మూయుటకు యత్నించెను. అదియు సాధ్యము కాలేదు. ఏల? ఆ ఠాకూరాణి యైదుమూరల బట్టనే కట్టుకొని యుండెను. ఆ యైదుమూరల గుడ్డ మొదట గురుభారప్రణత మైన యుదర ప్రదేశమును జుట్టుకొని వచ్చుటలోనే చాలవఱకు సరి పోయినది. ఆమీఁద మిగిలినగుడ్డ దుస్సహాభారగ్రస్త హృ

దయమండలమును దాఁటి భుజముపై కెక్కి బలాత్కారమున కుడిచెవివఱకు వచ్చి, యింక ముందు పోలేనని ఖండితముగఁ జె ప్పెను. ఇఁక చేయునదేమి ? గౌరీఠాకూరాణి ప్రీడావనతు రాలై చెఱఁగును చేతఁబట్టుకొని, యింకముం దెనిమిదిమూరల వస్త్రమునే తీసికొనవలయు ననెడి దృఢప్రతిజ్ఞాబద్ధురాలై, 'గో స్వామీ ! నా కెందులకు నమస్కారమన్నా !' అనెను.

భవానంద—నీవు అక్కవుకాదా ?

గౌరి—మీదయ. మీరుగోస్వాములు. దేవసమానులు. ఎట్లు చెప్పినను సరియే సరిగా నుండును. నమస్కారము చేసి నను చేయవచ్చును. ఎటులైనను వయస్సున పెద్దదాననుకదా.

భవానందునికంటె గౌరీదేవి 30-35 సంవత్సరములు పె ద్దది. అయినను, చతురుఁడైన భవానందుఁడు, 'ఇదేమక్కా! వినోదంబునకుఁ జెప్పుచున్నట్లున్నది. లెక్కించి చూచిన, నీవు నాకంటె ఆఱేండ్లు చిన్నదానవు కదా ? జ్ఞాపకములేదా ? మా వైష్ణవజాతియం దన్ని మతములవారును గలరు. మఠాధి కారి యగు బ్రహ్మచారి యనుమతి నొంది నిన్నును వైష్ణవుల లోఁ జేర్చికొనవలయు నని యపేక్ష కలిగి చెప్పి పోవుద మని వచ్చితిని' అనెను.

గౌరి—ఛీ ! అదెట్టిమాట ! ఇట్లు చెప్పవచ్చునా? నేను ముసలిదానను కదా.

భవానంద—అట్లయినచోఁ జేరఁగూడదా?

గౌరి—మీ యిష్టము, మీకుఁ దెలిసినట్లు చేయుఁడు, మీరు పండితులు, నే నాఁడుదానను, నా కేమి తెలియును ? అది యొప్పు డగును ?

భవానందుఁ డతికష్టముచే నవ్వు నాపుకొని, 'అక్కా! ఆ బ్రహ్మచారినిఁ జూచిన వెంటనే యగును. మరియు, అది యట్లుండని, ఆవిడ యెట్లున్నది?' అని యడిగెను.

గౌరిదేవి వాడిన మోము గలదై మనస్సున, నన్నుఁ జేర్చికొనుట పరిహాసముగా నుండునని యనుకొని, 'యింక నెట్లుండఁగలదు? ఉన్నట్లే యున్న' దనెను.

భవా—నీవు పోయి, నేను వచ్చియున్నానని చెప్పిరమ్ము.

గౌరిదేవి, చేతనున్న గరిటెను పాఱవైచి చేతులు కడిగికొని, పైకి పోవునట్టి మిద్దెయొక్క పెద్దపెద్ద మెట్లు వంగుచ నెక్కి పోయెను. ఒక చిన్న యింటియం దొక చింపిరి చాపపై సుందరీమణి యొకతె కూర్చుండి యుండెను. అయిన నాసౌందర్యము నొకఘోరతర మగు ఛాయ నాచ్ఛాదించి యుండెను. మధ్యాహ్నకాలమునందు కులపరిపావనియు ప్రసన్నసలిలయు విపులజలకల్లోలినియు స్రోతస్వతియు నగు గంగావక్షమునందతి నిబిడ మైన మేఘచ్ఛాయవలె నేదో ఛాయ కప్పి యుండెను. నదీ హృదయంబున తరంగములు లేచుచుండెను; తీరంబునందలి పుష్పితతరుకులము వాయువుచేఁ దూఁగాడు చుండెను; మఱికొన్ని వృక్షములు ఘనపుష్పభారముచే వంగు చుండెను; ఆ గట్టులోని అట్టాలకాశ్రేణి మిక్కిలి శోభించుచుండెను; ఆ నదియందు చనెడి తరణీశ్రేణిచే తాడితమైన జలము తరంగరూపమున నాందోళిత మగుచుండెను. మధ్యాహ్నకాలమయినను, ఆ నిబిడమైన మేఘపంక్తి నీలచ్ఛాయయందు; సకలమైన శోభాకాంతులును నీలవర్ణమయ్యెను. అట్లే ఈ మెయొక్కమనోహరమును స్నిగ్ధమును చంచలమును నిబిడమునైన అలక

గుచ్ఛము కల్గియుండెను. ప్రశస్తమును పరిపూర్ణమునైన లలాట దేశంబునందు అతులమైన తూలికా (బ్రష్షు, లేక పెన్సిల్) లిఖిత భ్రూవిధనువుండెను. మునుపటివలెనే విస్ఫారిత సజలోజ్జ్వలకృష్ణ తారాబ్జహచ్ఛక్షువు లుండినను, అంతటి కటాక్షమయము కాదు, అంతటి లోలతయుఁ గాదు, కొంచెము నమ్రముగానుండెను. అధరము రాగవర్ణముగ నుండెను. హృదయము శ్వాసానుగామియై దడదడ కొట్టుకొనుచుండెను. బాహువులు మొదటియట్లే వన్యలతలకు దుష్ప్రాప్యమైన కోమలతతోఁ గూడి యుండెను. అయినను, ఇప్పుడా కాంతియు, ఆయుజ్జ్వలతయు, ఆ ప్రఖరతయు, ఆచంచలతయు, ఆ లావణ్యమును లేదు. విస్తరించి చెప్పనేల? ఇపుడు ఆయౌవనమే లేదు. ప్రకృతమునందు కేవలము సౌందర్యమును మాధుర్యమును మాత్రమే నూతనముగా నంకురించియుండెను. ఇంతకు మునుపు ఈయువతియొక్క ధైర్యగాంభీర్యములను జూచి యుండినచో, నీమె దేవలోకసుందరి యని దోఁచును. ఇపుడు చూడఁగా, నీమె శాపగ్రస్తురాలై దేవలోకమునుండి భూలోకమునకు వచ్చిన దేవి యని తెలియుచున్నది. ఈమె కూర్చుండి యుండిన నలుదిక్కులందును నాలుగైదు పెద్దపెద్ద పుస్తకములు పడి యుండెను గోడకు జగన్నాథ, బలరామ, సుభద్రాపటములు వ్రేలాడగట్టి యుండెను. మరియు కాళీయమర్దనము, నవనారీకుంజరము, వస్త్రాపహరణము, గోవర్ధనోద్ధారణము మొదలగు వ్రజలీలాచిత్రములు ప్రకాశించుచుండెను. ఆచిత్రముల క్రింద "చిత్రమో లేక విచిత్రమో" యని వ్రాయఁ

బడి యుండెను. గౌరిభవానందునిరాక నెఱింగించి వచ్చిన పిదప, భవానందుఁడు ప్రవేశించెను.

భవానంద—ఎట్లున్నది? కల్యాణీ! శరీర మారోగ్యముగ నున్నది కదా?

కల్యాణి—ఈప్రశ్న నడుగుటను మీరు మానరు కదా? నాశరీరారోగ్యమునందు మీ కిష్టమా? లేక నాకిష్టమా?

భవానంద—ఎవఁడు వృక్షమును వేయునో వాఁడు దానికి నీరు పోయును; చెట్టు వృద్ధి యైనచో వానికి సుఖము; నీ మృతదేహంబున నేను ప్రాణమును నాటినవాఁడను, వృద్ధి యగుచున్నదో లేదో యని నే నడుగఁ గూడదా?

కల్యాణి—విషవృక్షంబునకు క్షయము కలదా?

భవానంద—జీవనము విషమా?

కల్యాణి—అట్లు కాకున్నయెడల అమృతసేచనముగ నుండుదానిని ధ్వంసము చేయవలయు ననెడి కోరిక నా కేల కల్గును?

భవానంద—దానిని గుఱించి యడుగవలయునని చాల దినములనుండి నామనస్సునం దుండెను. అడుగుటకు ధైర్యము లేకుండెను. నీజీవనమును విషమయముగాఁ జేసినవా రెవరు?

కల్యాణి—స్థిరభావముతో నాజీవనము నెవ్వరును విషమయముగాఁ జేయలేదు. జీవనమే విషమయము; నాజీవనము విషమయము; తమ జీవనమును విషమయము; అందఱి జీవనమును విషమయమే.

భవానంద—ఔను; కల్యాణీ! నాజీవనము విషమయము. ఏదినము మొదలుకొని—, నీ వ్యాకరణము ముగిసెనా?

కల్యాణి—అంతయు ముగిసెను. కేవల స్త్రీత్వము మ. గియ లేదు.

భవానంద—అభిధానమో? (అక్షరమో).

కల్యాణి—స్వర్గమో వర్గమో తెలియనేరక పోయితిని. మీరు తెలియునట్లు చెప్పఁగలరా?

భవానంద—నీకుఁ దెలియని దానిని నేనును తెలుపఁగల. నా? సాహిత్యము మొదటివలె సాగుచున్నదా?

కల్యాణి—పూర్వాపరము నాకుఁ దెలియదు. కుమార సంభవమును విడిచిపెట్టి హితోపదేశమును జదువుచున్నాను.

భవానంద—ఏల? కల్యాణి!

కల్యాణి—కుమారసంభవమునందు దేవచరిత్రము; హితోపదేశమునందు పశుచరిత్రము.

భవానంద—దేవచరిత్రమును విడిచి పశుచరిత్రమందను రాగ మేల?

కల్యాణి—నానెత్తివ్రాత నాస్వామిసమాచార మేమి?

భవానంద—మాటిమాటికి వాని సమాచారము నేల యడిగెదవు? వాఁడేమో నీపాలిటికి. జచ్చినట్లే

కల్యాణి—నేనే అతనిపాలికిఁ జచ్చినట్లు; అతఁడు నా పాలిటికిఁ గాదు.

భవానంద—అతఁడు నీపాలిటికిఁ జచ్చెననికదా నీవ చచ్చినది? మాటిమాటి కామాట యేల కల్యాణీ!

కల్యాణి—చచ్చినను సంబంధము తప్పునా? అతఁ డె ట్లున్నాఁడు?

భవానంద—బాగుగా నున్నాఁడు.

కల్యాణి—ఎచ్చట నున్నారు? పదచిహ్నమునందేనా?

భవానంద—ఔను, అచ్చటనే యున్నాఁడు.

కల్యాణి—ఏమిపని చేయుచున్నారు?

భవానంద—అతఁడ దేపనిని చేయుచున్నాఁడు, కోట నిర్మించుట, అస్త్రనిర్మాణము అతనిచే నిర్మితములైన ఫిరంగి, గుండు, తుపాకి, మందు మొదలగునవి మనకుఁ గొఱఁత లేకున్నవి. సంతానులందు అతఁడే శ్రేష్ఠుఁడు. అతఁడు మన కందఱకును మహోపకారము జేసినవాఁడు. అతఁడే మన కుడిభుజము.

కల్యాణి—నేను ప్రాణత్యాగము చేయకున్నచో నివ న్నియు నగుచుండెనా? ఎవని ఱొమ్మునకు ఱాయి గుండు మన్ను కుండ కట్టఁబడి యుండునో, వాఁడు సంసారసాగరము నీదఁగలఁడా? కాలికి సంకిళ్లు తగిలించినచో పరుగెత్తఁగలఁడా? నీవు సన్న్యాసివై యీపాడుజీవము నేల పెట్టుకొని యున్నావు?

భవానంద—స్త్రీ సహధర్మిణి; ధర్మమునకు సహాయు రాలు.

కల్యాణి—కొద్దికొద్ది ధర్మంబులందు సహాయురాలు; పెద్దపెద్ద వానియందు కంటకురాలు. ముల్లును ముల్లుతోనే కదా తీయవలయును. కాఁబట్టి నేను విషకంటకముచేత నతని ధర్మకంటకమును బెఱికి వేసితిని—ఛీ! దురాచారపామర బ్రహ్మ చారీ! ఈప్రాణమును మరల నాకేల యొసంగితివి?

భవానంద—మంచిది; ఎవఁ డొసంగెనో యాప్రాణము వానియది కల్యాణీ! ఏప్రాణము నీకు నే నొసంగితినో, ఆప్రాణ మును నీవు నాకొసంగఁజాలవా?

కల్యాణి—నాబిడ్డ సుకుమారి యెట్లున్నదో, తెలియునా?

భవానంద—చాల దినములనుండి ఆసమాచారము తెలియలేదు. జీవానందుని నేను జూడలేదు. అతఁడు నేనుండు దిక్కున పోలేదు.

కల్యాణి—ఆబిడ్డసమాచారమును దెలియఁజేయలేవా? స్వామి నాకుఁ ద్యాజ్యము నేను ప్రాణముతో నున్నదానను గాన బిడ్డ నేల త్యాజ్యము చేయవలయును? ఇప్పటికిని సుకుమారి కనఁబడినచో నామనమునకు కొంచెము శాంతి కలుగును—నాకొఱకై యింతమాత్రము చేయరాదా?

భవానంద—చేయుదును, కల్యాణీ! నీబిడ్డను బిలిచికొని వచ్చి విడిచెదను. తర్వాత ?

కల్యాణి—తర్వాత నేమి ?

భవానంద—స్వామి ?

కల్యాణి—నా మనఃపూర్వకముగాఁ ద్యజించినాను.

భవానంద—ఆతనివ్రతము సాంగమైన పిదప?

కల్యాణి—అప్పుడు అతనిదాన నౌదును. నే బ్రతికి యుండుట యతనికి దెలియునా?

భవానంద—తెలియదు.

కల్యాణి—నీ వతనిని జూడలేదా ?

భవానంద—చూచినాను.

కల్యాణి—నన్నుఁగూర్చి ప్రస్తావన చేయలేదా ?

భవానంద—లేదు; చచ్చిపోయిన భార్యకును మగనికిని యేమి సంబంధము ?

కల్యాణి—ఏ మనుచున్నారు ?

భవానంద—నీవు పునర్వివాహము చేసికొందువా? నీకు పునర్జన్మ మైనది.

కల్యాణి—నాబిడ్డను తెచ్చి విడువుము.

భవానంద—తెచ్చి విడిచెదను, మరల వివాహము చేసికొందువా ?

కల్యాణి—నిన్నేనా ?

భవానంద—చేసికొనెదవా ?

కల్యాణి—నిన్నేనా ?

భవానంద—అట్లే యనుకొనుము.

కల్యాణి—సంతానధర్మ మెచ్చట నుండును ?

భవానంద—అతలజలమునందు.

కల్యాణి—ఈమహావ్రతమో ?

భవానంద—అతలజలమునందు.

కల్యాణి—ఎవరికొఱకై దీని నంతయు నతలజలమున ముంచెదవు ?

భవానంద—నీకొఱకే. కల్యాణీ ! మనుజుఁడేగాని, ఋషియేగాని, సిద్ధుఁడేగాని, దేవతయేగాని, చిత్తము అవశ మైనది. సంతానధర్మము నాప్రాణ మైయున్నది. అయినను, నేడు చెప్పెద వినుము. నీవు నాప్రాణాధికప్రాణము. నే నెన్నఁడు నీకుఁ బ్రాణదానమును జేసితినో నాఁటనుండి నేను నీపాదమూలమున విక్రీతుఁడనై పడి యున్నాను. ప్రపంచమునం దిట్టి రూపరాశి యున్నదని తెలియదు. ఇట్టి రూపరాశిని గన్నులతో నెన్నఁడైన జూడఁగల నని తెలిసి యుంటినేని, సంతానధర్మమునే కైకొని యుండను. ఈధర్మము ఈసంతా

నునియందు కాలి భస్మమగుఁగాక. ధర్మము పోయెను, ప్రాణము దక్కెను. ఇప్పటికి నాలుగేండ్లుగా ప్రాణము తడబడు చున్నది. పోదు, ఇఁక నిలువదు; దాహము! కల్యాణీ! దాహము! జ్వాల! కాల్చివేయుద మన్నను కట్టెలు లేవు, ప్రాణము పోవుచున్నది, నాలుగేండ్లు సహించితిని, ఇంక సహింపఁజాలను, నీవు నాదాన వయ్యెదవా?

కల్యాణి—సంతానులధర్మమందు ఇంద్రియము పరవశమైనచో దానికిఁ బ్రాయశ్చిత్తము మరణ మని నీవు చెప్పినావే, యది నిజమేనా?

భవానంద—నిజమే.

కల్యాణి—అటులైనచో నీకుఁ బ్రాయశ్చిత్తము మరణమో?

భవానంద—నాకుఁ బ్రాయశ్చిత్తము మరణ మొక్కటియే.

కల్యాణి—నేను నీయిష్టార్థమును నెఱవేర్చినయెడల నీవు చచ్చెదవా?

భవానంద—నిశ్చయముగాఁ జచ్చెదను.

కల్యాణి—నీయిష్టార్థము నెఱవేఱని యెడల?

భవానంద—అప్పటికిని మరణమే నాకుఁ బ్రాయశ్చిత్తము. ఏలనఁగా, నాచిత్తము ఇంద్రియవశమై యున్నది.

కల్యాణి—నీయిష్టార్థమును దీర్పఁజాలను; నీ వెపుడు చచ్చెదవు?

భవానంద—రాఁగల యుద్ధమునందు.

కల్యాణి—అట్లయినచో పో. నాబిడ్డను పంపెదవా?

భవానంద—(సాశ్రులోచనుఁడై) పంపెదను. నేను చచ్చిన పిదప నన్ను జ్ఞాపకము చేసికొనియెదవా ?

కల్యాణి—వ్రతచ్యుతుఁడైన అధర్మి వని జ్ఞాపకము జేసికొందును.

భవానందుఁడు వెడలి పోయెను. కల్యాణి పుస్తకమును జదువుచుఁ గూర్చుండి యుండెను.

---

## ముప్పదియవ ప్రకరణము

### భవానంద ధీరానందుల సంవాదము

భవానందుఁడాలోచనాక్రాంతుఁడై మఠమునకు వెడలెను. పోవుచుండఁగాఁ బ్రొద్దుగ్రుంకెను. అడవియందొక్కఁడే పోవుచుండెను. అచ్చట నెవఁడో యొకఁడు ముందు పోవుచుండెను. భవానందుఁ 'డెవరది' యని యడిగెను.

అగ్రగామి—అడుగువా రెవరు? తెలిసినచో నుత్తర మిచ్చెదను. నేను పథికుఁడను.

భవానంద—వందే.

అగ్రగామి—మాతరం.

భవానంద—నేను భవానంద గోస్వామిని.

అగ్రగామి—నేను ధీరానందుఁడను.

భవానంద—ధీరానందా! ఎచటికిఁ బోయి యుంటివి ?

ధీరానంద—నిన్ను వెదకుచు.

భవానంద—ఏల ?

ధీరానంద—ఒకమాట చెప్పుటకు.

భవానంద—అదేమి మాట.

ధీరానంద—నిర్జనస్థలమునఁ జెప్పఁదగినది.

భవానంద—ఇచ్చటనే చెప్పుము. ఇట నెవ్వరును లేరు.

ధీరానంద—నీవు నగరంబునకుఁ బోయి యుంటివా ?

భవానంద—ఔను.

ధీరానంద—గౌరీదేవి యింటికా?

భవానంద—నీవును నగరంబునకే పోయియుంటివా ఏమి?

భవానంద—అచ్చట నొక పరమసుందరియైన వనిత నివసించుచున్నదికాదా ?

భవానందుఁడు, కొంచె మాశ్చర్యపడి భయభ్రాంతుఁడై—ఇదేమి మాట ? యనెను.

ధీరానంద—నీవు దానిని చూచితివి గదా ?

భవానంద—ఆతర్వాత.

ధీరానంద—నీ వాయువతియం దనురక్తుఁడవై యున్నావా ?

భవానంద—(కొంచెము ఆలోచించి) ధీరానందా! ఈ యన్వేషణ మేల ఘటించెను ? నీవు చెప్పిన దంతయు నిజమే. నీవు దక్క మఱెవ్వ రెఱుఁగుదురు?

ధీరానంద—ఎవ్వరు నెఱుఁగరు.

భవానంద—అట్లయినపుడు నిన్నుగొట్టి చంపి నేను కళంక ముక్తుఁడను కావచ్చును కదా !

ధీరానంద—కావచ్చును.

భవానంద—అయినను రమ్ము. ఈ విజనస్థలమున మన మిరువురమును జగడము చేయుదము. నిన్నుఁజంపి నేను నిష్కంటకుఁడ నయ్యెదను. అట్లు గానిచో నన్ను నీవు చంపి నీకోపజ్వాల నంతయు నణఁగించుకొనుము. ఆయుధ మున్నదా?

ధీరానంద—ఉన్నది. ఉత్తచేతులతో నామాటలన్నియు నీతోఁజెప్పుటకు సాధ్య మగునా? యుద్ధమే నీమత మైయుండినచో నావశ్యకముగాఁ జేయుదును. సంతానులకు పరస్పరము విరోధము నిషిద్ధము. ఆత్మరక్షణార్థమై యెవరితో విరుద్ధము చేసినను నిషిద్ధము లేదు. అయినను, ఏమాట చెప్పుటకై నిన్ను వెదకుచుంటినో దాని నంతయు నీవు విన్నతర్వాత యుద్ధముచేయుట మంచిదికదా?

భవానంద—చెప్పుము బాధక మేమి?

భవానందుఁడు కత్తిని యొరనుండి తీసి ధీరానందుని భుజముపై నుంచెను. ధీరానందుఁడు భయఁపడి పరుగిడలేదు.

ధీరానంద—నేనేమి చెప్పుచున్నా ననఁగా, నీవు కల్యాణిని వివాహము—

భవానంద—కల్యాణి కది తెలియునా?

ధీరానంద—ఎందులకు చేసికొనదు?

భవానంద—దానికి మగఁడున్నాఁడు కదా?

ధీరానంద—వైష్ణవులం దిట్టివివాహము కావచ్చును.

భవానంద—అది పట్టిగొడ్డు సన్న్యాసి కాదు—సంతానులకు వివాహమే లేదు.

ధీరానంద—సంతానులధర్మ మపరిహార్యమా? నీప్రా

ణాము పోవుచున్నదే? ఛీ! ఛీ! నాగొంతు గాయ మాయెను. (వాస్తవముగా ధీరానందుని మెడనుండి రక్తము కాఱుచుండెను.)

భవానంద—నీవు నాకధర్మమును బోధించుటకు వచ్చితివా యేమి? నీకేమో స్వార్థ ముండవలయును.

ధీరానంద—దానినే చెప్పుట కిష్టము కలవాఁడనై యున్నాను కత్తిని నొక్కకుము చెప్పెదను ఈ సంతానధర్మము నందు ఎముక లెల్ల పొడి యగుచున్నవి. నేను దీనిని పరిత్యజించి యాలు బిడ్డల ముఖమును జూచికొని కాలహారణము చేయవలయు నని మిగుల నాతురుఁడనై యున్నాను. నే నీ సంతానధర్మమును విడిచిపెట్టుదును. అయిన, నింట గూర్చుండి చేయున దేమి? నేను విద్రోహి నని యందఱును దెలిసికొని యున్నారు. ఇంటికి: బోయి కూర్చుండినను రాజభటులు వచ్చి తల నఱికి తీసికొని పోదురు. లేనియెడల, సంతానులే నన్ను విశ్వాసఘాతుకుఁడనని నఱికి వేయుదురు. కావున, నిన్నును నా మార్గమునకుఁ దీసికొనుట కిష్టము కలవాఁడనై యున్నాను.

భవానంద—నన్ను నేల?

ధీరానంద—ఇది ముఖ్యమైనమాట. ఈసంతానసైన్యము నీయాజ్ఞాధీనము. సత్యానందుఁ డిప్పు డిచ్చట లేఁడు. నీవే వారికి నాయకుఁడవు. నీ వీసేనను గొనిపోయి యుద్ధము చేయుము. నీకు జయము కలుగు నని నాకు దృఢమైన నమ్మకము కలదు. యుద్ధమునందు జయ మైనచో నీ సొంతపేరుతో రాజ్యస్థాపన జేయుము. సైన్యము నీ స్వాధీనమై యున్నది. నీవు రాజగుము—కల్యాణి నీకు మండోధరి కానిమ్ము. నేను నీ యను

చరుఁడనై పెండ్లము బిడ్డలతోఁ గాలహరణముచేయుచు నిన్ను దీవించుచుండెదను. సంతానధర్మము నతలజలమునఁ గలిపి వేయుము.

భవానందుఁడు కత్తిని ధీరానందుని మెడనుండి మెల్లగాఁ దీసి, 'ధీరానందా! యుద్ధము చేయుము; నిన్నుఁ జంపెదను; నేను ఇంద్రియ పరవశుఁడనై యున్నాను; అయినను విశ్వాస ఘాతుకుఁడను గాను నన్ను విశ్వాసఘాతుకుఁడ వగు మని నీవు హెచ్చరిక చేయుచున్నావు. నీవు స్వయం విశ్వాసఘాతుకుఁ డవు; నిన్నుఁ జంపినచో బ్రహ్మహత్యాపాతకము సంభవింపదు. నిన్ను వధింతు' ననెను. మాట ముగియునంతలో ధీరానందుఁడు నిట్టూర్పు పుచ్చి పరుగిడిపోయెను. భవానందుఁడు వానివెంట నంటి పోలేదు. వాఁడు కొంచెమునేపు అన్యమనస్కుఁడై యుండి, పిదప వెదకెను. వాఁడు కనఁబడలేదు.

---

## ముప్పదియొకటవ ప్రకరణము

### భవానందుని మనోవ్యాకులము

భవానందుఁడు మఠమునకుఁ బోక గంభీర మైన వనమ ధ్యమునం బ్రవేశించెను. ఆకాననమం దొకవైపున పడిపోయిన గొప్ప మిద్దెయి ల్లుండెను భగ్నావశిష్ట మైనయిటికలు మొద లగువానిపై లతలును చెట్లును దట్టముగాఁ బెరిగి యుండెను. లెక్కలేని సర్పముల కాటపట్టై యుండెను. నేలఁగూలిన గదు లలో నొక్క గదిమాత్రము కొంచెముబాగుగా నుండెను. భవా నందుఁడు ఆగదిలోఁ గూర్చుండి యాలోచింప నారంభించెను

రాత్రి గాఢమైన చీఁకటిగా నుండెను. ఆవిస్తారమైన యరణ్యము జనశూన్యమై యుండెను. అది దుర్భేద్యమై యుండి నందువలన వన్యమృగంబులు సహితము తిరుగుటకు ప్రతిబంధకముగా నుండెను. దూరమునం దప్పుడప్పుడు వ్యాఘ్రహుంకారమును, ఇతరమృగములు క్షుధాభీతిచేఁ గూయునట్టి వికటశబ్దములును వినంబడుచుండెను. ఒక్కొకసారి పెద్దపెద్దపక్షుల పక్షకంపమును, ఒక్కొకసారి తాడితశబ్దమును, వధ్య, లేక వధకారిమృగములు పరువిడు ధ్వనియును వినఁబడుచుండెను. ఆవిజనస్థలమునం దాయంధకారమున శిథిలమయిన గృహమున భవానందుఁ డొక్కఁడే కూర్చుండి యుండెను. వాని పాలిటి కాకాలంబున పృథ్వియే లేదు. కేవలము భీతికి ఉపాదానముగ యుండెను. వాఁడు కపోలమునఁ జేయి నిడికొని చింతించుచుండెను. చలనము లేదు. నిశ్వాసము లేదు భయము లేదు. అత్యంతము చింతాయుక్తుఁడై, ఏది భవితవ్యమో యది అవశ్యముగా నగును. "నేను భాగీరథీ జలతరంగ సమీపమునందలి గున్న యేనుఁగువలె నింద్రియస్రోతమున మునిఁగి తేలుచున్నాను; ఇదే నాదుఃఖముగా నున్నది; ఇఁక ఒక ముహూర్తకాలములోపల దేహము ధ్వంస మగును. దేహధ్వంసమే యింద్రియధ్వంసము; నే నాయింద్రియములకు వశీభూతుఁడనై తిని నాకు మరణమే శ్రేయము, ధర్మత్యాగీ! ఛీ! చచ్చెదను." అని యాలోచనాస్రోతము ప్రవహింపుచుండఁగా, తలపై నొక వేచకపక్షి మృదు వగు గంభీరధ్వనిఁ జేసెను. భవానందుఁడు నోరు విడిచి, "అదేమి శబ్దము? ఆ వినఁబడినది చూడఁగా నన్ను యముఁడు పిలుచుచున్నట్లున్నది; ఏమి శబ్దము చేసెనో; ఎవరు

నన్నుఁ బిలిచిరో; ఏదియు దెలియలేదు. ప్రణవమయుఁ డగు నో యనంతా! నీవు శబ్దమయుఁడవు, నీశబ్దమర్మమును నేఁ దెలిసికొనఁ జాలను. నాకు ధర్మమున బుద్ధి నిమ్ము, నన్ను పాపరహితునిఁ గాఁ జేయుము. ఓగురునాథా! ధర్మమునందు నాబుద్ధిని బ్రవేశింపఁజేయుము" అని చెప్పెను.

అప్పు డాభీషణ మైన యరణ్యమధ్యమునందు, అతిమధురమును గంభీరమును మర్మభేదియు నగు మనుజుని కంఠస్వరము వినవచ్చెను. "ధర్మమున నీబుద్ధి యుండుఁగాక, దీవించితి" నని చెప్పినట్లు వినఁబడెను.

భవానందుని శరీరము రోమాంచ మాయెను. "ఇదేమిది? ఇది గురునాథుని కంఠధ్వని, మహాస్వామీ! తా మెచ్చట నున్నారు? ఈసమయమున దాసునికి దర్శన మొసఁగి రక్షింపుఁడు."

అయినను, ఎవ్వరును దర్శన మియ్యలేదు, ఎవ్వరను ఉత్తర మియ్యలేదు. భవానందుఁడు మరల ఉత్తరము రాలేదని యనుకొని యచ్చటచ్చట వెదకెను. ఎవ్వరును లేరు. అట్లే రాత్రి గడచెను. అనంతరము ప్రాతస్సూర్యుఁ డుదయించి, యరణ్యశిరంబున నుండిన శ్యామలపత్త్రరాశిని ప్రకాశింపఁ జేయుచుండెను. వెంటనే భవానందుఁడు బయలుదేఱి మఠమునకుఁ బోయెను. "హారే మురారే హారే మురారే" యను శబ్దమును వినెను. అది సత్యానందుని కంఠముగా నుండెను. కావున సత్యానందుఁడు అడవినుండి మరలివచ్చి రని తెలిసికొనెను.



## ముప్పదిరెండవ ప్రకరణము

—శాంతి దృఢచిత్తమును సత్యానందుఁ డెఱుఁగుట—

జీవానందుఁడు కుటీరమును విడిచి బయటికి పోయినపిదప, శాంతి మరల సారంగమును చేతఁబట్టికొని మృదుమధుర ధ్వనితో సంగీతము పాడుచుండెను.

ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదమ్
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్
కేశవ ధృత మీన శరీర
జయ జగదీశ హరే. అని.

జయదేవస్వామిచే విరచితమైన యామధురమైనస్తోత్రము శాంతి దేవి కంఠమునుండి వెడలి, యా యపారమగు కానన నముయొక్క నిశ్శబ్దమైన మౌనమును జీల్చికొని పూర్ణజలో చ్ఛ్వాస సమయంబునందు వసంతకాల మలయానిలముచే తాడిత మైన తరంగభంగమువలె మధురముగా వినఁబడెను. అపుడామె మరలఁ బాడ నారంభించెను.

నిన్దసి యజ్ఞవిధే రహహ శ్రుతిజాతమ్
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్
కేశవ ధృత బుద్ధ శరీర
జయ జగదీశ హరే.

అప్పుడు బయటనుండి యెవరో అతిగంభీర మైన ధ్వనిచే మేఘగర్జనముచాడ్పున గానము చేసిరి.

మ్లేచ్ఛ నివహ నిధనే కలయసి కరవాలం

ధూమకేతుమివ కిమపి కరాళమ్
కేశవ ధృత కల్కి శరీర
జయ జగదీశ హరే. అని.

శాంతి యది యెవరి కంఠధ్వనియో దానిని దెలిసికొని, 'నిలుము' అని చెప్పి సారంగతంత్రులను బిగించి తనకంఠము నెత్తి పాడెను.

వేదానుద్ధరతే జగన్నివహతే భూగోళ ముద్బిభ్రతే
దైత్యం దారయతే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే,
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తుభ్యంనమః.

ఇట్లు పాడుచుఁ బాడుచు, నాదీర్ఘతాళమును, ఆయుచ్చమైనట్టి గగనవిదారక స్వరమును, తగ్గించికొని శాంతి మరలఁ బాడెను:—

దినమణిమణ్డన భవఖణ్డన మునిజనమానసహంస.

శాంతి భక్తిభావముతో ప్రణతయై సత్యానందుని పాదధూళిని గ్రహించి, "ప్రభూ! నే నేమిపుణ్యము చేసియుంటినో తమ శ్రీపాదపద్మ దర్శనమయ్యెను. సెల విండు. నాచే నేమి కావలయునో?" అని చెప్పి సారంగమును శ్రుతి గూర్చి మరల పాడెను:—

తవచరణ ప్రణతావయమితి భావయ
కురు కుశలం ప్రణతేషు అని.

సత్యానంద—తల్లీ! నీకుఁ గుశలమే యగును గాక!

శాంతి—ఎట్లు ప్రభూ! తమ యాజ్ఞ యైయున్నది కదా! నా వైధవ్య మని.

సత్యానంద—నిన్ను నే నెఱుఁగను, త్రాటిబలముచు దెలి

యక నేను హెచ్చుగా నీడ్చితిని. నీవు నాకన్నను జ్ఞానివి; దీనికి ఉపాయమును నీవు చేయుము; జీవానందునితో నాకీ యుదంతము దెలియు నని చెప్పవద్దు; నీ యందలి ప్రేమచేత వాఁడు ప్రాణముతో నున్నాఁడు. ఇంకను ప్రాణము నుంచి కొని యున్నాఁడు. అపుడే నాకారోద్ధార మగును.

ఆ విశాలమైన నీలోత్ఫుల్లలోచనములచే నిదాఘ కాదంబినీ విరాజిత విద్యుత్తుల్యమైన రోషవిశిష్టకటాక్షము నిగుడించి, "ఏమి, ప్రభూ! నేనును నాస్వామియు నేకాత్మలము. నేను తనతో నే మేమి మాటలాడితినో వానిని అతనికిఁ జెప్పెదను; అతఁడు చావవలయు నన్నచోఁ జచ్చును; నాకేమి నష్టము? నేనును జచ్చెదను; అతనికి స్వర్గము ఘటించినచో నాకును స్వర్గము ఘటించును" అనెను.

బ్రహ్మచారి— నే నెపుడును ఎవ్వరితోను ఓడి పోలేదు; నేఁడు నీతో నోడితిని; తల్లీ! నేను నీకుమారుఁడను; సంతానునిపైఁ బ్రేమ నుంచుము; జీవానందుని ప్రాణరక్షణ సేయుము; నా కారోద్ధారమగును, అనెను ఇప్పుడామెముఖమునెకి మెఱుము మెఱసెను. (అనఁగా నవ్వెను.)

శాంతి— నా స్వామియొక్క ధర్మము అతని చేతియందున్నది. నేనేల అతనిని ధర్మచ్యుతునిగాఁ జేయవలయును? ఇహమందు సతికి పతియే దైవము. అయినను, పరలోకంబున నందఱకును ధర్మమే దైవము. నాకు నాపతి పెద్దవాఁడు. అతనికంటెను నా స్వధర్మము పెద్దది, దానికంటెను నాపతి ధర్మము పెద్దది. నా కిష్టము వచ్చినపుడు నాధర్మమునకు తిలోదకము విడిచెదనుగాని, నాస్వామి ధర్మంబును విడువను. మీరు

చెప్పినవిధముగా నాస్వామి వచ్చినను చావనిండు; నేను అభ్యంతరము చేయుదానను గాను, అనెను.

బ్రహ్మచారి—దీర్ఘనిశ్వాసము విడిచి, తల్లీ! ఈఘోర వ్రతంబునకు బలిదానము కలదు. మనమందఱమును బలి కావలసి యున్నది. నేను చచ్చెదను. జీవానంద భవానందులును చత్తురు. తల్లీ, నీవును చచ్చెద వని తోచుచున్నది. అయినను పని చేసి చావవలయును. పని చేయక చచ్చుట బాగగునా? నేను ఎప్పుడును స్వదేశమును మాత్రము తల్లి యని పిలుతు గాని మఱెవ్వరి నట్లు పిలువను. ఏలన, సుజలమును, సుఫలమును గల భూమియే మనకు తల్లి; ఇపుడు నిన్నుఁ దల్లి యని నుడివితిని. నీవు తల్లివై సంతానులకార్యమును జేయుము. దేనిచే కార్యోద్ధార మగునో దానినిఁ జేయుము. జీవానందుని ప్రాణరక్షణము చేయుము, నీప్రాణరక్షణమును జేసికొనుము.

ఇట్లని చెప్పి, సత్యానందుఁడు "హారే మురారే మధుకైటభారే" అని పాడుచు పోయెను.

---

## ముప్పదిమూఁడవ ప్రకరణము

సత్యానందుఁడు యుద్ధమునకుఁ బుఱికొలుపుట

తీర్థయాత్రచేయుటకై పోయిన సంతానులలో సత్యానందుఁడుమాత్రము మరలి వచ్చె ననియును, సంతానుల కందఱకు నేమో చెప్పవలయు నని యున్నాఁ డనియును, సంతానులందఱును రావలసిన దని సెల వైనదనియును ప్రకటింపఁబడెను. గుంపులు గుంపులుగా సంతానులందఱును అజయనదీతీరమున

వచ్చి చేరిరి. వెన్నెలరాత్రియందు అజయనదీపార్శ్వమున నుండు పెద్ద యడవిలో ఆమ్ర పనస తింత్రిణీ వటాశ్వత్థశాల్మలీ వృక్షాదులచే నలంకృతమైన యా మహాగహానమునందు పది వేల సంతానులు చేరిరి. అప్పుడంద అును పరస్పరము సత్యా నందుని ఆగమనవార్త విని కోలాహలధ్వని చేయుచుండిరి. సత్యానందుఁ డెచ్చటి కేమి పనిగాఁ బోయియుండెనో యది యెవ్వరికిని దెలియదు. అయినను, వదంతి యేమనఁగా— అతఁడు సంతానుల మంగళాకాంక్షియై తపస్సు చేయుటకు హిమాలయమునకుఁ బోయియుండెననియును, ఆమహాస్వాముల తపస్సు సిద్ధియైనదనియును, మనకు రాజ్యము వచ్చు ననియును మిక్కిలికోలాహలము చేయుచు, కొట్టుఁడు, పట్టుఁడు, తురక లను చంపుఁడు' అని చీత్కారము చేయుచుండిరి. కొందఱు జయ జయ, మహాస్వాములకు జయ జయ, అని యఱచిరి. కొందఱు "హారే మురారే మధుకైటభారే"యని పాడిరి. కొం దఱు "వందే మాతరం" పాడిరి. కొందఱు 'అన్నా! తుచ్ఛ బంగాళీలకై రణరంగమున నీ శరీరమును విడిచి పెట్టవలసిన దినము వచ్చె' ననిరి. కొందఱు 'అన్నా! మసీదులను గొట్టి ధ్వంసము చేసి రాధామాధవమందిరములను కట్టుదినము వచ్చె ననిరి. కొందఱు 'తాను సంపాదించినదానిని తా ననుభవించు దినము వచ్చె' ననిరి. కొందఱు 'వర్ణాశ్రమహీనుల మై యుండక నిర్బాధకముగా మరల వర్ణాశ్రమమును గ్రహించు దినము వచ్చె' ననిరి. కొందఱు 'ఈ అరాజకము తప్పునా? ఈ జాతిపతనపాతము తప్పిపోవునా? శిష్టాచరణమందు బుద్ధి కలుగు నా ?' యనిరి. ఇట్లనేకు లనేక విధములుగా తమతమ యభిమ

తానుసారముగఁ జెప్పికొనుచుండిరి పదివేగురియొక్క కలకల రవమును, మందవాయువుచే తాడితమైనందునఁ గల్గిన వృక్ష పత్త్రరాశియొక్క మర్మరశబ్దమును, సైకతవాహినియైన తరంగిణియొక్క మృదువైన తరతర రవమును, నీలాకాశమునందలి చంద్రతారలును, శ్వేతమేఘరాశియును, శ్యామలమైన ధరణీతలమునందలి పచ్చగానుండు నరణ్యమును, స్వచ్ఛమైన తెల్లని యిసుకయును, ఫుల్లకుసుమదామములును, వానియన్నిటి మధ్య మధ్య సకలజన మనోహారంబగు 'వందేమాతరం' ఘోషమును, మిళితమై యుండు సమయమున, సత్యానందుఁడు వచ్చి, యాసంతానులమధ్య నిలిచెను. అప్పు డాదశసహస్రసంతాన మస్తకములు, చెట్ల సందులనుంచి ప్రసరించిన చంద్రకిరణములచే ప్రభాసితమైన శ్యామల తృణావృత భూమియందుఁ బ్రకాశించెను. సత్యానందుఁడు అత్యుచ్చధ్వనిచే నశ్రుపూర్ణలోచనుఁడై రెండుచేతులను పైకెత్తి చెప్పదొడంగెను:—

శంఖచక్రగదాపద్మధారియును, వనమాలా విభూషితుఁడును, వైకుంఠనాథుఁడును, కేశిమథనుఁడును, మధు మురనరక మర్దనుఁడును లోకపాలకుఁడు అగు శ్రీహరి మీకు మంగళము నిచ్చును గాక. మీభుజములయందు బలము నిచ్చును గాక. మనస్సున భక్తి నిచ్చును గాక. ధర్మంబున బుద్ధి నుంచును గాక. మీరంద రేకగ్రీవముగ నతని మహిమాను వర్ణనగీతమును పాడుఁ డనినంతనే యా వేలకొలఁది జనుల కంఠములనుండి ఉచ్చస్వరముతో,

జయ జగదీశ హరే

ప్రళయ పయోధి జలే ధృతవానసి వేదమ్

విహితవహిత్ర చరిత్రమఖేదమ్
కేశవధృత మీన శరీర
జయ జగదీశ హరే అని పాడిరి.

సత్యానందుఁడు వారిని మరల దీవించి, 'సంతానులారా! ఈదినము మీకుఁ జెప్పవలసిన విశేష మొకటి కలదు. థామసుఁ డను నొక విధర్మి యగు దురాత్ముఁడు అనేక సంతానులను నాశముజేసి యున్నాఁడు. మనము, ఈరాత్రి వానిని సైన్య సహితముగా హతము చేయవలయును. ఇది జగదీశ్వరుని యాజ్ఞ, మీరేమనెదరు?' అనెను.

భీషణమగు హరిధ్వనిచే కానన మంతయు విదీర్ణమయ్యెను. 'ఇపుడేకొట్టెదము, వాఁ డెచ్చట నున్నాఁడు? చూపుఁడు, పదండి, కొట్టుఁడు! కట్టుడు! శత్రువును గొట్టుడు!' అనెడి శబ్దములు దూరముగ నుండిన కొండలయందుఁగూడ ప్రతిధ్వనిత మాయెను. అపుడు సత్యానందుఁడు 'మనము కొంచెము తాల్మితో పని చేయవలయును. శత్రువులకు ఫిరంగి మొదలగు సాధనములు గలవు. అట్టి సాధనములు లేక మనము వారితో యుద్ధము చేయఁ దగదు. ఇదియునుగాక, వారు వీరజాతివారు. పదచిహ్నదుర్గమునుండి పదునేడు ఫిరంగీలు వచ్చును. అవి రాగానే మనము యుద్ధంబునకుఁ బోదము. చూడుఁడు, ఇపుడే తెల్లవాఱుచున్నది. అయిదు గంటలు కాకమునువే— అదియేమి?' యనెను.

ఢం-ఢం- అకస్మాత్తుగా ఆ విశాల మైన యడవియందు నాల్గు దిశలందును ఫిరంగిగుండ్ల శబ్ద మాయెను. అవి ఆంగ్లేయుల ఫిరంగి గుండ్లు. కేప్టన్ థామసు సంతానులను 'వలలోఁ

చిక్కిన చేపలవలె వధింపవలయు' నని యుద్యమించి యుం డెను.

---

ముప్పదినాలుగవప్రకరణము

థామస్ యుద్ధముచేయుట.

ఆంగ్లేయుల ఫిరంగిగుండ్లు ధం-ధం- శబ్దము చేసెను. ఆ శబ్దము విశాల మైన కాననమును గంపింపఁజేసి ప్రతిధ్వనిత మాయెను. శబ్దము అజయనదీ సోపానమునుండి మఱొక సోపానమునను విని, యిట్లు నదీముఖముగా దూరమునునుండు కాననమును బ్రవేశించి యచ్చటను ధం-ధం- అని వినవచ్చె ను. సత్యానందుఁ 'డెవరి పటాలమో చూడుఁ' డనియెను. ఆక్షణముననే కొందఱు సంతానులు గుఱ్ఱముల నెక్కి చూచు టకై వెడలిరి. అయినను, వారు కాననమును విడిచి కొంత దూరము పోవునంతలో శ్రావణమాస వర్షధారలవలె గుండ్లు వారిపై గురిసెను. వారు గుఱ్ఱములతోఁ గూడ ప్రాణములను విడిచిరి సత్యానందుఁడు దూరముగ నుండి చూచి సంతానులు కొందఱు హతులైరని తెలిసికొని, మఱికొందఱను బిలిచి 'గొప్పవృక్షము నెక్కి చూడుఁ, డని చెప్పుచుండఁగా, జీవా నందుఁ డొక గొప్పవృక్షమునెక్కి, చెట్టు కొమ్మపై నిలిచి, 'ఇంగ్లీషువారి పటాల' మనెను. సత్యానందుఁడు, 'గుఱ్ఱపుసవా రులా? కాల్బములా?' అని యడిగెను.

జీవానంద — రెండును గలవు.

సత్యానంద — ఎంత?

జీవానంద—చెప్పుటకుఁ గాదు, చెట్లకొమ్మ లడ్డముగా నున్నవి, వారు బయటికి రాలేదు.

సత్యానంద—ఎఱ్ఱమూతివారా? లేక ఉత్తసిపాయీలా?

జీవానంద—ఎఱ్ఱమూతివారుకూడ నున్నారు, అని చెప్పుచు చెట్టునుండి దిగెను.

సత్యానంద—పదిగురు సంతానులు సిద్ధముగ నున్నారు. ఏమి చేయుదువో, చూడుము, నీవు దీనికి సేనాపతివి.

దీనిని విని, జీవానందుఁడు సశస్త్రుఁడై సజ్జితుఁడై ఒక్కయొగురున గుఱ్ఱము నెక్కెను. ఒకతూరి నవీనానందుని వైపు తిరిగిచూచి కనుసన్న చేసెను. అదేమి సంకేతమో యెవరికినిఁ దెలియలేదు. నవీనానందుఁడు కనుసన్నచే నేమి యుత్తర మిచ్చినదియు నెవ్వరికిని దెలియలేదు. వారివారి మనస్సునందు పరస్పర మిదియే కడపటి దర్శన మని భావించియుండ వచ్చును. అప్పుడు నవీనానందుఁడు దక్షిణబాహువును పైకెత్తి యందఱను జూచి "భ్రాతృలారా! ఈ సమయమున 'జయజగదీశహరే' యని ప్రార్థింపుఁ" డని చెప్పెను. అప్పు డా పదివేలసంతాను లేకకంఠముతో నది కానన గగనములు సైతము ప్రతిధ్వని చేయునట్లును, గుండ్ల శబ్దమును ముంచి వేయునట్లును చేతులు నెత్తుకొని,

జయజగదీశహరే

మ్లేచ్ఛనివహనిధనే కలయసి కరవాలమ్. అని పాడిరి.

ఈసమయంబున నాంగ్లేయుల గుండ్లవాన కాననమధ్యమందు సంతానులపై గురిసెను. అనేకులు పాటపాడుచుండి ఛిన్నమస్తకులై ఛిన్న బాహువులై ఛిన్నహృదయులై నేలకు

వ్వాలిరి. అయినను, ఎవ్వరును పాడుటను నిల్పక 'జయజగదీశ హారే!' యని పాడుచునే యుండిరి. గానము ముగియఁగనే యంతయు నొకేసారి నిస్తబ్ధ మాయెను. ఆదట్ట మగు నడవి యును ఆ నదీసైకతమును ఆ యనంతమగు విజనమును ఒకే సారి గంభీరమైన నీరవమున నివిష్టమాయెను. కేవల మాయతి భయంకర మైన ఫిరంగిగుండ్లధ్వనియును, దూరముగా నుండి వచ్చుచుండిన యాంగ్లేయుల అస్త్రముల ఝుంకారధ్వనియును వారిపదధ్వనియును మాత్రము వినఁబడుచుండెను.

సత్యానందుఁ డాగంభీరమైన నిశ్శబ్దమధ్యమునం దత్యు చ్చస్వరముతో 'జగదీశుఁడగుహరి మీకుఁ గృపచేయును. ఫిరంగు లెంతదూరమున నున్నవి,' అనియెను.

మీఁదుగ నుండి యొక్కఁడు, 'ఈకాననమునకు సమీప మున నున్నది. ముందు కనఁబడు కొండయే యడ్డ' మనెను.

సత్యానంద—నీ వెవరు?

పైనుండి—నేను నవీనానందుఁడను.

సత్యానంద—మీరు పదివేలసంతాను లున్నారుకదా, మీకు జయ మగును, ఫిరంగులకు లాగుకొని రండు

అపుడు అశ్వారూఢుఁడై మొదట యుండిన జీవానందుఁ డు "రండు" అని యఱచెను.

అంత అశ్వారూఢులును పదాతు లాదలును అతిత్వరి తంబుగ జీవానందుని వెన్నంటి చనిరి. పదాతులు భుజమున తుపాకులను, నడుమున కత్తులను, చేతియందు బల్లెములను ధ రించి కాననము నుండి బయటికి రాఁగానే, ఆ యజస్ర మగు గుండ్లవర్ష ము గురిసి వారిని ఛిన్నభిన్నము చేయ నారంభించెను.

పెక్కుమంది సంతానులు యుద్ధము చేయకయే ప్రాణత్యాగము చేసి భూశయ్యాగతులైరి. ఒకఁడు జీవానందునిఁ గూర్చి 'జీవానందా! నిరర్థకముగా ప్రాణిహత్యవలన నేమిప్రయోజన' మనియెను.

జీవానందుఁడు వెనుకకు తిరిగిచూడఁగా, భవానందుఁడై యుండెను. జీవానందుఁ 'డేమి చేయుదము? చెప్పు' మనెను.

భవానంద—వనమునసే చెట్లయొక్క యాశ్రయముచే ప్రాణరక్షణ చేసికొందము గుండ్లబారికి చిక్కినచో భూమియే గతి. ఫిరంగులు లేక, ఈసంతానసైన్య మొక్కనిమిష మైన నిలువదు, అయినను పొదలయందు దాఁగి యుండి చాలసేపు యుద్ధము చేయవచ్చును.

జీవానంద—నీవు చెప్పినది నిజము. అయినను ప్రభువు ఫిరంగులను లాగుకొని రావలయునని యనుజ్ఞ చేసి యున్నాఁడు. అందుచేత మేము ఫిరంగులను లాగికొని రాఁబోవుచున్నాము.

భవానం—ఫిరంగులను లాగికొని రా నెవరికి సాధ్యము? అట్లు అవశ్యముగ పోవలసియే యుండినచో నీవు నిలువుము; నేను బోయెదను.

జీవానంద—అది కానేరదు. భవానందా! నేఁడు నే చచ్చుదినము.

భవానంద—నేఁడు నేనును జచ్చుదినము.

జీవానంద—నేను ప్రాయశ్చిత్తము చేసికొందును.

భవానంద—నీది నిష్పాప శరీరము, నీకుఁ బ్రాయశ్చిత్త

ము లేదు, నామనస్సు కలుషిత మైనయది, నేనే చావవలసినది. నీవు నిలువుము, నేఁ బోయెదను.

జీవానంద—భవానందా! నీవు చేసిన పాప మేమో నే నెఱుఁగను అయినను, నీ వుండినచో సంతానుల కార్యోద్ధార మగును. నేను బోయెదను.

భవానందుఁడు కొంచెమునే పూరకుండి, తుదకు 'చావు స్థిరమై యున్న నేఁడే చత్తును. ఏనాఁడు చచ్చుటచే ప్రయో జనమో యానాఁడే చచ్చెదను, చచ్చుటకు కాలాకాలము లేమి?' అనెను.

జీవానంద—అట్లయిన రా.

ఇట్లు మాటలాడుచుండఁగనే భవానందుఁ డందఱికంటె ముందుగా నడిచెను. అప్పుడు దళదళములందును గుంపుగుంపు లందును గుండ్డుపడి సంతానసైన్యమును ఖండవిఖండములుగాఁ జేయుచుండెను; చింది చెండాడుచుండెను; తలక్రిందులుగాఁ జేయుచుండెను. ఇదియునుగాక, శత్రువులలో తుపాకిని ధరిం చిన సిపాయీలు గుఱిపెట్టి సంతానులను వరుసలు వరుసలుగా భూమిపైఁ బడునట్లు కొట్టుచుండిరి. ఇట్టి సమయంబున, భవా నందుఁడు "ఈతరంగమునందు నేఁడు సంతానులు దుముక వలయును, ఎవ్వరు దుమికెదరు? ఈసమయమున 'వందేమా తరం' పాడవలయు" నని చెప్పెను. అప్పు డుచ్చస్వరముతో, మేఘమల్లారిరాగమునందు నాసహస్రసంతాన సైన్యము ఫిరంగి గుండ్ల తాళమునకు సరిగా 'వందేమాతరం' పాడిరి.

---

## ముప్పదియైదవ ప్రకరణము

—— సంతానులు థామసును బట్టుకొనుట ——

ఆపదివేగురు సంతానులును "వందేమాతరం" పాడుచు బల్లెములను పట్టుకొని యతివేగముతో ఫిరంగు లుండుచోటికిఁ బోయి పడిరి. గుండ్లవానయందు సంతానులు ఖండవిఖండ ములై విదీర్ణులై ఉత్పతితులై యత్యంతవిశృంఖలులై పోయిరి. అయినను, సంతానసైన్యము వెనుదీయలేదు. ఆసమయమున, కేప్టన్ థామసు ఒక సిపాయీల దండును జూచి, తుపాకులను బారుచేసి సంతానుల దక్షిణపార్శ్వమునం దాక్రమింపవలయు నని సెల వొసంగెను. అప్పుడు రెండువైపుల నున్న సంతాను లొకేసారి నిరాశు లైరి. ఒక్కొక్క నిమిషంబునకు నూర్ల కొలఁది సంతానులు నష్టమగుచు వచ్చిరి. అప్పుడు జీవానం దుఁడు, "భవానందా! నీవు చెప్పినదే నిజ మాయెను. ఇంక వైష్ణవుల ధ్వంసము ప్రయోజనము లేదు; మెల్లమెల్లగా తిరిగి పోవుద" మనియెను.

భవానంద—ఇప్పుడు తిరిగిపోవు టెట్లు! ఇప్పుడు తిరిగి పోవువారును జచ్చిపోదురు.

జీవానంద—ముందుప్రక్కనుండియు, కుడిప్రక్కనుండి యు నాక్రమించి యున్నారు, ఎడమప్రక్క నెవరును లేరు; పద; మెల్లమెల్లగా జరిగి యెడమప్రక్కను పోదము.

భవానంద—జరిగి యెక్కడికి పోయెదవు? ఆప్రక్కను అజయనది; క్రొత్తవానచే అజయ ప్రవహించుచున్నది. అంగి

లేయుల గుండ్లవృష్టినుండి తప్పించుకొని సంతానుల సైన్యమును అజయనదీజలమునందు ముంచెదవా?

జీవానంద—అజయనదికి ఆనకట్ట యున్నట్లు జ్ఞాపకము.

భవానంద—ఈపదివేగురుసంతానులను ఆనకట్ట మీఁదుగ దాఁటింపఁ బ్రయత్నించినను, ఒకవేళ యింగ్లీషువారు ఫిరంగి కాల్చిరేని అందఱును చచ్చి పోవుదురు.

జీవానంద—ఒకపనిచేయుము. కొద్దిసేనను నీవు తీసికొని పో. ఈయుద్ధమునందు నీవు చూపియుండు సాహసమును చాతుర్యమును జూచినయెడల నిది నీకసాధ్యము కాదు. నీవు స్వల్ప సంఖ్యగల సంతానసేన నుంచుకొని తప్పించుకొనుదారిని జూచికొనుము. నేను నీసేనమఱుఁగుననుండి మిగిలిన సంతానులను ఆనకట్టమీఁదుగా దాఁటించి కొనిపోయెదను. నీతో నుండిన వారేమో నష్టమయి పోవలసినదే; నాతోడ వచ్చువారు మాత్రము తప్పించుకొందురు.

భవానంద—మంచిది, అట్లే చేసెదను.

అప్పుడు భవానందుఁడు రెండువేలమంది సంతానులను బిలిచికొని, మరల "వందేమాతరం" శబ్దముతో సత్యంతోత్సాహముగా నాంగ్లేయుల ఫిరంగిసైన్యమును ఆక్రమించెను. అచ్చట ఘోరతరమైన యుద్ధమారంభ మాయెను. అయినను, ఫిరంగులముందు సంతానుల స్వల్పసైన్య మెంతకాలము నిలుచును? పైరును కోఁతకోసి పడవేయునట్లుగా నాసంతానులు భూమిపైఁ బడిరి.

ఇంతలో జీవానందుఁడు మిగిలినసంతానులను కొంచెము ఎడమప్రక్కగా త్రిప్పి కాననము నాక్రమించికొని మెల్లమెల్ల

గా పోయెను. కేప్టన్ థామసు సహకారి యగు లెఫ్టినెంటు వాట్సన్ అనునతఁడు దూరముగ నుండి యొకగుంపు సంతానులు మెల్లగా పోవుచున్నా రని తెలిసికొని, యతఁ డొక గుంపు ఫౌజుదారీ సిపాయీలను, ఒకగుంపు దేశీయ రాజుల సిపాయీలను దీసికొని జీవానందుని వెన్నంటెను.

దీనిని కేప్టన్ థామసు చూచెను. చాలమంది సంతానులు పాఱిపోవుటను గని యతఁడు కేప్టన్ హే యను నతనిం జూచి, "నేను ఇన్నూఱు మున్నూఱుగురు సిపాయీలను తీసికొనిపోయి మిగిలియున్న రాజద్రోహులను జంపి వేసెదను. నీవు ఫిరంగులను, మిగిలిన సైన్యమును దీసికొని వారివెంబడి పరుగిడుము. వాట్సన్ ఎడమప్రక్కగా పోవుచున్నాఁడు. నీవు కుడివైపుగా పో. ఇట్లు మూఁడు ప్రక్కలయందును వారినిఁ జుట్టుకొంటి మేని వలలోఁ జిక్కిన పక్షులవలె మనచేతిలోఁ బడుదురు. అపుడు వారిని చంపివేయవచ్చును. వారు ద్రుతపదులగు దేశ్యజనులు; అందఱికంటెను పరుగెత్తుటయందు దక్షులు; నీవు వారినిఁ బట్టఁజాలవు. కావున, సవారులను దీసికొనిపోయి యడ్డపడి ఆ చకట్టపై నిలుచున్న యెడల కార్యము సాధింపవచ్చు" నని చెప్పెను కేప్టన్ హే అట్లు చేసెను.

"అతిదర్పే హతా లఙ్కా"—కేప్టన్ థామసు సంతానులను అలక్ష్యముగాఁ దలఁచి యిన్నూఱుగురు పదాతులను మాత్రము భవానందునితోఁ బోరుట కుంచుకొని మిగిలిన సైన్యమును హేతోఁ బంపెను. చతురుఁ డగు భవానందుఁ డాంగ్లేయ ఫిరంగి సైన్యమంతయు వెడలిపోయి స్వల్పజనమే మిగిలియుండినను, వారిని విడువఁగూడ దని తలఁచి, హతశేషులైన

సంతానులను బిలిచి, యీస్వల్ప సైన్యమును జంపివేసి మనము జీవానందుని సహాయంబునకుఁ బోవలయును. మీ రింకొకతూరి "జయ జగదీశ హారే" యనిచెప్పుఁ డనియెను. అప్పుడాస్వల్పజన సంతానులు "జయ జగదీశహారే" యని నుడువుచు పులులవలె కేప్టన్ థామసుపైఁ బడిరి. ఆపడిన వేగమున నాయల్ప సంఖ్య గలసిపాయీ లందఱును హతులైరి. అప్పుడు భవానందుఁడు తానేపోయి కేప్టన్ థామసును పట్టుకొనెను. కేప్టన్ థామసు కడవఱకును యుద్ధము చేసెను. భవానందుఁడు 'కేప్టన్ దొరవారూ నిన్ను చంపుట లేదు. ఆంగ్లేయులు మాకు శత్రువులు కారు. తురకలకు సహాయముగా మీ రేల వచ్చితిరి ? రా—నీకుఁ బ్రాణదాన మొసఁగితిని. నీ వేమో యిప్పుడు బంది వైతివి. ఆంగ్లేయులకు జయ మగుఁగాక; మేము మీ హితచింతకులము.' అనిచెప్పెను. అప్పుడు థామసు భవానందునిఁ జంపుటకై తుపాకి నెత్తుటకుఁ బ్రయత్నించెను. అయినను, భవానందుఁడు పులివలె నతనిం బట్టుకొని యుండినందున, థామసు ప్రయత్నము కొనసాగలేదు. భవానందుఁడు 'ఇతనినిఁ గట్టివేయుఁ' డని యనుచరుల కనుజ్ఞ చేసెను. ఇద్దరు ముగ్గురు సంతానులు వచ్చి థామసును గట్టివేసిరి. పిదప, భవానందునియానతిమేరకు నతనిని గుఱ్ఱముపై నెక్కించికొని "వందేమాతరం" పాడుచు వాట్సన్ ఉండిన వైపునకుఁ జనిరి.

జీవానందునిసంతానసైనికులు భగ్నోద్యములై పలాయనోద్యుక్తులై యుండిరి. జీవానందుఁడును ధీరానందుఁడును వారికి ధైర్యము చెప్పి నిలిపిరి. అయినను, అందఱును నిల్వ

టకు కాదయ్యెను. కొందఱు పరువిడిపోయి అమ్రకాననము నా శ్రయించిరి. మిగిలినవారిని జీవానందుఁడును ధీరానందుఁడును ఆనకట్ట మీఁదుగా బిలిచికొని పోయిరి. అచ్చట హేయును వాట్సనును రెండుప్రక్కలనుండి వచ్చి చుట్టుకొనిరి. ఇఁక వీరి యత్నము తప్పినది.

---

## ముప్పదియేడవ ప్రకరణము

### సంతానులు ఆంగ్లేయుల ఫిరంగిని గైకొనుట

ఇంతలో థామసుని ఫిరంగిసైన్యము కుడివైపువచ్చి చుట్టుకొనెను. అప్పుడు సంతానుల సైన్యము ఛిన్నభిన్న మాయెను. ఎవ్వరికిని తప్పించుకొనెడియాశ లేకపోయెను. సంతానులు దిక్కుదిక్కునకుఁ బాఱ నారంభించిరి. జీవానం దుఁడును ధీరానందుఁడును వారిని నిలిపి యొకస్థలమునఁ జేర్చు టకుఁ బ్రయత్నపడిరి; అది నిష్ఫల మాయెను. ఆసమయం బున గట్టిగా, ఆనకట్టమీఁదుగాఁ బోయి 'ఆవలికి పొండు! లేకున్న నదిలో మునిఁగిపోదురు, మెల్లమెల్లగా ఆంగ్లేయులవైపు చూచుచుపొండు,' అనుశబ్దము వినవచ్చెను.

జీవానందుఁ డాశబ్దము వచ్చినవైపును చూడఁగా, ముందుప్రక్కను భవానందుఁడుండెను. భవానందుఁడు, జీవా నందా! ఆనకట్టపై దీసికొని పొమ్ము; ఇఁక యత్నము లేదు' అనెను. అప్పుడు మెల్లమెల్లగా భయపడుచు సంతానసైన్యముఁ

ఆనకట్టపైఁబోయెను. ఆనకట్ట సమీపమున అనేక సంతాను లొక్కసారిగా పోవుట యాంగ్లేయులకు చాల అనుకూల మా యెను. ఆనకట్ట ఊష్చినయ ట్లగుట కారంభించెను. సంతానులు గుంపులుగుంపులుగా వినష్టు లగుచు వచ్చిరి భవానందుఁ డును జీవానందుఁడును ధీరానందుఁడును నుండిరి. ఒక గుండు దెబ్బకు బహుజన సంతానక్షయ మాయెను. భవానందుఁడు, "జీవానందా! ధీరానందా! రండు, మనము ముగ్గురమును కత్తులనుఁ ద్రిప్పుచు పోయి యాఫిరంగులను లాగుకొంద" మనెను. అట్లే ముగ్గురును కత్తులను ద్రిప్పుచు ఫిరంగులసమీా పమునకుఁ బోయి యచ్చటనుండిన సైన్యమును గొట్టివేసిరి దానిని గాంచి, యింకను కొందఱు సంతానులు వారి సహాయము నకుఁ జనిరి. ఫిరంగి భవానందుని చేతఁ జిక్కెను. భవానం దుఁడు దానిపైఁ గూర్చుండి కరతాళధ్వని చేయుచు "వందే మాతరం" పాటపాడుఁ డని చెప్పెను. అందఱును "వందేమా తరం" పాడిరి. భవానందుఁడు, జీవానందా! ఈ ఫిరంగిని త్రిప్పి యుంచుకొని యీాయధమాధములను కాల్చి బూడిద చేసివేయుంద" మనెను. అనంతరము సంతానులు చేరి ఫిరంగిని శత్రువులవైపు త్రిప్పిరి. అప్పుడు ఫిరంగి ఉచ్చనినాదముతో వైష్ణవుల చెవియందు "హరిహరి" యని శబ్దము చేయునట్లు శబ్దమాయెను. అందువలన సిపాయీా లనేకులు నష్టమైరి. భవానందుఁ డాఫిరంగి నీడ్చుకొనివచ్చి ఆనకట్టకొనయందుంచి కొని, మీా రిరువురును సంతానసైన్యమును ఆనకట్టమీాఁదుగా తీసికొనిపొండు, నే నొక్కఁడనే యీా వ్యూహాముఖమును రక్షించుకొని యుండెదను; ఫిరంగిని కాల్చుటకుఁ గొందఱను

నుంచిపోం" డనెను. పందొమ్మండ్రు అల్పవయస్కులు భవానందుని సహాయముకై నిలిచిరి.

అనంతరము పెక్కండ్రు సంతాను లానకట్టను దాటి జీవానంద ధీరానందుల యాజ్ఞానుసారముగ నావలిగట్టు జేరిరి. భవానందుఁ డొక్కఁడే పందొమ్మండ్ర సహాయముచే నాఫిరంగితో బహుసైన్యమును హతము చేయ నారంభించెను అయినను యవనసైన్యము జలోచ్ఛ్వాసమునఁ బుట్టిన తరంగ తండములవలె భవానందునిఁ జుట్టుకొని యతనిని మునిఁగినవానిఁగా జేసెను. భవానందుఁడు, అజయ్యుఁడు; అశ్రాంతుఁడు; నిర్భీతుఁడు ఫిరంగియొక్క ప్రతి గుండు దెబ్బకు ననేక సైన్యమును నష్టపఱచెను. యవనులు గాలిచే పీడితమైన తరంగముయొక్క అభిఘాతమువలె నతనిపైఁ బడుచుండిరి. అయినను, ఆపందొమ్మిదిమంది సంతానులు ఫిరంగితో ఆనకట్టద్వారమును బంధించికొని యుండిరి. వారు చచ్చినవారై యుండినను జావ లేదు. యవనులచే ఆనకట్టను మెట్టుటకు కాలేదు. ఆబాలవీరులును అజయ్యులు, వారి జీవనము అవినశ్వరము ఇంతలో ముందు పోయిన సంతానసైన్యమునందు చాలభాగము గుంపులుగుంపులుగా నావలిగట్టునకు పోయి చేరిరి. ఇంకను గొంచెమునేపు ఆనకట్ట ముఖమును రక్షించుకొని యుండినచో నందఱును దాఁటిపోయి యుందురు. ఈసమయమున మఱియొకచోట ఫిరంగిశబ్దము వినఁబడెను. ఉభయపక్షములవారు యుద్ధమునందు శాంతులై చెవి యొగ్గి వినిరి. మఱెక్కడనుండి ఫిరంగులు? చూడఁగా వనమధ్యమునుండి కొందఱు దేశ్యజనులెగిరించెడిగుండ్లు వచ్చుచుండినవి. ఇట్లు వచ్చి యావిరాటరూప

మైన ఫిరంగీల శ్రేణి సప్తదశముఖములనుండి హేదారయొక్క దళమునం దగ్నివృష్టిని గురియించుచుండెను. ఆఘోరశబ్దముచే వన నద గిరు లన్నియు ప్రతిధ్వనితము లాయెను. పగలంతయు రణమున శ్రమపడిన యవనసైన్యము ప్రాణభయముచే వడవడ వడంకెను. ఆయగ్నివృష్టిచే ముసల్మానులు, హిందూస్థాను లందఱును పలాయనసూక్తపరాయణు లగుచుండిరి. కేవలము నలుగురు ఎఱ్ఱమూతివారుమాత్రము చక్కఁగా నిలిచి మరణమునకు సిద్ధు లైరి. భవానందుఁ డీవినోదమును జూచుచు "భ్రాతృలారా! తురకలు భగ్నులై పరుగిడుచున్నారు; పదండి, వారిని వెన్నంటుఁడు" మనియెను.

అప్పుడు సంతానులు పిపీలికాప్రవాహమువలె నూతనోత్సాహముచే నానకట్టనుండి వెనుకకుఁ దిరిగివచ్చి యవనుల నాక్రమించుటకై పరుగిడిరి. అకస్మాత్తుగా వారు యవనులపైఁ బడిరి; యవనులకు మరల యుద్ధంబున కవకాశము దొరకలేదు. భాగీరథీతరంగ మేలాగున దంభకారియు, మహాపర్వతాకారమునైన మత్తగజమును దేలించుచుతీసికొనిపోవునో, అలాగున సంతానులు యవనులను దేల్చికొని పోయిరి. యవనుల వెనుకభాగమున భవానందుని కాల్బల ముండెను. ముందుభాగమున మహేంద్రుని ఫిరంగిగుం డ్లుండెను. అప్పుడు హేదారకు సర్వనాశముసంభవించెను. ఇంకేమియు మిగులలేదు. బలము వీర్యము సాహసము కౌశలము శిక్ష దంభము అన్నియు పోయెను. ఫౌజుదారీ, పాదుషాహి, ఇంగిలీషు, దేశి, విలాయతి, నల్లవారు, ఎఱ్ఱవారు, అందఱును నిపాతమై నేలంబడిపోయిరి. విధర్ముల సైన్యము పలాయనమై పోయెను.

'కొట్టుఁడు, పట్టుఁడు' అని జీవానంద భవానంద ధీరానందు లంద ఱును విధర్మ సేనను వెన్నంటి చనిరి. వారి ఫిరంగులను సంతా నులు లాగుకొనిరి. బహుజను లాంగ్లేయ సిపాయీలు నిహతు లైరి. సర్వమును నాశ మైనదానిని జూచి హే, వాట్సన్ వీరు భవానందుని చెంతకుఁ బోయి. "మేము బందీల మయ్యెదము; ఇఁక ప్రాణహత్య చేయఁగూడదు" అని ప్రార్థించిరి. జీవానం దుఁడు భవానందుని ముఖమును జూచెను. భవానందుఁడు మనస్సున, 'అది కాఁజాలదు; నేను నేఁడు చావవలయును' అని చెప్పి, 'కొట్టుఁ' డని యఱచెను. మరల నొకప్రాణి మిగుల లేదు. తుద కొకచోట మాత్రము ఇరువది ముప్పదుగురు ఎఱ్ఱ జనులు గుంపుగా నిలిచి యాత్మసమర్పణమున కృతనిశ్చయులై యతిఘోరతర మైన యుద్ధముచేయ నారంభించిరి. జీవానం దుఁడు, "భవానందా! మనకు రణజయమై యున్నది. ఇంక నీదినమున వద్దు; ఈకొందఱు తప్ప మఱి యెవ్వరును లేరు. వారికిఁ బ్రాణదానము నొసఁగి పోదము ర" మ్మనియెను. 'ఒక్కఁడు ప్రాణముతో నుండినను వెనుకకువచ్చుట లే'దని భవా నందుఁడు చెప్పెను. జీవానందుఁడు, "నీపై ఆన నుంచి చెప్పె దను, కొంచెము దూరమున నిలిచి చూడుము; ఇంతమంది యింగ్లిషుజనులను నే కొక్కఁడనే నిహతులం జేసెద"ననియెను.

కేప్టన్ థామసు గుఱ్ఱముపై నిబద్ధుఁడై యుండెను. భవానందుఁ "డీ యధముని దెచ్చి నాయెదుటఁ బెట్టుఁడు; వీని నిఁ గొట్టి నేనునుం జచ్చెద" ననెను.

కేప్టన్ థామసునకు దేశభాష వచ్చును. అతఁడు యిం

గ్లీషు సైనికులను జూచి "ఓ యాంగ్లేయులారా! నే నేమో చచ్చితిని. ప్రాచీనపు ఇంగ్లాండు పేరును గాపాడుకొనుఁడు. మీాపై ఏసుక్రీస్తు ఆన యున్నది మొట్టమొదట నన్నుఁ గొట్టి, పిదప నీవిద్రోహియగు కాఫరునిఁ గొట్టుఁ" డనియెను.

"బై" యని యొక తుపాకిగుండు డెగిరెను. ఒకఁడు ఐరిష్ దేశపు కెప్టెన్ థామసుయొక్క తలను గురిపెట్టి తుపాకిని గాల్చెను. అది లలాటమునకుఁ దగిలి కెప్టెన్ థామసు ప్రాణము గైకొనెను. భవానందుఁ డప్పుడు ఎలుగెత్తి చెప్పిన దేమనఁగా:—నా బ్రహ్మాస్త్రము వ్యర్థ మాయెను. ఈసమయంబున పార్థ వృకోదర నకుల సహదేవులవలె నుండువా రెవరు వచ్చి నన్నుఁ గాపాడెదరు? చూడుఁడు; బాణహతమైన వ్యాఘ్రమువలె ఎఱ్ఱని జనులు నామీాఁదికి వచ్చుచున్నారు. నేను చచ్చుటకై వచ్చి యున్నాను. నాతోఁ జచ్చుటకై సిద్ధులైన సంతాను లెవ రున్నారు? అనెను.

మొదట ధీరానందుఁడు ముందు పడెను. వానివెనుక జీవానందుఁడు—వానివెనుక నొక్క రొక్కరుగను, గుంపులు గుంపులుగను సుమారు ఏఁబదుండ్రు జనులు వచ్చిరి. భవానందుఁడు, ధీరానందునిఁ జూచి, 'నీవు నాతోఁగూడఁ జచ్చుటకై వచ్చితివా?' యని యడిగెను.

జీవానంద—చచ్చుటకు నీకొక్కనికి మాత్రము హక్కులేదు—అని చెప్పియొకయెఱ్ఱమూతి వానిని ఆహుతునిఁగా గొట్టెను.

భవానంద—అదికాదు. చచ్చినచో ఆలుబిడ్డల ముఖమును జూచుకొని కాలహరణము చేయుటకు లేదు:

ధీరానంద—నిన్నటిమాటను జెప్పెదవా? ఇంకనునాకుఁ దెలియలేదు కదా? (ధీరానందుఁడు ఆహతుఁడైన యొక్కమూతి వానిని వధించెను.)

భవానంద—లేదు. (ఈసమయమున నొక యొక్కమూతి వాని ఆఘాతముచే భవానందుని దక్షిణభుజ మూడి పడెను.)

ధీరానంద—నీవంటి పవిత్రాత్మునకు ఆమాటలను జెప్పుటకు నాకు సాధ్యమా? నేను సత్యానందునివలనఁ బంపఁబడిన గూఢచారుఁడనుగా వచ్చియుంటిని.

భవానంద—అదేమి? మహాస్వాములకు నాయం దంత అవిశ్వాసమా? (భవానందుఁ డపు డొక చేతితోనే యుద్ధము చేయుచుండెను.) ధీరానందుఁడు అతనిని రక్షించుకొనుచు, "కల్యాణితో నీవు మాటలాడు చుండినదానిని వారు చెవులార విన్నారు" అనెను.

భవానంద—ఎట్లు?

ధీరానంద—వారే యిచ్చటికి వచ్చి యుండిరి. హెచ్చరికతోఁ జూచికొనుము. (భవానందుఁడు తన్నుఁగొట్టిన యొక్కమూతివానిని కొట్టివేసెను.) వారు కల్యాణికి భగవద్గీతలను జెప్పియిచ్చుచుండిరి, అప్పుడు నీవు పోతివి. జాగ్రత్త! (భవానందుని రెండవభుజము పడెను.)

భవానంద—నేను చచ్చినవార్త వారికిఁ దెలుపుము. నేను అవిశ్వాసిని కాను.

ధీరానందుఁడు బాష్పపూరిత లోచనుండై యుద్ధము చేయుచు, సర్వమును వారెఱుంగుదురు. నిన్న వారాడిన మాటలను జ్ఞాపకము చేసికొనుము. అదియునుగాక నాతో

"భవానందుని తోడ నుండుము, వాఁ డీదినము చచ్చును. మరణకాలమున నే నాశీర్వదించితి నని చెప్పుము, పరలోకమున వానికి వైకుంఠప్రాప్తి గలుగును." అని చెప్పిరి.

భవానంద—సంతానులకు జయ మగుఁగాక; స్నేహితుఁడా! నా మరణకాలమున నొకసారి "వందేమాతరం" అను గీతము చెవిని బడునట్లుగా గానము చేయుము, అనెను.

అపుడు ధీరానందుని యాజ్ఞ మేరకు యుద్ధోన్మత్తులై యుండిన సంతాను లందఱు నతిగంభీరముగా "వందేమాతరం" పాడిరి. దానిచే వారికి బాహుబలము ద్విగుణ మాయెను. ఆ భయంకరమైన ముహూర్తమున మిగిలియుండిన యొట్టి జనులు హతులై పోయిరి. రణరంగమునందు శత్రువులు మిగుల లేదు.

ఆసమయమున భవానందుఁడు "వందేమాతరం"పాడుచు, మనస్సున హరిచరణ ధ్యానము చేయుచు ప్రాణత్యాగము చేసెను.

హా! రమణీయరూపలావణ్యమా! ఇహసంసారమునందు నీయధికారము మిక్కిలి చెడ్డది! నిన్ను కాల్పవలసిన దే!

---

## ముప్పదియేడవ ప్రకరణము

భవానందుఁడు నిహతుఁ డగుట

రణమునందు జయ మైనపిమ్మట అజయనదీ తీరమునందు సత్యానందునిఁ బరివేష్టించికొని విజయులైన వీరులు నానావి

ఘోత్సవములను జరుప నారంభించిరి.సత్యానందుఁడుమాత్రము భవానందుని మరణముచే వ్యాకులచిత్తుఁడై యుండెను.

ఇదివఱకును వైష్ణవులకు రణవాద్యము లధికముగా నుండలేదు. ఇప్పుడు భేరి, కాహళము, తమ్మెట, నగారా, డోలు, డమరు, శంఖము, జయఘంట మొదలగు నానావిధ వాద్యము లెచ్చట నుండియో వచ్చి తుముల శబ్దమయ్యెను. ఈ జయ సూచక వాద్యములచే కాననము ప్రాంతరము నదు లాదిగాఁ గల ప్రదేశములందు ప్రతిధ్వని పరిపూర్ణముగా నిండిపోయెను. ఈవిధముగా సంతానులు పెద్దప్రొద్దు నానావిధోత్సవ ములను జరిపినపిదప సత్యానందుఁడు, "జగదీశ్వరుఁడు నేఁడు కరుణించెను; సంతానధర్మంబునకు జయమాయెను; అయిన నొకపని నిలిచెను; ఎవఁడు మనతో నీయుత్సవమునఁ జేరలేదో, ఎవఁడు మన యుత్సవముకొఱకై ప్రాణము నిచ్చెనో, యట్టి వానిని మఱచుట సరికాదు; ఎవఁడు రణక్షేత్రమునందు నిహతుఁడై పడి యున్నాఁడో వానికి సత్కారము చేయుదము రండు; ఆ మహాత్ముఁడు మనకొఱకై యీరణజయంబును బొంది ప్రాణత్యాగమును జేసి యున్నాఁడు; మహావైభవముతో నా భవానందుని సత్కరింపుము" అని చెప్పెను. అప్పుడు సంతా నులు "వందేమాతరం" పాడుచు నిహతుఁడైనవానిసత్కారము నకై వెడలిరి. బహుజనులు గుంపుగాఁ జేరి హరిస్మరణము చే యుచు చందనకాష్ఠంబులను (అప్పుడు ఫారెస్టు అనఁగా: అడవి యిలాఖావారి సంకటములేదు.) మోచికొనివచ్చి యొక చితి నేర్పఱచి, "హరే మురారే" యని గానము చేయుచు, చితికిఁ బ్రదక్షిణము చేసిరి. (వీరు వైష్ణవసంప్రదాయంబున జేరిన విష్ణు

భక్తులైనందున దహనము చేసెదరు.) పిదప కాననమందు సత్యానందుఁడు, జీవానందుఁడు, మహేంద్రుఁడు, నవీనానందుఁడు, ధీరానందుఁడు అగు వీరు మాత్రమే కూర్చుండి యుండిరి. ఈయైదుగురును ఏకాంతముగా పరామర్శ చేయుచుండిరి. అపుడు, సత్యానందుఁడు, "ఇన్నిదినములు మనము దేనికొఱకై సర్వధర్మమును సర్వసుఖమును త్యజించి యుంటిమో యావ్రతము నేఁడు సఫల మాయెను ఈప్రదేశమున యవనుల సైన్యములేదు· అవశిష్టమై యున్నవారు సైనము మన ముందు నిమిషమైన నిలువ లేరు. ఇప్పుడు మీ రేమి చెప్పెదరు?" అనెను.

జీవానందుఁడు, 'దయచేయుఁడు; ఈసమయము పోయి నగరాధికారమును గ్రహింత' మనియెను.

సత్యానంద—నామతమును అదే.

ధీరానంద—సైన్య మేది ?

జీవానంద—ఏఁ? మనసైన్యము.

ధీరానంద—సైన్య మిం కెక్కడ ? ఎవరైనఁ గనఁబడుచున్నారా ?

జీవానంద—అచ్చట చ్చట విశ్రమించి యుండవచ్చును. భేరి మ్రోగించినచో నందఱును వచ్చి చేరుదురు.

ధీరానంద—ఒక్కఁడును లేఁడు.

జీవానంద—అ దేల ?

ధీరానంద—అందఱును కొల్లగొట్టుటకై పోయి యున్నారు. గ్రామములన్నియు నిపు డరక్షితము లై యున్నవి. ముసల్మానుల గ్రామములను, పట్టుపని చేయు కార్ఖానాలను

కొల్లగొట్టుకొని యిండ్లకుఁ బోయి చేరుదురు. ఎవ్వరును కనఁబడ లేదు. నే నిప్పుడే వెదకి చూచి వచ్చినాఁడను.

సత్యానందుఁడు విషణ్ణుఁడై, "ఎట్లయినను కానీ, నగరము తక్క సమస్తమైన వీరభూమి మనస్వాధీన మై యున్నది. నగరము బయట మనకుఁ బ్రతికక్షు లైనవా రెవ్వరును లేరు. కనుక, మీరు వీరభూమియందు సంతాన రాజ్యమునుఁ జేయుఁడు. ప్రజలచే పన్ను గొనుఁడు. మఱియు, నగరమును మన యధికారమునకు లోఁబఱచి కొనుటకు సైన్యమును సంగ్రహింపుఁడు. హిందువుల రాజ్య మైనది యని విన్నచో ననేకులు సంతానసైన్యము ననుకరింపఁగలరు." అని చెప్పెను.

అపుడు, జీవానందుఁడు మొదలగువారు సత్యానందునికి మ్రొక్కి, "మేము నమస్కరించు చున్నారము, ఓమహారాజాధిరాజా! అనుజ్ఞ నిండు; మేమీ కాననమునందే తమ సింహాసనమును స్థాపించెదము" అనిరి.

సత్యానందుఁడు పుట్టినది మొదలు కోప మెఱుఁగనివాఁడు. నేఁడు ప్రథమకోపమును బ్రకాశింపఁజేసి, 'ఛీ! నన్నొక మూర్ఖునిగాఁ దలంచితిరా? మన మెవ్వరమును రాజులము కాము—మనము సన్న్యాసులము—ఈదేశంబున కంతయు సాక్షాత్ వైకుంఠనాథుఁడే రాజు. నగరము మన యధికారమునకు లోఁబడఁగానే మీ కెవరియం దిష్టమో వాని శిరమున రాజమకుటము నుంపుఁడు. నేనుమాత్రము మీ బ్రహ్మచర్యవ్రతమును మాని యితరాశ్రమమును స్వీకరింపను. ఇది ఖండితముగాఁ దెలిసి యుండవలయును. ఇప్పుడు మీ మీ పనులకుఁ బోవనగు" ననియెను.

అప్పు డావల్వురును బ్రహ్మచారికి నమస్కరించి లేచి నిలువంబడిరి. సత్యానందుఁ డితరులకుఁ దెలియనీక సంజ్ఞ చేసి మహేంద్రుని నిలుపుకొనియెను. మిగిలిన ముగ్గురును వెడలి పోయిరి. సత్యానందుఁడు మహేంద్రునితో “మీరందఱును విష్ణుమంటపమున ప్రతిన వల్కి సంతానుల ధర్మమును గ్రహించితిరి. భవానందుఁడు, తా నొప్పుకొనియుండిన ప్రాయశ్చిత్తమునకు నేఁడు లోఁబడియెను. జీవానందుఁడు సహిత మెన్నఁడు ప్రాయశ్చిత్తమునకు లోఁబడి ప్రాణమును ద్యజించునో? అని నాకు భయమై యున్నది. అయినను నాకొక నమ్మిక మున్నది. ఏమన, ఒకానొక నిగూఢమగు కారణముచే నతఁడు ప్రకృతమునఁ జచ్చుట కిష్టము గలవాఁడుగా లేదు. నీవొక్కఁడవే ప్రతినను గాపాడుకొని యున్నవాఁడవు. ఇప్పుడు సంతానుల కార్యోద్ధార మాయెను. సంతానుల కార్యోద్ధార మగువఱకే నీవు నీ పెండ్లము బిడ్డల ముఖము చూడఁగూడదు; ఇప్పుడు సంతానుల కార్యము ఉద్ధరింపఁ బడెను. ఇఁక నీవు గృహస్థుఁడవు కావచ్చు” ననియెను.

మహేంద్రుని కన్నులనుండి నీరు ప్రవహించుచుండెను. కొంతవడికి మహేంద్రుఁడు, “స్వామీ! ఎవ్వరిని బొంది గృహస్థుఁడ నగుదును? భార్య ఆత్మఘాతినియై పోయెను. ఇఁక నా బిడ్డ యెక్కడ నున్నదో నే నెఱుంగను. ఎక్కడ దొరకును? బ్రతికియున్న దని సెల విచ్చియుంటిరి. ఇంతేకాక వేతెమియు నెఱుంగ” ననియెను.

తలపై చెట్టుకొమ్మయం దెవరో యుండి, ‘బిడ్డయుండు

చోటు నేనెఱుంగుదు' ననెను. మహేంద్రుఁడు తల యెత్తి చూచి 'నీవెవ్వ'రని యడిగెను.

సత్యానందుఁడు, కొంచెము కోపము దాల్చి, ముఖమును పైకెత్తి చూచుచు "నవీనానందా! నిన్ను వెడలి పొమ్మని యిదివఱకే సెల విచ్చి యుంటిని. ఇంకను ఇచ్చట నేల యున్నావు?" అనెను.

శాంతి కొమ్మపైనుండియే "ప్రభూ! స్వర్గలోకమందును మర్త్యలోకమందును తమ కధికారము కలదు. చెట్టుకొమ్మ పైనను గలదా?" యనెను.

ఇట్లని శాంతి కొమ్మపైనుండి తటాలున క్రిందికి దుమికెను.

సత్యానందుఁడు మహేంద్రునిఁ జూచి, "ఇతఁడు నవీనానందగోస్వామి. అతిపవిత్రాత్ముఁడు: నాప్రియ శిష్యుఁడు. ఇతఁడు నీ కొమార్తెను వెదకి పిలుచుకొని రాఁగలఁ"డని చెప్పి, శాంతికి కనుసన్న చేసెను. శాంతి నమస్కరించి సెలవు గైకొని పోయెను. అప్పుడు మహేంద్రుఁడు మరల "ని న్నెచ్చటఁ జూడనగు" నని యడిగెను.

శాంతి 'నాయాశ్రమంబునకు రావచ్చు' నని చెప్పి వడి వడిగాఁ బోయెను.

మహేంద్రుఁడు బ్రహ్మచారికి మ్రొక్కి, సెలవు గైకొని శాంతితోడ నామె యాశ్రమంబునకుఁ బోయెను. ఇంతలో రాత్రి కాల మాయెను. అట్లుండినను శాంతి విశ్రమింపక నగరాభిముఖియై చనెను.

అందఱును వెడలిపోయినమీఁద బ్రహ్మచారి యొకఁడే

భూమిపై సాష్టాంగనమస్కారము చేసి మనంబున జగదీశ్వరుని ధ్యానింప నారంభించెను. రాత్రి ప్రభాతమగుచు వచ్చెను. అపు డెవరోవచ్చి యతని మస్తకమును స్పృశించి "నేను వచ్చి యున్నాను" అనెను.

బ్రహ్మచారి లేచి చూచి విస్మితుఁడై బహువ్యగ్రభావ ముతో, "తాము దయచేసితి రేల?" అనెను. "దినము ముగిసె" ననెను. బ్రహ్మచారి "ప్రభూ! నేఁడు క్షమింపవలయును; రాఁ గల పున్నమనాఁటికి తమ యనుమతిప్రకారము వర్తింతు" ననియెను.

---

## ముప్పదియొనిమిదవ ప్రకరణము

### సంతానుల విజయోత్సాహము

ఈరాత్రి మొదలు ఉదయమగువఱకును హరిధ్వనిచే వీర భూమి నిండి నిబిడీకృతమై యుండెను. సంతానులు గుంపులు గుంపులుగాఁజేరి యెచ్చటఁ జూచినను ఉచ్చస్వరముతోఁ గొం దఱు "వందేమాతరం" అనియును, కొందఱు "జయ జగదీశ హరే" అనియును పాడుచు తిరుగుచుండిరి. కొందఱు శత్రు సైన్యమునఁ బడియుండిన యస్త్రములను, కొందఱు వస్త్రము లను బరిహరింప నారంభించిరి. కొందఱు హతులైనవారినిం ద్రొక్కుచు విజగ్రామాభిముఖులైరి. మఱికొందఱు నగ రాభిముఖులై చనిరి. వీరు చనునపు డెదురుపడినవారి నంద ఱను బట్టుకొని "వందేమాతరం" అని చెప్పుము, లేకున్నఁ బ్రాణముతో విడుచుట లేదని పీడించుట కారంభించిరి. కొం

దలు అంగళ్లను కొల్లగొట్టిరి. కొందఱు గొల్లలయిండ్లలోఁ బ్రవేశించి కుండచట్లను బగులగొట్టి పాలును పెరుగును ద్రాగిరి. కొందఱు 'మేము వ్రజగోపాలురము వచ్చి యున్నారము. గోవు లెక్కడ' నని యడుగుచుండిరి. ఇట్లు సంతానులు నానా విధములుగాఁ బ్రవర్తించుచు బోవుచుండిరి. ఆయొక్కనాఁటి రాత్రి గ్రామంబులందును నగరంబులందును మహాకోలాహల ముగ నుండెను. తురకలందఱును పరుగిడి పోయిరి. హిందువులకు రాజ్య మాయెను. అందఱును "హరీ హరీ" యని చెప్పుఁడని యఱచుచుండిరి. పల్లెటూళ్లవారుగూడ ముసల్మాను లగపడిన చోఁ గొట్టి పాఱఁద్రోలుచుండిరి. కొందఱు కొందఱు గుంపులు గుంపులుగాఁ జేరి ముసల్మానుల కొంపలకు నిప్పు బెట్టి యున్నదానిని దోఁచుకొని పోవుచుండిరి. అనేక యవనులు హతులైరి. అనేక ముసల్మానులు గడ్డములను గొఱిగించు కొని చందనమును బూసికొని హరినామమును జెప్పుటకా రంభించిరి. ఎవరైనను అడిగిన "నేను హెందు (హిందు)" అని చెప్పుచుండిరి.

ముసల్మానులు భయపడి నగరాభిముఖులై పరుగిడిరి. ఎచట మహారాజా వీరభూమ్యాధిపతియైన అసదుల్ జమాఁ బహద్దరు రాజసింహాసనమునఁ గూర్చుండి యుండెనో, అచ్చటి కీదారుణమైన రాజ్యధ్వంస సూచక మగు వార్త అందినది. అప్పుడు వ్యాకులచిత్తులై రాజపురుషులు నలుదిక్కులకు వెడలి పోయిరి. రాజుయొక్క మిగిలిన సిపాయీలు వస్త్రధారులై శస్త్రపాణులై నగరరక్షణార్థము వరుసగా నిలిచిరి. రాజ నగరకోటయం దచ్చటచ్చట శస్త్రపాణులై రక్షకులు నియ

మింపఁబడిరి. రాజధానియందు సమస్త జనులును రాత్రియం తయు జాగరణము చేయుచు నేమగునో యని చింతించు చుం డిరి. హిందువు లందఱును, "రానీ, సన్న్యాసులు రానీ, తల్లి దుర్గాదేవి యట్లేచేయనీ, హిందువుల యదృష్టము ఫలింపనీ" అని చెప్పుచుండిరి. ముసల్మానులు "అల్లా ఓ అక్బర్! మే మైదు పూటలు నమాజు చేసెదము. ఈహిందువుల గొట్టుటకుఁ గాలేదు. దునియా (ప్రంచము) యంతయు ఝూట్ (అబద్ధము)" అని యేడ్చుచుండిరి. ఇట్లు కొందఱు నవ్వుచును, కొం దఱు ఏడ్చుచు నుండిరి. అందఱును బహుభయముతో నారాత్రిని గడపిరి.

ఈవృత్తాంత మంతయు కల్యాణి చెవినిబడెను. ఆ బాల వృద్ధవనితలుఁను వినకయుండలేదు. కల్యాణి మనస్సున "'జయ జగదీశ హరే' నేఁడు కార్యసిద్ధి యాయెను. నేను నేఁడు నా స్వామి సందర్శనార్థమై యాత్ర చేసెదను. ఓ మధుసూదనా! నేఁడు నాకు సహాయ మొనర్పుము" అని భావించికొనియెను.

గభీర మైన రాత్రికాలమున కల్యాణి శయ్యను విడిచి లేచి యొక్కతెయే దొడ్డితలుపు దెఱచి, యట్టటు చూచి యెచ్చట నెవ్వరు లేరని తెలిసికొని మెల్ల మెల్లగా, గౌరీదేవి యంతఃపుర మును విడిచి రాజవీథికి వచ్చెను మనస్సున నిష్టదేవతను స్మరించికొని, "నేఁడు వారిని నేను పదచిహ్నగ్రామంబునఁ జూడ వలయును" అని తలంచికొనెను.

కల్యాణి నగరద్వారసమీపమున వచ్చి నిలిచెను. పహరా వాఁడు, "ఎవరీ వేళకు పోవువారు" అనెను. కల్యాణి,భయభ్రాంతురాలై దీనస్వరముతో "నే నాఁడుదానను" అనెను. పహ

రావాఁడు, 'పోవుటకు ఉత్తరవు లే' దనెను. ఈసమాచార ము దఫేదారు చెవినిఁ బడెను దఫేదారు 'బయటికి పోవుట యందు నిషేధము లేదుగాని, లోపలికి రానుమాత్రమే యుత్త రవు లే' దనియెను. ఆమాటవిని, పహారావాఁడు కల్యాణిని జూచి, "పోఅమ్మా! పోవుట కడ్డు లేదఁట. ఈదినము రాత్రి నిండా ఆపద; నీ వేమయ్యెదవో చెప్పలేను; నీవు దొంగలచేత దొర కుదువు; దొరకితివా చచ్చుట నిజము; నామాటను విను మమ్మా! ఈదినము రాత్రి బయటికి పోవద్దు; ఇఁక నీయిష్టము" అనెను.

కల్యాణి—అన్నా; భిక్షుకురాలను—నాయొద్ద నొక కా సైన లేదు. దొంగలు నన్నేమి చేయుదురు?

పహారావాఁడు యౌవన మున్నదిగదా! తల్లీ! ప్రపంచమున యౌవనమే సకలాభరణసంపదలు—చూడఁగా నీయం దది మహాదైశ్వర్యముగా నున్న' దనెను—కల్యాణి, ఏమో యది యొక విపత్తనియనుకొని, యేమియు మాటాడక మెల్లమెల్లగా నాస్థలమునుండి తప్పించుకొని వెడిలి పోయెను. పహారా వాఁడు, 'ఈ యాఁడుది రసికత్వమును దెలిసికొనక వెడలి పోయె' నని మనస్సులో ఖేదపడి యొక "దం" గంజాయి త్రాగి ఊఁగులాడుచు కరతాళము వేయుచు "ఝూం తకదై" అని పాడుట కారంభించెను.

ఆరాత్రి మార్గమున పథికులు కొందఱు 'కొట్టుఁడు కొట్టుఁ' డనియును; కొందఱు 'ఉఱుకుఁడు ఉఱుకుఁ' డనియును, కూఁతలు వెట్టుచుండిరి. కొంద ఱేడ్చుచుండిరి; కొందఱు నవ్వుచుండిరి. చేతికి దొరకినవారినిఁ బట్టికొని పోవుచుం

డిరి. దీనినంతయుఁ జూచి, కల్యాణికి మిక్కిలి కష్టము సంభవించెను. మార్గము తెలియదు. ఎవరినైన నడిగి తెలిసికొనుటకును వీలులేదు. అందఱును రణోత్సాహులై యుండిరి. కేవలము చీఁకటియందు పొంచికొని పోవలయును. అచ్చటచ్చట వచ్చెడు వారిని పోయెడువారిని పట్టుకొని పోవుచుండిరి. కల్యాణియు మహోద్ధతులును ఉన్మత్తులునగు నొకవిద్రోహులచేతికిఁజిక్కెను. వారతి ఘోరమైన ధ్వనిచేయుచు నామెను పట్టుకొనిరి. కల్యాణి యిట్టూర్పు విడిచి తప్పించుకొని పరుగిడి యడవింబడెను. అక్కడఁగూడఁ గొందఱు దొంగలు వెంబడించిరి. ఒకఁడు పాఱివచ్చి యామె చెఱఁగుఁబట్టి, "ఓచంద్రబింబాననా!" యనెను. ఆసమయమున నింకొకఁ డకస్మాత్తుగా వచ్చి, యాదురాచారియైనదొంగను నొక్క దెబ్బకే నేలం బడునట్లు తన్నెను. వాఁడు దెబ్బతిని పాఱిపోయెను. ఆతన్నినవాఁడు సన్న్యాసి. కావి వస్త్రము గట్టి యుండెను. కృష్ణాజినముచే నావృతవక్షుఁడై యుండెను. బాల్యవయస్సు గలవాఁడు. అతఁడు కల్యాణిని "భయపడవలదు, నాతోడరమ్ము, ఎక్కడికిఁ బోయెద" వని యడిగెను.

కల్యాణి—పదచిహ్నగ్రామంబునకు.

ఆగంతుకుఁడు చమత్కృతుఁడై యాశ్చర్యపడి "పదచిహ్న గ్రామంబున కేల" అని యడిగి, తనయెదుట నిలిచియుండిన కల్యాణి భుజముపై చేయిడి యాచీఁకటిలోనే యామెను గుర్తించి చూచుచుండెను.

కల్యాణి, పురుషస్పర్శముచే రోమాంచయై భయాశ్చర్యాన్వితురాలై చింతించుచు కన్నీరు నించెను. పరుగెత్తి పోవు

టకును సాధ్యము లేదు. భయవిహ్వాలయై వడవడ వడం కెను. ఆ వచ్చినవాఁడు చూచిచూచి చాలించి "'హా రే మురారే" తెలిసికొంటిని; నీవు దురదృష్టవతి యగుకల్యాణి కదా" యనెను.

కల్యాణి భీతయై, 'తా మెవర' రని యడిగెను.

ఆగంతుకుఁడు—నేను నీదాసానుదాసుఁడను; సుందరీ! నాయందు ప్రసన్నురాలవు కమ్ము.

కల్యాణి, అతివేగముతో నచటనుండి జరిగిపోయి హా యని యఱచి తర్జనగర్జనములు చేసి 'యీ యవమానము చేయు టకా నీవు నన్ను రక్షించినది? బాగాయె, చూడఁగా బ్రహ్మ చారివేషము, బ్రహ్మచారిధర్మ మిదేనా? నేను నేఁడు సహాయ రహితను, లేకుండినచో నీమూతికి మట్టిగొట్టియుందును' అని కోపగించెను.

ఆ బ్రహ్మచారి, 'ఓ విస్మితవదనా! నేను పెక్కుదినములు గా నీ శ్రేష్ఠమైన శరీరస్పర్శనమును గోరుచుంటి' నని వేగ ముగాఁ బోయి కల్యాణిని గాఢాలింగనము చేసికొనెను అప్పుడు కల్యాణి పకపక నవ్వి, 'అయ్యో దుర్మార్గురాలా! మొదటనే చెప్పరాదా? నాకు నిదే యవస్థ యని చెప్పరాదా?' యనెను.

శాంతి, 'ఏమక్కా! మహేంద్రుని వెదకికొని పోవుచు న్నావా?' యని యడిగెను.

కల్యాణి—నీ వేమి యందఱమనస్సును గుర్తెఱింగిన దానవా?

శాంతి—నేను బ్రహ్మచారిని—సంతానసేన కంతయు నధినాయకుఁడను; ఘోరమైన వీరపురుషుఁడను; నాకుఁ దెలి

యనిది కలదా? అన్నియుఁ దెలియును. ఈదినము మార్గము నందు సిపాయీలయు సంతానులయు అవాంతరము అధికముగా నున్నది. నీవు పదచిహ్నామునకుఁ బోవుటకు సాధ్యముకాదు.

కల్యాణి—ఏప్పుట కారంభించెను.

శాంతి, భయ మేమి? మనము మన నయనబాణంబులచే వేలకొలఁది శత్రువుల నైనను గొట్టివేయఁగలము; రా, పద చిహ్నామునకుం బోవుదము' అనెను.

కల్యాణి,'యిట్టిబుద్ధిశాలియైనయాఁడుదాని సహాయముచే స్వర్గమే దొరకినట్లు పొంగి 'నడువుము, నీవెంబడి నే వచ్చెద' ననెను.

శాంతి, ఆకాననమార్గంబున నామెను పిలిచికొని పో యెను.

---

## ముప్పదితొమ్మిదవప్రకరణము

### కల్యాణి మహేంద్రునిఁ జూచుట

శాంతి ఆనందమఠాశ్రమంబునుండి గంభీర మైన రాత్రి కాలమున నగరాభిముఖియై చనునపుడు జీవానందుఁ డాశ్రమ మున నుండెను.

శాంతి జీవానందునిఁజూచి, "నేను నగరంబునకుఁ బోయి మహేంద్రునిభార్యను పిలిచికొని వచ్చెదను, నీవు మహేంద్రు నితో నతనిభార్య జీవించి యున్నదనిచెప్పు" మని చెప్పి యుండెను.

జీవానందుఁడు భవానందునివలన కల్యాణియొక్క పున రుజ్జీవనవిధమునంతయు విని యుండెను. మఱియు నామె యప్పుడు వసించుచుండిన వాసస్థానమును ఆసర్వస్థానవిచారిణియైన శాంతివలనఁ దెలిసికొని యుండెను. కనుక, వాఁడు ఈకథ నంతయు మహేంద్రునికిఁ దెల్పెను.

మహేంద్రుఁడు విని మొదట నమ్మలేదు. తుదకు ఆనంద సాగరమగ్నుఁడై ముగ్ధప్రాయుఁడాయెను.

ఆదినము రజనీప్రభాతసమయంబున శాంతియొక్క సహా యముచేఁ గల్యాణికి మహేంద్రుని దర్శన మాయెను. నిశ్శబ్ద మగు కాననమధ్యంబున దట్టముగాఁ బెరిగి యుండిన చెట్లనీడల యంధకారచ్ఛాయయందు పశుపక్షులకు నిద్రాభంగ మగుటకుఁ బూర్వమే వారికి పరస్పరదర్శనలాభము గలిగెను. దీనికి సా క్షులు—కేవలము ఆనీలమైన గగనవిహారులగు మ్లానకిరణ ములుగల నక్షత్రనిచయమును, గాలిలేక నిష్కంపముగ నిలి చియుండిన యనంతమైన తరువులును దూరముగా శిలలపైఁ బడి పారలి మొఱలిడుచు వచ్చుచుండు మధుర కల్లోలిని యైన సంకీర్ణనదీ ఝర్ఝర శబ్దమును, ఎచ్చటనో దూరముగ పూర్వ దిగ్భాగమందు సముదితమైన ఉషాముకుటకాంతినిఁ జూచి యా హ్లాద మొంది కూయుచుండు కోకిలధ్వనియునే.

తెల్లవాఱుట కింకను నొకజా ముండెను. అచ్చటికి శాంతి యును జీవానందుఁడును వచ్చి దర్శనమొసంగిరి. కల్యాణి శాం తినిఁగూర్చి "మీకు మేము మూల్యములేని విక్రీతులమై యున్నా ము. మాకొమార్తెను వెదకి యిచ్చి యుపకారఫలమును సం పూర్ణముగాఁ బొందుఁ" డనియెను.

శాంతి జీవానందుని ముఖమును జూచి, "నేను కొంచెము పరుండెదను. ఈదినమంతయు నొకచోటఁ గూర్చుండ లేదు. రెండురాత్రులుగా నిద్రయే లేదు" అనెను.

కల్యాణి కొంచెము నవ్వెను. జీవానందుఁడు మహేంద్రునిఁ జూచి, "ఆభారము నాయందున్నది, మీరు పదచిహ్నగ్రామంబునకుఁ బొండు. అచ్చటికే బిడ్డ వచ్చు" ననెను.

జీవానందుఁడు భైరవపురంబునకు నిమాయిమణియొద్ద నుండిన బిడ్డను తెచ్చుటకై వెడలిపోయెను. చేయఁబూనినపని సులభమైనదిగాఁ గనఁబడలేదు.

మొదట, నిమాయిమణి గుటకలు మ్రింగెను. అటునిటు చూచెను. పిదప నాసాపుటములు వికసితమాయెను. తర్వాత యేడ్చెను.

నిమాయిమణి గుండ్రముగను ముద్దుగను నుండిన మంజేతితోఁ గన్నుల నులిమి నులిమి తుడిచికొన్న పిదప, జీవానందుఁడు, "ఏమమ్మా! యేడ్పు లేల? ఆచోటు దూరము కాదు, వారి యింటికిఁ బోయి అప్పుడప్పుడు చూచుకొని రావచ్చును. కష్టమేమియు లే" దనియెను

నిమాయిమణి వికసిత నాసాపుటయై, "శిశువేమోనీది నీవే పిలుచుకొనిపో, నాకేల"అని చెప్పి సుకుమారినిఁబిలుచుకొని వచ్చి జీవానందునియొద్ద కోపముతోఁ గూర్చుండఁబెట్టి, యొక మూల పోయి కూర్చుండి కన్నీరు నించెను. యత్నములేక జీవానందుఁ డింకేమియు జెప్పక ఆమాట లీమాట లెత్తెను. అయినను, నిమాయిమణి కోప మాఱలేదు. ఆమె లేచి పోయి సుకుమారియొక్క బట్టలమూటను సొమ్ముల పెట్టెను

బొమ్మల సామానులను దెచ్చి జీవానందుని ముందు పడవైచెను. సుకుమారి వానినన్నటిని గుంపుగాఁ జేసి, నిమాయినిఁ జూచి, "అమ్మా!—అమ్మా! యెచ్చటికి పోవలెనమ్మా? ఇదంతాయెందుకమ్మా?" అనియడిగెను. నిమాయి కిఁక సహించుటకుఁ గాలేదు. అప్పు డామె సుకుమారి నెత్తుకొని యేడ్చుచు వెడలిపోయెను.

"కన్నమురులుకన్న సాఁకినమురు లెక్కువ" అనుదానికిదే సాక్షి.

---

## నలుబదియవ ప్రకరణము

### మహేంద్రుని మనోవిచారము

పదచిహ్నగ్రామంబున నూతనముగా నిర్మింపఁబడిన దుర్గమధ్యమునందు నేఁటిదినము మహేంద్రుఁడు, కల్యాణి, జీవానందుఁడు, శాంతి, నిమాయిమణి, నిమాయిమణిపతి, సుకుమారి, వీరందఱును సుఖముగాఁ జేరి యుండిరి. శాంతి నవీనానందవేషముతోనే యుండెను. కల్యాణినిఁ బిలిచికొనివచ్చిన నాఁటిరాత్రి యామె కల్యాణికి మగనితో తా నాఁడుది యని తెలుపవలదని చెప్పి యుండెను. ఒకనాఁడు కల్యాణి శాంతిని తన యంతఃపురమునకుఁ బిలిపించెను. నవీనానందుఁ డంతఃపురమునకుఁ బోయెను. కావలివారు ఆటంకము చేసినను వినక లోపలికిఁ బోయెను.

శాంతి కల్యాణినిఁ జూచి— 'నన్నేల రప్పించితి' వనియడిగెను.

కల్యాణి—పురుష వేషముతో నెన్ని దినము లుండవలదు ను? ఒక్కటిఁగాఁజేరి మాటలాడుటకునైతము వీలులేదు. నీ విట్టి దని నాపతితోఁ జెప్పవలయును.

నవీనానందుఁడు పెద్దప్రొద్దు చింతించి యుత్తరమియ్యక యుండెను. పిమ్మట, 'నిజము చెప్పుటవలన బహువిఘ్నంబులు సంభవించు' ననియెను.

ఇరువురునాసంగతినిఁగూర్చి మాటలాడఁ దొడంగిరి. ఇంతలో నవీనానందుని యంతఃపురంబునకుఁ బోఁగూడ దని యాటంకపఱిచిన కావలివారు, మహేంద్రునితో "నవీనానందుఁడు ఆటంకపఱిచినను వినక అంతఃపురమును బ్రవేశించె" నని తెల్పిరి. వెంటనే మహేంద్రుఁ డంతఃపురమునకుఁ బోయెను. కల్యాణి శయ్యాగృహంబునకుఁ బోయి చూడఁగా, నవీనానందుఁడు మంచముదగ్గర నిలుచుకొని యుండెను. కల్యాణి, అతఁడు ధరించియున్న వ్యాఘ్రచర్మముయొక్క దారము ముడిని విప్పుచుండెను. మహేంద్రుఁ డత్యంతాశ్చర్యమొంది కోపపరవశుఁ డాయెను.

నవీనానందుఁ డతనింజూచి నవ్వి—ఏమిగోస్వామి!సంతానులందే నమ్మకములేదా? యనెను,

మహేంద్రుఁ—భవానంద ఠాకూరు నమ్మకస్థుఁడుగా నుండెనా?

నవీనానందుఁడు కనులం డ్రిప్పుచు—కల్యాణి భవానందుఁడు కట్టుకొనియున్న పులిచర్మము ముడిని విప్పెనా? అని చెప్పుచు కల్యాణియొక్క చేతినిదీసి ముడిని విప్పవద్దనెను.

మహేంద్ర—దానివలన నేమి?

నవీనానంద—నన్ను నమ్మక యుండవచ్చును—కల్యాణిపై అపనమ్మక ముంచుట న్యాయమా?

మహేంద్రున కేమియుఁ దోఁచక అప్రతిభుఁడై "ఎపుడు, ఎందులకు నమ్మకయుంటిని" అనెను.

నవీనానంద—అట్లు కాకున్నచో నావెనువెంట నే యంతఃపురంబునకు రావలసిన దేల?

మహేంద్ర—కల్యాణితో నాకుఁ బనియుండెను; అందులకై వచ్చితిని.

నవీనానంద—అట్లయినచో నిప్పుడు కల్యాణితో నాకును గొంచెము పని యున్నది ; దయచేసి తాము వెడలిపోయినచో నేను మొదట మాటలాడి పోయెదను. ఇల్లు వాఁకిలి తమది. కల్యాణి తమది. తా మెప్పుడు తలఁచినను మాటలాడవచ్చును. నేను కష్టపడి యొక్కతూరి వచ్చినవాఁడను.

మహేంద్రుఁడు మూఁగవానివలె నిలిచెను. ఏమియుఁ దోఁచకుండెను. ఆపలుకులను వినఁగా అపరాధిమాటలుగా నుండలేదు. కల్యాణియొక్క భావము విచిత్రమై యుండెను. ఆమెయు అవిశ్వాసినివలె పాఱిపో లేదు, భయపడలేదు, లజ్జితురాలు కాలేదు—కొంచెము చిఱునవ్వు నవ్వుచుండెను. మఱియు కల్యాణి యాచెట్టుక్రింద నిరాయాసముగా విషమును మ్రింగినట్టిది. అట్టిది యపరాధి యగునా ? మహేంద్రుఁ డిట్లు చింతించుచున్న సమయంబున అభాగినియైనశాంతి మహేంద్రుని దురవస్థను గాంచి కొంచెము నవ్వి, కల్యాణిని విలోలకటాక్షముతోఁ జూచెను. అపు డాకస్మికముగా నంధకారమున వెల్తురు కలిగిన ట్లాయెను. మహేంద్రుఁడు చూడఁగా అది

రమణియొక్క కటాక్షముగా నుండెను. సాహసధైర్యములతో నవీనానందుని గడ్డమునుబట్టి యీడ్చెను. కృత్రిమగడ్డమును మీసములును చేతికి వచ్చెను. ఆసమయంబున కల్యాణి అవకాశమును గైకొని పులిచర్మము ముడిని విప్పివేసెను. చర్మము క్రింద పడిపోయెను.

శాంతియు—నేలపైఁబడి అవనతముఖి యాయెను.

మహేంద్ర—నీ వెవ్వరు? అని యడిగెను.

శాంతి—నేను శ్రీమాన్ నవీనానందగోస్వామి.

మహేంద్ర—అది దొంగవేషము. నీవు స్త్రీవే?

శాంతి—ఇప్పుడు యత్నము తప్పెను.

మహేంద్ర—ఇప్పుడుమఱొక్కటియడిగెదను—నీవాఁడుదానవై యుండి సదా జీవానందఠాకూరు సహవాసముననే యుండెద వేల?

శాంతి—దానిని తమతో నేను జెప్పలేను.

మహేంద్ర—నీవు వనితవు. జీవానందఠాకూరు నెఱుఁగుదువా?

శాంతి—ఎఱుఁగుదును.

దీనిని విశుద్ధాత్ముఁడైన మహేంద్రుఁడు విని కందిన మోముగలవాఁ డాయెను. ఇఁక నిజము చెప్పవలయు నని తలంచి కల్యాణి, "ఈమె జీవానందగోస్వామియొక్క ధర్మపత్నియగు శాంతిదేవి" యనెను.

ఒక ముహూర్తమాత్రము మహేంద్రునిముఖము ప్రఫుల్లమాయెను. మరల నాముఖమున నంధకారము క్రమ్ముకొ

నెను. మహేంద్రుని యభిమతంబు నెఱింగి కల్యాణి, "ఈమె బ్రహ్మచారిణి" యనెను.

మహేంద్రుఁడు విషణ్ణుఁడై, అయినను, ప్రాయశ్చిత్త మున్న దని చెప్పి, శాంతి ముఖమును జూచుచుఁ "బ్రాయశ్చిత్త మేమి? తమకుఁ దెలియునా" యనెను.

శాంతి—మరణము. ఇది ఏసంతానునికిఁ దెలియదు? రాఁగల మాఘశుద్ధపూర్ణిమనాఁడు ఆప్రాయశ్చిత్తము కావలయు నని నిశ్చయింపఁబడినది. తాము నిశ్చింతతో నుండుఁడు.

ఈమాటను జెప్పి శాంతి యచటనుండి వెడలిపోయెను. మహేంద్రుఁడును కల్యాణియు వజ్రాహతులైనవారివలెనే నిలుచుకొని యుండిరి.

---

## నలువదియొకటవ ప్రకరణము

### ఎడ్వర్డ్సు దీర్ఘాలోచనము

ఉత్తరబంగాళము ముసల్మానుల చేయి విడిచి పోయెను. అయినను ముసల్మాను లెవ్వరును ఈమాట చెప్పుకొనుటయు లేదు! ఒప్పుకొనుటయు లేదు. కొందఱు దుర్మార్గులు అపుడపుడు సమయము చూచి హిందువులను తొందరచేయుచుండిరి. అందఱును పట్టి తెచ్చునట్లును చెప్పుచుండిరి. ఇట్లు చాల దినములు చెప్పుచుండిరికాని, యేపని జరుగలేదు. ఈ సమయంబున భగవదాజ్ఞచే కలకత్తాయందు వారన్ హేస్టింగ్సు గవర్నరుజనరలుగా నుండెను. వారన్ హేస్టింగ్సు కన్నులు

మూసికొనియుండు మనుష్యుఁడుగా నగపడలేదు. అతని కా విద్య తెలిసి యుండినచో నీకాలమందు భరతఖండమున బ్రిటిషు సామ్రాజ్య మెక్కడ నుండెను? పిమ్మట, మేజరు ఎడ్వర్డ్సు అను రెండవసేనాపతి క్రొత్తసైన్యముతో కలకత్తాకు వచ్చి చేరెను.

ఎడ్వర్డ్సు కిది యూరోపియనుల యుద్ధము కాదని తెలియవచ్చెను. శత్రువులకు సైన్యము లేదు. రాజధాని లేదు. కోటలు లేవు. అయినను అంతయు వారి యధీనమం దుండె నని తెలిసినది ఏదిన మెచ్చట బ్రిటిష్ సేనాశిబిరమో యా దినము మాత్రము ఆస్థలము బ్రిటిష్ సేనాధీనమై యుండును. మఱుదినము బ్రిటిష్ సేన యాస్థలమును విడిచి పోయినచో నాల్గుదిక్కులందును "వందే మాతరం" పాడఁబడును. ఎక్కడ నుండియో చీమలబారుతీరుగా రాత్రి యెం దింతమంది వచ్చి యాంగ్లేయుల వశమం దున్న గ్రామములను కాల్చుటయును స్వల్పసంఖ్యగల బ్రిటిష్ సేన చిక్కినచో నాక్షణమే ధ్వంసము చేయుటయును ఎడ్వర్డ్సుదొర తెలిసికొనఁజాలక పోయెను. తుదకు ఆసేనాపతి, పదచిహ్నగ్రామంబున కోటను గట్టుకొని యచటనే తమయాయుధశాలను ధనాగారమును నిర్మించికొని యున్నా రని తెలిసికొనెను. కావున, అతఁడు ఆదుర్గమును పట్టు కొనవలయు ననెడి స్థిరప్రతిజ్ఞ కలవాఁ డాయెను.

ఎడ్వర్డ్సు, గూఢచారులవలన పదచిహ్నమున నుండు సంతానులసంఖ్యను దెలిసికొనెనుగాని, వెంటనే యాదుర్గము నాక్రమించుటకు ధైర్యము లేకపోయెను. అయినను మనస్సునం దొక యపూర్వమైన కౌశలము నేర్పాటు చేసికొనియెను.

మాఘశుద్ధపూర్ణిమ సమీపించెను. ఆనాఁడు వానిశిబిరం బునకు సమీపమున నుండు కేందుబిల్ల మనుగ్రామమున గోసాయీల పరిషత్తు జరుగుట కలదు. కాఁబట్టి ఈతూరి ఆపరిషత్తు కోలాహలముగా జరుప నిశ్చయించిరి. అక్కడ సామాన్యముగా ప్రతిసంవత్సరము నొకలక్ష ప్రజ చేరును. ఈవత్సరము వైష్ణవులరాజ్యాధికార మైనందున వైష్ణవులు పరిషత్తును బహు సంభ్రమముగా జరుపవలయు నని యెంచి యుండిరిగాన, సంతానులందఱును కేందుబిల్ల గ్రామంబునకు వచ్చి చేరుదు రని తలంచుట కవకాశము కలిగినది. మేజరు ఎడ్వర్డ్సుదొర, పదచిహ్నగ్రామంబుననుండు ధనాగారరక్షకులుకూడ పరిషత్తుకు రాఁగలరుగాన, నాసమయంబునఁ బోయి పదచిహ్నదుర్గమును స్వాధీనము చేసికొనవలయు నని యాలోచించి యుండెను.

ఎడ్వర్డ్సు ఈయభిప్రాయమును మనమునం దుంచికొని బాహ్యముగా పరిషత్తునాఁడు కేందుబిల్లగ్రామంబు నాక్రమించుకొనఁబడుననియు, ఆదినమే శత్రువులు అందఱును నిశ్శేషముగా జంపఁబడుదు రనియు, కనుక వైష్ణవుల పరిషత్తును జరుపఁగూడ దనియుఁ బ్రచురించెను.

ఈసమాచారము ప్రతిగ్రామంబునను బ్రచురింపఁబడియెను. ఇందువలన నచ్చటచ్చట నున్నసంప్రదాయస్థులందఱును ఆ యుద్ధపాణులై కేందుబిల్లగ్రామమున కేఁగి పరిషత్తు జరుపఁదలంచి పోయి చేరిరి. సకల సంతానులును మాఘశుద్ధపూర్ణిమదినమున కేందుబిల్లగ్రామముఁ జేరిరి. ఎడ్వర్డ్సునొక తలఁచినట్లే యాయెను. ఆంగ్లేయుల యదృష్టమునకు సరిగా మహేంద్రుఁడును ఈ మోసకృత్యమునకు లోఁబడియెను.

మహేంద్రుఁడు పదచిహ్నగ్రామంబున స్వల్పసంఖ్యగలసైన్యము నుండునట్లు నియమించి గొప్పసైన్యమును దీసికొని కేందుబిల్ల గ్రామంబునకు బయలువెడలెను.

ఇవన్నియు జరుగుటకు మునుపే జీవానందుఁడును శాంతి యును పదచిహ్నగ్రామమునుండి వెడలిపోయిరి. అపుడు యుద్ధ సమాచార మేమియు నుండలేదు. మాఘపూర్ణిమాపుణ్యదిన మున శుభముహూర్తమునందు జయదేవగోస్వామియొక్క తీర్థ మైన అజయనదీపవిత్రజలమున నాత్మసమర్పణచే ప్రాణవిసర్జ నము చేసి ప్రతిజ్ఞాభంగ మహాపాపంబునకుఁ బ్రాయశ్చిత్తము జేసికొనవలయు నని వారిరువురయొక్క యభిసంధియై యుండెను. అయినను, వారు త్రోవలోఁ బోవుచుండఁగా కేందుబిల్లగ్రా మంబునఁ జేరెడు సంతానులకు రాజసైనికులకును మహా ఘోరయుద్ధము కాఁబోవుచున్నదని వినిరి. జీవానందుఁ "డట్లైనచో యుద్ధముననే చచ్చిపోదము, నడువు" మనియెను.

వా రతివేగముగా పోవుచుండిరి. మార్గమున నొకకొండ కనఁబడెను. అంత నాకొండ నెక్కి యావీరదంపతులు చూచిరి. కొంచెము దూరమున నాంగ్లేయుల శిబిరము కనఁబడెను. శాంతి—చచ్చుమాట యిపు డటుండనిమ్ము; "వందేమా తరం" చెప్పు మనియెను.



*

# నలువది రెండవ ప్రకరణము

## శాంతి యెడ్వర్డ్సును మోసపుచ్చుట

అప్పు డాయిద్దరును నేమో మాటలాడు కొనిరి. మెల్లగా జీవానందుఁ డొకవనంబున దాఁగికొనియెను. శాంతియు మఱొకవనంబునఁ బ్రవేశించి యచ్చట నొక యద్భుతమైన రహస్యకార్యమునందు ప్రవృత్తురా లాయెను.

శాంతి చచ్చుటకై పోవుచుండెను; అయినను చచ్చు సమయంబున స్త్రీ వస్త్రములను ధరింపవలయు నని స్థిరపఱచికొని యుండెను. ఆమెయొక్క పురుషవేషము మోసము చేయుటకుఁ దగినదని మహేంద్రుఁడు చెప్పి యుండెను. మోసము చేసి చచ్చుట సరికాదు. కావున, తనవెంట నొక తెల్ల చీరను దెచ్చి యుండెను. ఇంకను గొన్నివస్తువులు నుండెను. నవీనానంద వేషము దీసివేసి మాఱువేషమునఁ బ్రవృత్తురాలాయెను.

ముఖంబున కుంకుమముతో నూర్ధ్వపుండ్రము నుంచుకొని, వైష్ణవస్త్రీవేషముతో సారంగమును మీటుచు మనోహరముగ గానము చేయుచు నాంగ్లేయుల శిబిరంబునకుఁ బోయెను. ఆమెను చూచి సిపాయీలు మోహితులైరి ఆమె కంఠమును విని జావళీ పాడు మనిరి. కొందఱు కేదారగౌళరాగము నాలాపనము చేయు మనిరి. కొందఱు కీర్తన పాడు మనిరి. కొందఱు కృష్ణుని విషయముగను, కొందఱు కాళికావిషయముగను, ఇట్లు నానావిధములుగాఁ జెప్పి, పాటలను పాడించి

బియ్యము, పప్పు, ఉప్పు, దుడ్డు, చీర, రవికె మొదలగువాని నొసంగిరి. ఆవైష్ణవి శిబిరముయొక్క స్థితినంతయు జక్కఁగాఁ జూచికొని వెడలెను. అప్పుడు సిపాయీలు 'మరల నెప్పుడు వచ్చెదవు?' అని యడిగిరి. వైష్ణవి 'చెప్పలేను, నే నుండుట చాలదూర' మనియెను. ఎంతదూర మని యడుగఁగా 'పద చిహ్నమున నున్నదాన' ననియెను. ఆదినము మేజరు ఎడ్వర్డ్సు దొర పదచిహ్నగ్రామవిషయమై కొన్నిసంగతులను విచారించు చుండెను. ఇది యొకసిపాయికిఁ దెలిసి యుండెనుగాన, ఆవైష్ణవిని కేప్టన్ చెంతకుఁ బిలిచికొని పోయెను. కేప్టన్‌దొర ఎడ్వర్డ్సు దొరయొద్దకుఁ దోడ్కొని పోయెను. ఆవైష్ణవి మధురమైన హాసన్ముఖముతో మర్మభేది యగు కటాక్షము నిగుడించి ఎడ్వర్డ్సుదొర తల తిరుగునట్లు చేసెను. చేత నున్న సారంగ మును మీటుచు మాళవరాగమున రూపకతాళగతితో

"మ్లేచ్ఛనివహనిధనే కలయసి కరవాలమ్" అని పాడెను.

ఎడ్వర్డ్సు—నీ యిల్లెక్కడ బీబీ!

బీబీ—నేను బీబినికాను, వైష్ణవిని. నాయిల్లు పదచిహ్నమునం దున్నది.

ఎడ్వ—Well, that is Padsin—Padsin is it? అచ్చట నొక గర ఉన్నదా?

వైష్ణ—ఘర్ (ఇల్లు)? ఎన్నియో యున్నవి.

ఎడ్వ—గర్ కాదు, గర్ కాదు, గర్ కాదు.

వైష్ణ—నీమనసులోనిమాట తెలిసెను. కోటయా?

ఎడ్వ—ఎస్, ఎస్, కోటు! కోటు! ఉన్నదా?

వైష్ణ—కోట యున్నది. పెద్దకోట.

ఎడ్వ——ఎంతజనము?

వైష్ణ——కోటలో నెంద ఉన్నారని యడిగెదవా? 20-25 వేల జన ముందురు.

ఎడ్వ——నాన్సెన్సు, ఒకకోటయందు 3-4 వేల జన ముండు టకే చాలదు. ఇంక నున్నారా? వెళ్లిపోయిరా?

శాంతి——ఎక్కడికి పోవుట?

ఎడ్వ——పరిసకు. కిండలకు.

శాంతి——కేందులికా; కేందులికి వారు పోరు.

ఎడ్వ——నీ వక్కడనుండి యెప్పుడు వచ్చితివి?

శాంతి——నిన్నరాత్రి వచ్చితిని.

ఎడ్వ——వా రీదినము వెళ్లి యుండవచ్చును.

శాంతి యంతరంగమున నీశ్రాద్ధము చేయింపకున్నచో నారసికత్వ మంతయు వ్యర్థ మనితలంచి, ప్రకాశముగా "ఓదొరా! అట్లుండవచ్చును. ఈదినము వారు బయటికి వెళ్లియుండ వచ్చును. సమాచారము నాకు సరిగా తెలియదు. నేను వైష్ణ విని; అచ్చట చ్చట పాడుచు బిచ్చము తెచ్చుకొని తినుదానను. ఆసమాచారము నాకేల? పాడిపాడి గొం తెండిపోయెను. ఏమైన నిచ్చిన తీసికొని వెళ్లెదను. కొంచెము హెచ్చుగా నిచ్చినచో ఎలుండి వచ్చి చెప్పఁగలను" అనియెను.

ఎడ్వర్డ్సుదొర ఒక రూపాయి తీసి పడవేసి, ఎల్లుండికి కాదు బీబీ! నా కీదినము రాత్రికే వర్తమానము రావలెను.

శాంతి——మంచిది, నీవు ఒక బుడ్డి సారాయి త్రాగి తుపాకిని తలక్రింద నుంచికొని నిద్రపో, నీకు సమాచారము

చెప్పుటకు నే నీదినము ఇరువదిమైళ్లు పోయి రావలెను గదా! బాగుగ నున్నది హనుమంతరాయా!

ఎడ్వ—హనుమంతరాయఁ డనఁగా నేమి?

శాంతి—అతఁడు మహావీరపురుషుఁడు, భారీ జనరల్.

ఎడ్వ—Great General! వానికన్నను బలవంతుఁడనై యున్నాను. క్లైవు వలెనే, అయినను నా కీదినము సమాచారము రావలెను. నూఱు రూపాయలు ఇనా మిచ్చెదను.

శాంతి—నూఱిమ్ము, వేయిమ్ము, ఇరువదిమైళ్లదూరము నడుచుటకు కాదు.

ఎడ్వ—గుఱ్ఱముపై నెక్కిపోతే?

శాంతి—గుఱ్ఱముపై నెక్కుటకు తెలిసి యున్నచో నేనీ వేషముతో వచ్చి నీతావున బిచ్చ ముడుగుచుంటినా?

ఎడ్వ—ఎవరైనను జీను వేసి కూర్చుండఁ బెట్టుకొనిన పోదువా?

శాంతి—ఇంకొకనితోఁ గూడనా! నాకు లజ్జకాదా?

ఎడ్వ—కష్టమేమి? ఏనూఱు రూపాయ లిచ్చెదను.

శాంతి—ఎవరు పిలుచుకొని పోవువారు? నీవే వచ్చెదవా?

ఎడ్వర్డ్సుదొర, ప్రేలితో నెదుట నిలిచి యుండిన లింట్లె అను నొక యౌవనపురుషుఁడైన ఎన్సైనును (Ensign) జూపి, వానిని బిలిచి, "లింట్లె! నీవు పోయెదవా!" అని యడిగెను.

శాంతియొక్క రూపలావణ్యంబును గాంచి మిక్కిలి సంతోషముతోఁ 'బోయెద' ననెను.

అప్పు డొక పెద్దయరబ్బీగుఱ్ఱములగాము జీను వేయఁబడి తయారుగా వచ్చి నిలిచెను. శాంతిని పట్టి యెత్తి గుఱ్ఱముపైఁ గూర్చుండఁబెట్టుటకై పోయెను. శాంతి, "ఛీ! ఇంతమంది యెదుటనా? నాకు లజ్జ లేదా? ముందు నడువుము? ఎత్తైన చోట నెక్కుకొనెద" ననియెను.

లిండ్లె గుఱ్ఱమును నడిపించుకొని పోయెను. శాంతి వెనుక పోయెను. ఇట్లిరువురును శిబిరమును విడిచిపోయిరి.

శిబిరమును విడిచి నిర్జనప్రాంతంబునకుఁ బోయిన పిదప శాంతి లిండ్లె కాలిపై కాలు నుంచి యెగిరి గుఱ్ఱముపై నెక్కుకొనియెను.

లిండ్లె నవ్వి "నీవు పక్కా సవారురాలవుగా నున్నావు" అనియెను.

శాంతి "నే నెంత పక్కా సవారురాలను గనుక నే నీతో గుఱ్ఱము నెక్కుటకు సిగ్గాయెను. ఛీ! ఛీ!! రికాబున కాలూని కొని గుఱ్ఱము నెక్కుదురా?" యనెను.

గర్వముతో లిండ్లె యొకమాటు రికాబునుండి కాలు దీసెను.

శాంతి యామూఢుఁడైన యింగ్లీషువానిని మెడబట్టి గుఱ్ఱమునుండి త్రోసివేసి గుఱ్ఱముపై నెక్కి కూర్చుండి కాలితోఁ గడుపుపై నొక తన్ను తన్ని వాయువేగముతో నాయరబ్బీ గుఱ్ఱమును దౌడాయించుకొని వెడలిపోయెను.

శాంతి నాలు గేండ్లుగా సంతానులసహవాసంబున మెలఁగి యుండినదిగాన గుఱ్ఱపుసవారి చక్కఁగా నేర్చుకొని యుండెను. అట్లు లేకుండినచో జీవానందునితోడ నెట్లు వసించుటకు

సాధ్యము? లిండ్లె కాలు విఱిగి పడెను. శాంతి వాయువేగ ముతో గుఱ్ఱమును దౌడాయించుకొని పోయెను.

శాంతి జీవానందుఁడు దాఁగియుండిన యరణ్యంబునకుఁ బోయి యతని కీసమాచారము నంతయుఁ జెప్పెను. అతఁ 'డటులైన నేను శీఘ్రముగా పోయి మహేంద్రుని హెచ్చరించె దను. నీవు కేందుబిల్ల గ్రామంబునకుఁ బోయి సత్యానందునికి సమాచారమును దెల్పుము. నీవు గుఱ్ఱముపైననే పొమ్ము, ప్రభువులకు శీఘ్రముగా సమాచారము చేరవలయును' అని చెప్పెను. అప్పు డాయిరువురును, ఒక్కొక్కదిక్కున కొక్కొ కరుగా పాఱిరి. శాంతి మరల నవీనానందుఁ డాయె నని చెప్ప వలసినది అనావశ్యకము.

---

## నలువదిమూఁడవప్రకరణము

### సంతానసైనికులు భగ్నోత్సాహులగుట

ఎడ్వర్డ్సు పక్కా ఇంగ్లీషువాఁడు. సామాన్యుఁడు కాఁడు. అచ్చటచ్చట జనులను ఉంచి యుండెను. శీఘ్రమున నావైష్ణవి లిండ్లెను పడవేసి గుఱ్ఱము నెక్కుకొని యెచ్చటనో మాయమై వెడలిపోయె నని సమాచారము తెలిసెను. మేజరు ఎడ్వర్డ్సుదొర "An imp of satan! strike the tents" కర్ణపిశాచిముండ! డేరాలను ఎత్తివేయుఁడు) అనెను.

అప్పుడు "టిక్ టిక్ ఖట్ ఖట్" అని తంబుర శబ్దము కాఁగానే డేరాలు దొర్లుట కారంభమాయెను. మేఘరచితమైన అమరావతివలెనుండిన యాంవస్త్రగృహ మంతర్హిత మాయెను. బండ్లపై మోపులవలెఁ బరిణమించెను. కొందఱు గుఱ్ఱములపై నెక్కిరి. కొందరు పాదచారులైరి. హిందువులు, ముసల్మానులు, మదరాసీలు, ఫరంగివారు అందఱును భుజములపై తుపాకులను మోసుకొని త్వరగా వెడలిరి. ఫిరంగిగుఁడ్ల బండ్లు గడగడమని పోవుచుండెను.

ఇంతలో మహేంద్రుఁడు సంతానసైన్యమును దీసికొని క్రమక్రమముగా కేందుబిల్ల గ్రామాభిముఖుఁడై పోవుచుండెను. ప్రాద్దైనందున దారియందే నిలువవలయు నని యెంచి యుండెను.

శిబిరమును స్థాపించుటయే యుచితముగా నగుపడెను. అయినను, వైష్ణవులకు శిబిరములు లేవు చెట్లక్రింద గోనెపట్టలు పఱచుకొని గంత బొంతలను కప్పుకొని నిద్ర చేసిరి. హరిచరణామృతమును గ్రోలి రాత్రియంతయుఁ గడపిరి. క్షుద్బాధ యొక్కటే బాధించుచుండెను. దానికి స్వప్నమున వైష్ణవీ కాకూరాణుల యధరామృతమును త్రావి కడుపు నింపుకొనవలయును. శిబిరంబునకుఁ దగినస్థలము సమీపముననే యుండెను. ఒకతోఁపు—అందు వేప మామిడి పనస మఱ్ఱి రావి మొదలగు గొప్పగొప్ప వృక్షము లుండెను. ఇచ్చట మజిలీ చేయవలయు నని మహేంద్రుఁడు ఉత్తరువు చేసెను. దానిసమీపముననే యొక కొండ గలదు. దాని నెక్కుట

చాల కష్టము. మహేంద్రుఁ డీకొండపై మజిలీ చేయుటకై యెక్కి చూచుకొని రావలయు నని యాలోచించెను.

ఇట్లు ఆలోచించుకొని మహేంద్రుఁడు గుఱ్ఱము నెక్కి మెల్ల మెల్లగా పర్వతశిఖరంబును నెక్కఁజూచెను. అతఁడు కొంచెము దూర మెక్కి పోఁగానే యొక వయస్కుఁడగు యోద్ధుఁడు వైష్ణవ సైన్యమధ్యమునఁ బ్రవేశించి "నడువుఁడు, పర్వతముపై నెక్కుఁ" డని చెప్పెను సమీపమున నుండువారు ""ఏల ? "" యని యడిగిరి.

యోద్ధుఁ డొక ఱాతిబండపై నిలిచికొని, "నడువుఁడు, ఈవెన్నెలరాత్రియం దీపర్వత శిఖరంబున నూతనమైన వసంత నవీన కుసుమాఘ్రాణము చేయుచు నేఁడు మనము శత్రువులతో జగడము చేయవలయు" ననియెను. చూడఁగా నతఁడు సేనా పతి జీవానందుఁడుగా నుండెను.

అప్పుడు గట్టిగా "హరే మురారే" అని శబ్దము నుచ్చరిం చుచు సైన్య మంతయు బల్లెముల నూనుకొని కొండపై కెక్కి జీవానందుని వెన్నంటి వడివడిగా పర్వతారోహణము చేయ నారంభించెను. ఒక్కఁడు తయారైన గుఱ్ఱమును జీవానందుఁ డెక్కుటకై తెచ్చి యిచ్చెను. మహేంద్రుఁడు దూరముగ నుండి చూచి విస్మితుఁడై "ఇదే మిది ? వీరు చెప్పకనే వచ్చుచున్నా" రని యనుకొనెను.

ఇట్లనుకొని మహేంద్రుఁడు గుఱ్ఱమును ద్రిప్పి, దౌడా యించుచు దిగివచ్చి సంతానవాహినీపతియైన జీవానందునిఁ గాంచి "ఇ దేమి; మరల ఆనంద మేమి ; " అని యడిగెను.

జీవానందుఁడు నవ్వి "ఈదినము మహాదానందము, కొండ పైనను కొండక్రింది భాగముననుసహా ఎడ్వర్డ్సుదొరసైన్య మున్నది. ఎవరు ముందుగా పై కెక్కుదురో వారికి జయము" అని చెప్పి, సంతానసైన్యమును గూర్చి గట్టిగా; "నే నెవ రైనది తెలియునా? నేను జీవానంద గోస్వామిని; అజయనదీ తీరమున అనేకవేల శత్రువుల ప్రాణవధ చేసినవాఁడను;" అని చెప్పెను.

తత్క్షణమే తుములనినాదముచే నాకాశాననప్రాంతమంతయు ధ్వనిత మగునట్లుగా "తాము జీవానందగోస్వామి యని యెఱుఁగుదుము" అని ప్రత్యుత్తర శబ్ద మాయెను.

జీవానంద—చెప్పుఁడు "హారే మురారే" అని.

అంత పర్వత కందర కాననప్రాంతములయం దంతట వేల కొలఁది కంఠములనుండి "హారేమురారే" యని ధ్వనిత మాయెను.

జీవానంద— కొండ కాప్రక్కను శత్రువు లున్నారు. నేఁ డీపర్వతశిఖరమునందు ఈనీలాంబరియైన యామిని సాక్షా త్కారమై, సంతానులు యుద్ధము చేయవలయును; బిరాన రండు, ఎవరు ముందుగా శిఖరము నెక్కుదురో వారు జయిం తురు. అని చెప్పుచున్నది. కనుక, రండు. "వందేమాతరం" అనుఁడు.

అప్పుడు భూమ్యాకాశములు నిండునట్లుగా "వందేమాత రం" గీతా శబ్ద మయ్యెను. సంతానసైన్యము మెల్లమెల్లగా పర్వతారోహణము చేయ నారంభించెను. అయినను, అకస్మా త్తుగా మహేంద్రసింహుఁడు తూర్యనాదము చేయుచు త్వరిత

ముగా పర్వతమునుండి దిగివచ్చుటను గాంచి సంతానసైన్యము భయపడెను. చూచుచుండఁగనే పర్వతశిఖర ప్రదేశంబున నీలాకాశపటమందు ఫిరంగీలతో బారుతీఱిన యింగ్లీషువారి సైన్యము ప్రకాశించెను. ఉచ్చస్వరముతో వైష్ణవసైన్యము,

ఆన్వీక్షికీ త్రయీవార్తా దండనీతి స్త్వమేవచ,
సౌమ్యాసౌమ్యై ర్జగ ద్రూపై స్త్వయై తద్దేవిపూరితమ్,
కాత్వన్యాత్వామృతేదేవి సర్వయజ్ఞమయం వపుః.
వసుధే త్వమేవవిద్యా భ క్తిశ్శ క్తిశ్చబాహ్వోర్వః,
జననీద్రవిణం మిత్రం త్వంహి ప్రాణాశ్శరీరే.
త్వంహివిద్యా త్వంహి మాతా త్వంహి ప్రాణా శ్శరీరే,
త్వంహి భక్తిః త్వంహి శక్తిః త్వంహి ప్రాణా శ్శరీరే.

అని గానము చేసెను. అయినను, ఇంగ్లీషువారియొక్క ఫిరంగి గుండ్ల శబ్దమునం దామహాసంగీతశబ్దము మునిఁగిపోయెను. వేలకొలఁది సంతానులు హతాహతులై పర్వతరఘురియందు పడిపోయిరి మరల ,నా ఫిరంగిగుండ్లు, దధీచిఋషియొక్క వెన్నెముకతోఁ జేయఁబడిన వజ్రాయుధమును ధిక్కరించి, సముద్రతరంగములను తుచ్ఛముగాఁ జేసి, యాంగ్లేయుల వజ్రాయుధ మనునట్లుగా పరిణమించెను. సుపక్వమై నిలచిన సస్యము కొడవండ్లకుఁ జిక్కినట్లు సంతానసైన్యము ఖండింపఁ బడి ధరాశాయి యగుట కారంభ మాయెను. పతనశీల మైన శిలారాశివలె సంతానసైన్యము పర్వతప్రదేశమున నుండి వెనుకకుఁ దిరుగ నారంభించెను. ఎవ రెచ్చట పాఱిపోయిరో తెలియక పోయెను. జీవానందుఁడును మహేంద్రుఁడును పోవల దని కావించిన ప్రయత్నము వ్యర్థ మాయెను, అపు డాంగ్లే

యులు సకల సంతాన నాశముకొఱకు "హుర్రే! హుర్రే;" యని శబ్దముచేయుచు పర్వతమునుండి దిగిరి. తుపాకులను మోచికొని యతివేగముగా పర్వతమునుండి పడునట్టి విశాలమైన తటినీ ప్రపాతమువలె దుర్దమనీయమును అలంఘ్యమును అజయ్యమునైన బ్రిటిష్ సైన్యము పలాయనపరులైన సంతాన సైనికులను వెంబడించెను.

జీవానందుఁ డొకసారిమాత్రము మహేంద్రునిఁ గాంచి, "ఈదిన మంత్యకాల మాసన్నమైనది, రా; ఇచ్చటనే చచ్చిపోవుదము" అనెను.

మహేంద్ర—చచ్చుట కేమి, రణజయ మైనమీఁద చావవచ్చును. వ్యర్థముగాఁ జచ్చుట వీరధర్మము కాదు.

జీవానంద—నేను వ్యర్థముగనే చచ్చెదను. అయినను, యుద్ధమునఁ జచ్చెదను.

ఇట్లు చెప్పి, జీవానందుఁడు ఒక పార్శ్వంబుగాఁ దిరిగివచ్చి నిల్చి "ఎవరు హరినామమును నుడువుచు చచ్చుట కిష్టము గలవారో వారు నాతోడ రావచ్చు" నని యఱచి చెప్పెను.

అనేకులు ముందు పడిరి. జీవానందుఁడు వారినిఁ జూచి, "హరిసాక్షిగా ప్రాణము పోయినను వెనుకకుఁ దిరుగుటలేదని శపథము చేయవలయు" ననియెను.

అప్పుడు ముం దడుగిడినవారు వెనుకకు మఱలిరి. జీవానందుఁడు, "ఎవరును వచ్చుటలేదా? అట్లయిన నే నొక్కఁడనే పోయెద" ననియెను.

జీవానందుఁడు గుఱ్ఱముమీఁదనే చాలదూరము కొండ నెక్కిపోయి వెనుకనుండిన మహేంద్రునిం బిలిచి, "అన్నా,

నవీనానందునితో నేను వెడలిపోతి ననియును, లోకాంతరమునఁ జూచెద ననియును జెప్పు" మని చెప్పెను.

ఇట్లు చెప్పి యావీరపురుషుఁడు ఆలోహావృష్టి మధ్యమున గుఱ్ఱము నతివేగముతో విడిచెను. ఎడమచేతియందు బల్లెమును కుడిచేతియందు తుపాకియు నున్నది. నోట "హారే మురారే హారే మురారే" యనుశబ్దము. యుద్ధముచేయు ప్రయత్నమే లేదు ఇట్టిసాహసమువలన ఫల మేమియును లేదు. అయినను "హారే మురారే" అని పాడుచు జీవానందుఁడు శత్రువ్యూహ మధ్యంబునం బ్రవేశించెను.

పలాయనపరులైన సంతానులను సంబోధించి, మహేంద్రుఁడు "చూడుఁడు, ఒకతూరి వెనుకకుఁదిరిగి జీవానందగోస్వామిని చూడుఁడు, చూచినచో మీరు చావరు" అనియెను.

కొందఱు సంతానులు వెనుకకు దిరిగి జీవానందుని అమానుషకీర్తినిఁ జూచిరి. మొదట విస్మితులైరి. పిదప, "జీవానందునికి మాత్రము చచ్చుటకుఁ దెలియునా? మాకుఁ దెలియదా? పదండి; జీవానందునితోడ మనమును వైకుంఠమునకుఁ బోవుదము" అనిరి.

దీనిని విని కొందఱు సంతానులు మరలిరి. వారినిఁ గాంచి యింకను గొందఱు మరలిరి. మఱియుఁ గొందఱు నల్లే చేసిరి. ఇందువలన మహాకోలాహల మాయెను. జీవానందుఁడు శత్రువ్యూహమధ్యమునఁ బ్రవేశించెను. సంతాను లెవ్వరును మరల నతనిని గాంచ రైరి.

ఇచ్చట రణక్షేత్రమునుండి సంతానులు చూచుచుండఁగనే కొందఱు సంతానులు వెనుకకుఁ దిరిగి వచ్చుచుండిరి. అంద

లును మనస్సున సంతానులకు జయ మాయెను. శత్రువులను బాఱఁద్రోలి వచ్చుచున్నారని తెలిసికొని 'కొట్టుఁడు, శత్రువులను నఱుకుఁడు' అని శబ్దము చేయుచు మరల నింగ్లీషువారి సైన్యముపైఁ బడిరి.

ఇచ్చట ఇంగ్లీషువారి సైన్యమునందు కలత కల్గెను. సిపాయీలు యుద్ధప్రయత్నమును మాని రెండువైపులకు బాఱుచుండిరి. ఆంగ్లేయులు సహితము తుపాకులను దించుకొని శిబిరాభిముఖులై పాఱిరి. మహేంద్రుఁ డట్టిటు చూచుచుండఁగనే పర్వతశిఖరమం దసంతమైన సంతాన సైన్యమును గాంచెను. వారు వీరదర్పముతో దిగివచ్చుచు ఇంగ్లీషువారి సైన్యమును నాక్రమించుచుండిరి. మహేంద్రుఁ డెలుఁగెత్తి సంతానులను గూర్చి "సంతానులారా ! అట చూడుఁడు ; తర్వాత శిఖరంబున ప్రభువు సత్యానందగోస్వామి ధ్వజము కానఁబడుచున్నది. నేఁడు స్వయముగా మురారి యైన మధుకైటభ నిషూదనుఁడగు కంసకేశి రణక్షేత్రమున వచ్చి యున్నాఁడు ! పర్వతముపై లక్షసంతాను లున్నారు 'హారే మురారే! హారే మురారే!' యని చెప్పుఁడు. లెండు; లేచి శత్రువుల ఱొమ్ము పగులునట్లు కొట్టుఁడు. లక్షసంతానులు పర్వతముపై నున్నారు" అని చెప్పెను.

అప్పుడు 'హారేమురారే' అనెడి భీషణధ్వని పర్వతకందరకాననప్రాంతరమెల్ల నిండి నిబిడీకృతి మాయెను. సకల సంతానులయొక్క "మాభైః మాభైః" (భయమువద్దు భయమువద్దు) అను రవము లలితమైన తాళధ్వనియై, తళతళ మెఱయ నస్త్రముల ఝుణంఝుణశబ్దమునందు లయముకాఁగా సర్వజీవము

లును విమోహితము లాయెను. వేగముగా మహేంద్రుని సంతాన వాహినీ ప్రవాహము పర్వతము నధిరోహణము సేయ నారంభించెను. శిలలచే ఘాత ప్రతిఘాతములై ప్రతిప్రేరితమైన నిర్ఝరిణివలె రాజసైన్యము విలోడితమై స్తంభీభూతమై భీతితో పరుగిడి పోయెను. ఆసమయంబున నిరువదియైదువేల సంతాన సైన్యమును దీసికొని స్వయముగా సత్యానందబ్రహ్మచారి పర్వత శిఖరమునుండి యాంగ్లేయులపై సముద్రమే యుప్పొంగి వచ్చినట్లుగా పడెను. అత్యంతము భయంకరమైన యుద్ధము జరిగెను. ఎట్లు రెండు పెద్దపెద్ద ఱాతిబండల సంఘర్షణము నడుమ నల్పమైన చీమలు చిక్కి పొడియై ధూళిపటలమై పోవునో, యట్లు రెండు సంతానసేనల సంఘర్షణముచే నా విశాలమైన రాజసైన్యము పర్వతసానుదేశమున నలిగి పొడియై పోయెను.

వారన్ హేస్టింగ్సు నొద్దకుపోయి, ఈసమాచారమును దెల్పుటకుఁగూడ నొక్కఁడును లేఁడు. అందఱును హతులైరి.

---

## నలుబదినాలుగవ ప్రకరణము

### సంతాన సేనావిజయము.

పూర్ణిమారాత్రి! —ఆభీషణంబగురణక్షేత్ర మిప్పుడు స్థిర మాయెను. గుఱ్ఱంబుల పటపట శబ్దమును, తుపాకుల దడదడ శబ్దమును, ఫిరంగిగుండ్ల ఢంఢం శబ్దమును, సర్వవ్యాపకమైన ధూమమును లేదు. "హుర్రే" అని చెప్పువాఁడును లేరు. హరిధ్వని చేయువారును లేరు. శబ్దముమాత్రము

చేయుచుండినవి ; ఏవి ? నక్కలు, కుక్కలు, గద్దలు, ఇవిగాక ఆ హతులైన జనుల క్షణిక మైన ఆర్తనాదము. కొందఱు ఛిన్నహస్తులు ; కొందఱు ఛిన్నమస్తకులు; కొందఱకు కాళ్లు భగ్నములై యుండెను ; కొందఱకు శరీరము చిల్లులుపడి పోయెను ; కొందఱు గుఱ్ఱములక్రిందఁ బడి యుండిరి ; కొందఱు అమ్మా ! యనుచుండిరి ; కొందఱు అయ్యో ! యని యఱచుచుండిరి ; కొందఱు దాహము అనుచుండిరి ; కొందఱు మూలుగుచుండిరి. బంగాళీలు, తురకలు, ఇంగ్లీషువారు, హిందూస్థానీలు, తెలగాలు, అఱవలు, అందఱు నేకత్ర జడజడితమై మృతులైరి. ఆమాఘమాసపు పూర్ణిమా రాత్రియందు ఆదారుణమైన శీతమున వెలుఁగుచుండు వెన్నెలయందు రణభూమి అతిభయంకరమై కానఁబడుచుండెను. అప్పటికిఁ బోవుట కెవ్వరికిని ధైర్యము లేదు.

ఎవ్వరును ధైర్యముచేసి పోలేదు. అయినను, ఆ యర్ధరాత్రి సమయంబున నొకరమణీమణి ఆ యగమ్యమైన రణక్షేత్రంబున తిరుగుచుండెను. ఒక మషాలును వెలిఁగించుకొని దానివెల్తురున నేమో వెదకుచుండెను. ప్రతిశవముయొక్క ముఖమును ఆవెల్తురులోఁ జూచుచుండెను. ఎచ్చటనైనను శవము గుఱ్ఱముక్రింద పడి యుండినచో, నాయువతీమణి చేతిలోనున్న వెల్తురుకట్టెను దిగువ నుంచి, గుఱ్ఱమును రెండుచేతులతో లాగివేసి ఆశవమును పరీక్షించి చూచును. ఈరీతిగా వెదకుచు నారణక్షేత్రము నంతయుఁదిరిగెను. వెదకుచుండినశవ మెక్కడను దొరకలేదు. అప్పుడు వెల్తురును బాఱవైచి యాశవరాశిపూర్ణమైన రక్తమయభూమిపైఁ బడి యేడ్చుచు పొరలాడు

చుండెను. ఈమెయే శాంతి ; జీవానందుని కళేబరమును వెదకు చుండెను.

శాంతిఏడ్చుచు పొరలాడుచుండిన సమయమునందు, అతి మధుర మైన సకరుణధ్వనిచే, "ఏడ్చువా రెవరు? లేవమ్మా! యేడ్వవలదు" అని చెప్పిన మాటలను విని, శాంతి తిరిగి చూడఁగా నెదుట నాజ్యోత్స్నాలోకంబునందు వెనుక నెపుడు చూడని జటాజూటధారియైన పురుషుఁడు నిలిచి యుండెను.

శాంతి ఏడ్చుచు లేచి నిలువంబడెను. వచ్చిన మహాపురుషుఁడు "ఏడ్వవలదమ్మా! జీవానందుని దేహమును నేను వెదకి యిచ్చెదను, నాతోరమ్ము" అనియెను.

అప్పు డతఁడు శాంతిని రణక్షేత్ర మధ్యస్థలంబునకుఁ బిలిచికొని పోయెను. అచ్చట అసంఖ్యేయములగు శవరాసు లొకదానిపై నొకటిగా పడియుండెను. శాంతిచేత దానిని కదలించుటకు కాకపోయెను. ఆ బలిష్ఠుం డగు మహాపురుషుఁడు దానినంతయుఁ దీసి యొకశవమును వెలికిఁ దీసెను. దానినిఁ గాంచి శాంతి జీవానందుని దేహ మని గుర్తించెను. సర్వాంగమును గాయములచే రక్తమయమై యుండెను. శాంతి చూచి సామాన్య స్త్రీవలె విలపింప నారంభించెను.

ఆ మహాపురుషుఁడు, మరల "ఏడ్వవలదమ్మా! జీవానందుఁడు చావలేదు. స్థిరముగా నతని దేహమును పరీక్షించి చూడుము, మొదట నాడిని పట్టిచూడుము" అనియెను.

శాంతి శవముయొక్క నాడినిబట్టి చూచెను. కొంచె మైనను గతి లేదు. ఆపురుషుఁడు "రొమ్ముపై చేయి నిడి చూడు" మనియెను.

శాంతి హృత్పిండముండుచోట ఎదపై చేయి నిడి చూచెను. అచ్చటను గతి లేకుండెను. శరీరమంతయు చల్లనై పోయి యుండెను.

అతఁడు మరల, "ముక్కునొద్ద చేయియుంచి శ్వాస మాడుచున్నదా? లేదా? చూడు" మనెను.

శాంతి చూడఁగా నేమియు నుండలేదు.

ఆ పురుషుఁడు, "నోట యుష్ణ మున్నదేమో వ్రేలిడి చూడు" మనెను. ఆ విధముగా, నోట వ్రేలిడి చూచెను. 'చక్కఁగా దెలియలేదు' అనిచెప్పి భర్త జీవించునేమో యనెడి యాలోచన చేయుచు నేమియుఁ బలుకక యూరకుండెను.

ఆ మహాపురుషుఁడు తన యెడమచేతితో జీవానందుని దేహమును స్పృశించి, "నీవు భయముచే హతాశురాలవై యున్నందువలన నేమియుఁ దెలియక పోయెను. శరీరమున నింకను ఉష్ణమున్నట్లు కన్పట్టుచున్నది; మరల చూడు" మనియెను.

శాంతి మరల నాడిని బట్టి చూచెను. నాడికి కొంచెము గతి కలిగెను. విస్మితురాలై యెదపై చేయిడి చూచెను. దడ దడ కొట్టుకొనుచుండెను. ముక్కునొద్ద వ్రేలిడి చూడఁగా శ్వాస మాడుచుండెను. నోటియందును ఉష్ణము నుండెను. ఆశ్చర్యపరవశురాలై, "ప్రాణ ముండెనో? లేక క్రొత్తగా వచ్చెనో?" యనెను.

అతఁడు, "అట్లుండఁడు; అయినను, నీ వితని నెత్తికొని ఆ కనఁబడు పుష్కరిణియొద్దకుఁ దేఁగలవా? నేను వైద్యుఁడను, ఇంకను చికిత్స చేయవలయును." అనెను.

శాంతి అనాయాసముగా జీవానందుని చంకయందిడుకొని కొలనియొద్దకుఁ దీసికొని పోయెను. ఆవైద్యుఁడు "నీవు శరీర మందలి రక్తమును గడుగుచుండుము, నేను ఔషధములను దెచ్చెదను" అనిచెప్పి వెడలిపోయెను. శాంతి వైద్యుఁడు చెప్పినమేరకు రక్తము నంతయుఁ గడుగుచుండెను.

శాంతి, కడుగుచుండఁగనే వైద్యుఁడు అడవియాకులను తీఁగెలను దెచ్చి రసముదీసి గాయములకుఁ బూసి దేహమును తనచేతితోఁ దడవెను. జీవానందుఁడు దీర్ఘశ్వాసము విడిచి లేచి కూర్చుండి, శాంతినిఁ జూచి "యుద్ధమున నెవరు జయించిరి?" అని యడిగెను.

శాంతి, "నీకే జయ మాయెను. ఈ మహాపురుషునకు సాష్టాంగదండప్రణామంబు లాచరింపు" మనియెను.

అప్పు డాయిరువురును చూడఁగా నెవ్వరు నుండలేదు! ఎవరికి నమస్కరించుట?

సమీపమునందే జయశాలులైన సంతానుల కోలాహల మగుచుండెను. అయినను, శాంతిగాని జీవానందుఁడుగాని లేచి పోలేదు. ఆ పూర్ణచంద్రకిరణోజ్జ్వలమై ప్రకాశించు పుష్కరిణి సోపానములపైఁ గూర్చుండి యుండిరి. జీవానందుని శరీరము ఔషధ మహిమచేఁ గొంచెము సేపులోనే స్వస్థ మయ్యెను. అతఁడు "శాంతీ! చికిత్సకుని యౌషధము ఆశ్చర్యకరమైనది! నా శరీరమునం దేవేదనయును లేదు. ఇపు డెచ్చటికి పోవల యునో నడువుము. అదిగో అచ్చట సంతానుల జయసూచక మైన యుత్సవము జరుగుచున్నది" యనెను.

శాంతి, "ఇంక అచ్చటికి పోనేల? మహామాతయొక్క కారోద్ధార మాయెను. ఈదేశము సంతానుల వశ మాయెను. మనకు రాజ్యంబున భాగము వద్దు" అనెను.

జీవానంద—దేనిని జయించినామో దానిని బాహుబలముచే గాపాడుకొనవలదా?

శాంతి—కాపాడి యుంచుకొనుటకు మహేంద్రుఁడున్నాఁడు. సత్యానందుఁడు నున్నాఁడు. నీవు ప్రాయశ్చిత్తము జేసికొని సంతానధర్మంబునకై దేహమును త్యజించి యుంటివి. ఇప్పుడు మరల ప్రాప్తమైన దేహమునందు సంతానుల కేమియు నధికారము లేదు. మనము సంతానుల పాలిటికి చచ్చినవారమై యున్నారము. ఇప్పుడు సంతానులు మనలఁ జూచినచో; "జీవానందుఁడా యుద్ధసమయమునఁ బ్రాయశ్చిత్త భీతిచే దాఁగికొని యుండి జయమైనందున రాజ్యభాగమునకై వచ్చి యున్నాఁడు." అని చెప్పుదురు.

జీవానంద—అదెట్లు; శాంతీ! జనాపవాదంబునకు వెఱచి మనముచేయుపనులను మానవలయునా? మనపని మాతృసేవ. ఎవ రేమిచెప్పినను నేను మాతృసేవను వదలను.

శాంతి—దానికి నీకు మరల నధికారము లేదు. ఏమనఁగా, నీవు మాతృసేవానిమిత్తమై దేహమును త్యజించితివి. మరల మాతృసేవ చేయవలసినయెడల నీప్రాయశ్చిత్తము నిష్ప్రయోజన మగును. మాతృసేవకంటె ప్రాయశ్చిత్తము శ్రేష్ఠ మైనది. లేకుండినచో, కేవల మీతుచ్ఛమైన ప్రాణమును పరిత్యజించుటొక పెద్దపనియా?

జీవానంద—శాంతీ! నీవే శాస్త్రసారమును దెలిసిన దానవు. నే నీ ప్రాయశ్చిత్తమును అసంపూర్తి చేయుటలేదు. నాసుఖము సంతానధర్మమందే—ఆసుఖమునందు వంచితుఁడ నయ్యెదను అయినను, పోవు టెచ్చటికి? మాతృసేవను మాని యింటికిఁ బోయి సుఖభోగముల ననుభవించుటకు వలను పడదుగదా.

శాంతి—నే నట్లు చెప్పుదునా! ఛీ! మన మింక గృహస్థులము కాము. ఇట్లే యిరువురమును సన్న్యాసులమై యుందము గాక—చిరబ్రహ్మచర్యమును గాపాడుదము. నడువుము; దేశదేశంబులందు చని తీర్థయాత్రలు చేసికొని యుందము.

జీవానంద—తర్వాత?

శాంతి—తర్వాత హిమాలయమునందు కుటీరము నేర్పఱుచుకొని దేవతారాధన చేయుదము. దేనిచే మన మహామాతకు మంగళ మగునో యావరమును వేఁడుదము.

అంత నాయిర్వురును లేచి యొకరిచేయి నొకరుపట్టుకొని నడుచుచు జ్యోత్స్నామయమైన యర్ధరాత్రియం దనంతమున నంతర్హితు లైరి.

హా తల్లీ! మరల రాఁగలరా? జీవానందునివంటి పుత్త్రుని శాంతివంటి పుత్త్రిని మరల గర్భంబునందు ధరియించెదవా?

---

## నలుబదియైదవ ప్రకరణము

### ఉపసంహారము

సత్యానందుఁడు రణక్షేత్రమునుండి యెవ్వరికి నేమియుఁ జెప్పక ఆనందమఠంబునకు వెడలి పోయెను. అచ్చట నా గంభీర

మైన రాత్రికాలమున విష్ణుమండపమునం గూర్చుండి ధ్యానము చేయుచుండెను. ఆసమయమునందు చికిత్సకుఁ డచ్చటికి వచ్చి దర్శన మొసంగెను. అతనింగాంచి సత్యానందుఁడు లేచి ప్రణామము లాచరించెను

చికిత్సక—సత్యానందా! నేఁడు మాఘపూర్ణిమ.

సత్యానంద—దయచేయుఁడు; నేను సిద్ధముగా నున్నాఁడను, అయినను "ఓమహాత్మా! నాకొక సందేహ మున్నది. దానిని నివర్తి చేయవలయును. నేనేముహూర్తమున యుద్ధమునందు జయమొంది యార్యధర్మమును నిష్కంటకముగా నొనర్చితినో, యాముహూర్తమునందే యీకార్యమునందు ప్రవర్తింపవల దనెడియాజ్ఞ యేల!"

చికిత్సక—నీకార్యము సిద్ధ మాయెను. మసల్మానుల రాజ్యము ధ్వంస మాయెను. ఇంక నిచ్చట నీ కేపనియు లేదు. నిష్ప్రయోజనముగాఁ బ్రాణహత్యచేఁ బ్రయోజనము లేదు.

సత్యానంద—మసల్మానులరాజ్యము ధ్వంసమాయెను. అయినను హిందూరాజ్యము స్థాపితము కాలేదు. ఇప్పటికిని కలకత్తాలో నాంగ్లేయులు ప్రబలులై యున్నారుకదా ?

చికిత్సక—హిందూ రాజ్య మిప్పుడు స్థాపితము కాదు. ఇప్పుడు నీవుండినచో నిష్ప్రయోజనముగా నరహత్యలు సంభవించును కావున వెడలుము.

ఈమాటను విని సత్యానందుఁ డత్యంత చింతాక్రాంతుఁడై "ఓప్రభూ! హిందూ రాజ్యము స్థాపితము కాకుండిన నెవ్వరు రాజు లగుదురు? మరల తురకలే రాజు లగుదురా?" అనెను.

చికిత్సక—లేదు. ఇప్పు డాంగ్లేయులు రాజు లగుదురు.

సత్యానందుని నేత్రములనుండి కన్నీరు ప్రవహింప నారంభించెను. అతఁడు మీఁదనున్న మాతృరూప మైన జన్మ భూమియొక్క ప్రతిమదిక్కు మొగంబై చేతులు మోడ్చికొని బాష్పనిరుద్ధస్వరముతో "హా! తల్లీ! నీయుద్ధారమును జేయఁ జాలకపోతిని. మరల నీవు మ్లేచ్ఛులచేతికిఁ జిక్కుదువు; సంతానుల యపరాధమును మన్నింపుము. తల్లీ! యేల రణక్షేత్రంబున నేఁడు నాప్రాణములు పోవయ్యెను" అని మొర యిడెను.

చికిత్సక—సత్యానందా! వ్యసనపడవలదు అన్యాయధనముచే రణజయమును బడసితివి. పాపకార్యముచేసి పుణ్యఫలము గోరిన సిద్ధించునా? ఇఁక నన్నియు మంచిదే యగును. ప్రకృతమున ఇంగ్లీషువారు రాజులుగానున్నారు. ఇఁక ఆర్యధర్మము పునరుద్ధార మగును. ఈవిషయమున మహాత్ములు చెప్పియుండుమాటనే నేనును జెప్పెదను. సావధానచిత్తుండవై వినుము. ముప్పదిమూఁడుకోట్ల దేవతలను బూజించుట ఆర్యధర్మము కాదు. అది యొక లౌకికమైన అపకృష్ట ధర్మము. దాని ప్రభావమే యిప్పటి యార్యధర్మమై యున్నది. మ్లేచ్ఛులు దేనిని హిందూధర్మ మనియెదరో యది లోపమై పోయినది. శుద్ధమైన హిందూధర్మము జ్ఞానాత్మక మైనది. అది కేవలము కర్మాత్మక మైనది కాదు. ఆజ్ఞానము రెండువిధములు. బహిర్విషయిక మైన దొక్కటి. అంతర్విషయిక మైన దొక్కటి. అంతర్విషయిక మైనజ్ఞానమే ఆర్యధర్మప్రధానభాగము. అయినను, బహిర్విషయిక మైన జ్ఞానము మొదట పుట్టకుండినచో, నంతర్విషయికజ్ఞానము కలుగుట దుర్లభము. స్థూలమును దెలియకుండినచో సూక్ష్మమును దెలియుట కష్టము. ఇప్పు డీదేశము

నందు బహుకాలమునుండి బహిర్విషయిక మైనజ్ఞానము విలుప్తమైపోయినది. ఆర్యధర్మమును పునరుద్ధారము చేయవలసి వచ్చినచో, మొదట బహిర్విషయికజ్ఞానమును ప్రచారము చేయవలయును. ఇప్పు డీదేశంబున బహిర్విషయిక మైనజ్ఞానమే లేదు. తెలిసి చెప్పెడివారును లేరు. మనము జనులకు నేర్పఁగల సమర్థులము కాము. అందువలన, వేఱే దేశమునుండి బహిర్విషయికజ్ఞానము రావలయును. ఇంగ్లీషువారు బహిర్విషయికజ్ఞానమున పండితులు జనులకు నేర్పుటయందు సమర్థులై యున్నారు. కనుక నాంగిలేయులు రాజులు కావలయును. ఇంగ్లీషు నేర్చినచో జనులు బహిర్విషయికజ్ఞానమున సుశిక్షితులై అంతస్తత్త్వమును దెలిసికొనుటకు సమర్థు లగుదురు. అపు డార్యధర్మప్రచారమునకు విఘ్నము సంభవింపదు అప్పుడు నిజధర్మము తనంతట పునరుద్దీప్త మగును. ఎన్నిదినము లట్లగుటలేదో; యెన్నిదినములు హిందువులు జ్ఞానులగుట లేదో; గుణాఢ్యు లగుటలేదో; బలిష్ఠులగుటలేదో; అన్నిదినములు ఇంగ్లీషువారిరాజ్యము అక్షయముగా నుండును. వారి రాజ్యమునందు ప్రజలు సౌఖ్యము నొందుదురు నిష్కంటకముగా ధర్మాచరణము నాచరింపఁగలరు, కావున, నోబుద్ధిశాలీ! ఆంగ్లేయులతో యుద్ధముచేయక నన్ననుసరించి నాతోడరమ్ము.

సత్యానంద—మహాత్మా! ఆంగ్లేయులే రాజులుగ నుండవలయు ననియును, ఆంగ్లేయులరాజ్యమే యీదేశంబునకు మంగళదాయక మైనదనియు దమకుఁ దెలిసియుండియు నీనృశంసమైన యుద్ధకార్యమునందు నన్నేల నియమించితిరి?

మహాపురుషుఁడు—ఆంగ్లేయు లిపుడు వర్తకులు. అర్థ సంగ్రహముందే బుద్ధిగలవారై యున్నారు. రాజ్యశాసనభార మును వహించుట కష్టము లేదు. ఈసంతాన విద్రోహామే కారణమై రాజ్యశాసనభారమును వహింపవలసివచ్చును. ఏమ నఁగా, రాజ్యశాసనము చేయకగాని అర్థసంగ్రహము కాదు. ఆంగ్లేయులురాజ్యాభిషిక్తు లగుటకే సంతానవిద్రోహము సంఘ టించెను. ఇప్పుడు వెళ్లుము. జ్ఞానసంపన్నుఁడ వైనపిదప నీకు నీవే సర్వమును దెలిసికొనఁగలవు.

సత్యానంద—మహాత్మా! నాకు జ్ఞానలాభంబునం దభి రుచి లేదు. జ్ఞానముతో నాకుఁ బనిలేదు. నే నేవ్రతమునందు వ్రతినై యుంటినో యావ్రతమును రక్షించుకొని యుండెద. నావ్రతమైన మాతృభక్తి యచలముగా నుండున ట్లాశీర్వ దింపుఁడు.

మహాపురుష—వ్రతము సఫల మాయెను. తల్లియొక్క మంగళమును సాధించితివి. ఆంగ్లేయరాజ్యమును స్థాపితము చేసితివి. యుద్ధవిగ్రహములను విడువుము. జనులు కృషి కార్య మున నియుక్తు లగుదురుగాక. పృథ్వి సస్యశాలిని యగుఁగాక.

సత్యానందుని నేత్రములనుండి అగ్నికణములు రాలెను. అతఁడు, "శత్రువుల రక్తమును పాఱించి మాతను సస్యశాలిని గాఁ జేసెద" ననెను.

మహాపురుష—శత్రువు లెవరు? శత్రువు లింకలేరు. ఆం గ్లేయులు మిత్రరాజులు. ఆంగ్లేయులతో యుద్ధముచేసి జయిం చుటకు శక్తి గలవారును ఎవ్వరును లేరు.

సత్యానంద—శక్తి లేకుండినచో నిచ్చటనే నీమాతృ ప్రతిమయొక్క సాన్నిధ్యముననే దేహత్యాగము చేసెదను.

మహాపురుష—ఇట్లు చేయుట అజ్ఞానముచేతనే? నడు వుము. జ్ఞానలాభమును బడయుదువు. హిమాలయశిఖరంబున మాతృమందిర మున్నది. అచ్చటనే మాతృమూర్తిని నీకుఁ జూపించెదను.

ఇట్లనిచెప్పి, ఆమహాపురుషుఁడు సత్యానందుని చేయి పట్టుకొనిపోయెను. ఏమి యపూర్వమైన శోభాకాంతి! ఆ గంభీర మైన విష్ణుమందిరమున నాప్రకాండమండితచతుర్భుజమూర్తి యొక్క సమ్ముఖంబున, బ్రాహ్మముహూర్తమున వెన్నెల వెలుం గున మహాప్రతిభాపూర్ణు లగు నిరువురు పురుషమూర్తులును ఒకరు మఱియొకరి చేతినిపట్టుకొని నిలిచిరి. ఎవరు ఎవరినిఁ బట్టు కొనియున్నారు? జ్ఞానము భక్తి చేతినిఁబట్టికొని యున్నట్లును, ధర్మము కర్మము చేతినిఁ బట్టికొని యున్నట్లును, నివృత్తి ప్రవృత్తిచేతినిఁ బట్టుకొని యున్నట్లును, కల్యాణి శాంతి చేతినిఁ బట్టికొని యున్నట్లును నుండెను. ఈసత్యానందుఁడే శాంతి; ఈమహాపురుషుఁడే కల్యాణి; సత్యానందుఁడే ప్రవృత్తి; ఈమహాపురుషుఁడే నివృత్తి. నివృత్తి ప్రవృత్తినిఁ దోడ్కొని పోయెను.

సమాప్తము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1948

# APPENDIX I

HISTORY OF

# THE SANNYASI REBELLION

**From Warren Hasting's Letters in Gleig's Memoirs.**

You will hear of great disturbances committed by Sannyasis, or wandering Fakirs, who annually infest the Province, about this time of the year, in pilgrimages to Jaggannath, going in bodies of 1000 and sometimes even 10,000 men. An officer of reputation (Captain Thomas) lost his life in an unequal attack upon a party of these banditti, about 3000 of them, near Rangapore, with a small party of Pergona Sepoys, which has made them more talked of than they deserve. The Revenue, however, has felt the effects of their ravages in the Northern Districts. The new establishment of sepoys which is now forming on the plan enjoined by the Court of Directors and distribution of them ordered for the internal protection of the provinces, will I hope effectually secure them hereafter from these incursions.--Hastings to Sir George Colebrooke—dated 2nd February 1773—Gleig's Memoirs, Vol. 1, 282.

Our own provinces have worn something of a warlike appearance this year, having been infested by a band of Sannyasis, who have defeated two small partiess of Purgunna Sepoys(a rascally corps)

and c. ' off the two officers who commanded them. One was Captain Thomas, whom you know. Four battalions of the brigade Sepoys are now in pursuit of them, but they will not stand any engagement, and have neither camp equipage nor even clothes, to retard their flight. Yet I hope we shall yet make an example of some of them as they are shut in by rivers which they cannot pass when closely pursued.

The history of these people is very curious. They inhabit or rather possess the country lying south of the hills of Tibbet from Kaubul to China. They go mostly naked; they have neither towns, houses nor families, but rove continually from place to place recruiting their number with the healthiest children they can steal in the countries through which they pass. Thus they are the stoutest and the most active men in India. Many are merchants. They are all pilgrims, and held by all castes of Gentoos in great veneration. This infatuation prevents our obtaining any intelligence of their motion or aid from tne country against them, notwithstanding very rigid orders which have been published fot these purposes in so much that they often appear in the heart of the province as if they dropt from heaven. They are hardy; bold and enthustiasic to a degree surprising credit. Such are the Sannyasis, the Gipsies of Hindustan.

We have dissolved all Pargunn Sepoys and fixed stations of the brigade Sepoys on our frontiers, which are to be employed only in the defence of the provinces, and to be relieved every three months. This I hope will secure the peace of the

country against future irruptions, and as they are no longer to be employed in the collections, the people will be freed from the oppressions of our own plunderers.—Hastings to Tosias Du Pre—9th March 1773.

We have lately been much troubled here by hordes of desperate adventurers called Sannyasis, who have overrun the Province in great numbers and committed great depredations. The particulars of these disturbances and of our endeavours to repel them you will find in our general letters and consultations, which will acquit the Government of any degree of blame from such a calamity. At this time we have five battalions of sepoys in pursuit of them, and I have still hopes of exacting ample vengeance for the mischief they have done us, as they have no advantage over us but in the speed with which they fly from us. A minute relation of these adventures cannot amuse you, nor indeed are they of great moment, for which reason give me leave to drop the subject, and lead you to one in which you cannot but be more interested &c.—Hastings to Purling dated 31st March 1773—Para 4. Gleig's Memoirs of Hastings—294 Vol. 1.

In my last I mentioned that we had every reason to suppose the Sannyasi Fakirs had entirely evacuated the Company's Possessions. Such were the advices I then received and their usual progress made this highly probable. But it seems they were either disappointed in crossing the Burramputra river, or they changed their intention, and returned in several bands of about 2000 or 3000 each, appearing unexpectedly in different

parts of the Rungapoor and Dinagepoor provinces. For in spite of the strictest order issued and the severest penalties threatened to the inhabitants in case they fail in giving intelligence of the approach of the Sannyasis they are so infatuated by superstition as to be backward in giving the information, so that the banditti are sometimes advanced into the very heart of our provinces before we know anything of their motions; as if they dropt from heaven to punish the inhabitants for their folly. One of these parties falling in with a small detachment commanded by Captain Edwards, an engagement ensued wherein our sepoys gave way, and Captain Edwards lost his life in endeavouring to cross a Nulla. This detachment was formed of the worst of our purganna sepoys, who seemed to have behaved very ill. This success elated the Sannyasis, and I heard of their depredations from every quarter in those Districts. Captain Stewart with the nineteenth battalion of sepoys, who was before employed against them, was vigilent in the pursuit, wherever he could hear of them, but to no purpose. They were gone before he could reach the places to which he was directed. I ordered another battalion from Burrampoor to march immediately to co-operate with Captain Stewart, but to act separately in order to have the better chance of falling in with them. At the same time I ordered another battalion to march from Dinapoor station through Tyroot and by the northern frontier of the Purneah Province, following the track which the Sannyasis usually took, in order to intercept them in case they marched that way. This battalion after acting against the Sannyasis, if occasion

offered, was directed to pursue their march to Cooch Behar, where they are to join Captain Jones and assist in the reduction of that country.

Several parties of the Sannyasis having entered into the Purneah Province, burning and destroying many villages there, the Collector applied to Captain Brooke who had just arrived at Panity, near Rajmahal, with his newly raised battalion of light infantry. That officer immediately crossed the river, and entered upon measures against Sannyasis and had very nearly fallen in with a party of them, just as they were crossing the Cosa river, to escape out of that Province. They arrived on the opposite bank before their rear had entirely crossed, but too late to do any execution among them. It is apparent now that the Sannyasis are glad to escape as they can out of theCompany's possession, but I am still in hopes, that some of the many detachments now acting against them may fall in with some of their parties, and punish them exemplarily for their audacity.

It is impossible but that on account of the various depredations which Sannyasis have committed, the Revenue must fall short in some of the Company's Districts as well from real as from pretended losses. The Board of Revenue aware of the last consideration, have come to the resolution of admitting no pleas for a reduction of revenue but such as are attended with circumstances of conviction; and by this means they hope to prevent, as much as in their power, all impositions on the Government, and to render the loss to the Company as inconsiderable as possible. Effectual means will be used by stationing some small detachment

at proper posts on our frontier to prevent any future incursions from the Sannyasi Fakirs, or any other roving Banditti,, a measure which only the extra-ordinary audacity of their last incursions have manifested to be necessary. This will be effected without employing many troops, and I hope in no future time the Sannyasis shall again suffer from this cause.—Hastings to Sir George Colebroke—dated 31st March 1773.

The Sannyasis threatened us with the same disturbances from the beginning of this year as we experienced from them the last. But by being easily provided to oppose them, and one or two severe checks which they received in their first attempt, we have kept the country clear of them. A party of horse which we employed in pursuit of them chiefly contributed to intimidate these ravagers who seemed to pay little regard to our sepoys, having so much the advantage of them in speed, on which they entirely rely for their safety. It is my intention to proceed more effectually against them by expelling them from their fixed residences which they have established in the north-eastern quarter of the province and by making severe examples of the Zamindars who have afforded them protection or assistance.—Hastings to Lawren e—dated 20th March 1774.

---

## APPENDIX II.

History of the Sannyasi Rebellion. From the "Annals of Rural Bengal."

" A set of lawless banditti " wrote the Council in 1773, "known under the name of Sannyasis or Fakirs have long infested these countries, and

under pretence of religious pilgrimage, have been accustomed to traverse the chief part of Bengal begging, stealing and plundering wherever they go, and as it best suits their convenience to practice." In the years subsequent to the famine, their ranks were swollen by a crowd of starving peasants who had neither seed nor implements to recommence cultivation with, and the cold weather of 1772 brought them down upon the harvest fields of Lower Bengal, burning, plundering, ravaging in "bodies of fifty thousand men." The Collecto called out the military; but after a temporary su cess our Sepoys "were at length totally defeated, a Captain Thomas (their leader) with almost th whole party cut off." It was not till the close of the winter, that the Council could report to the Court of Directors that a battalion, under an experienced Commander, had acted successfully against them, and a month later we find that even this tardy intimation had been premature. On the 31st March 1773, Warren Hastings finally acknowledges that the commander who had succeeded Captain Thomas "unhappily underwent the same fate, that four battalions of the army were then actively engaged against the banditti, but that, in spite of the militia levies called from the landholders, their combined operations had been fruitless. The Revenue could not be collected, the inhabitants made common cause with the marauders, and the whole rural administration was unhinged. Such excursions were annual episodes in what some have been pleased to represent the *still life* of Bengal.—Hunter's annals of Rura Bengal, pp. 70—72.